# తను ఇచ్చే సలహా డాక్టరూ పాటిస్తారు!

డాక్టరు వృత్తి చాలా కష్టమైనది. తరచు అర్జంటు కేసులు వస్తాయి. రోగులని చూస్తూ అనేక గంటలసేపు పని చేయవలసి వస్తుంది. రాత్రనక, పగలనక రోగులు వస్తూనే ఉంటారు. కాదనకుండా వాళ్ళని చూడాలి. చెప్పలేనంత అలసట వస్తుంది.

అందుకే నేను హార్లిక్స మీదే ఆధారపడతాను.

హార్లిక్స, పోషక శక్తినిచ్చే పదార్థాలు గల రుచికరమైన, ఉత్సాహాన్నిచ్చే పానీయం. రోజంతా పనిచేసి అలసిపోయిన తరువాత హార్లిక్స త్రాగితే ఆ అలసటంతా పోతుంది. అందుకే నేను రోజుకి రెండు సార్లు హార్లిక్స త్రాగమని ఎప్పుడు సలహా యిస్తాను.

నాకు బాగా తెలుసు. నేనుకూడా త్రాగుతాను.




ప్రపంచ మంతటా డాక్టర్లు నమ్మినది.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం. పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్ముతారు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?




మంచి పుష్టికరమైనది

HMM-9239 TEL

## ఉత్తరాలు

## సీరియల్స్

కొత్త సీరియల్ "రేపటి మహిళ" ప్రారంభం నుంచే ఆకట్టుకుంటున్న ఓ ఆహ్లాదకరమైన సీరియల్.

డి. ఎస్. పి. విజయ్ సీరియల్‌లో సావిత్రిగారు సృష్టించిన పాత్రల్లో విజయ్ పాత్ర అద్భుతం.

"మంజీర నాదం" రావినూతల సువర్ణాకన్నన్ సీరియల్ చాల బాగుంది.

–ఎ. సురేష్‌కుమార్, హైదరాబాద్

★ ★ ★

కొత్త సీరియల్ "రేపటి మహిళ" ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టుకున్నది. "డి. ఎస్. పి. వీజయ్" సీరియల్ చాలా బాగున్నది.

–బి. వి. రమణ, బి. రఘునాథ్, రాయగడ

★ ★ ★

'రేపటి మహిళ' సీరియల్ ప్రారంభం బాగుంది. మరియు 'మంజీర నాదం' సీరియల్ గూడ చదువ ముచ్చటగా ఉంది.

–యస్. వెంకటేష్, జువారినగర్, గోవా

★ ★ ★

"వేయి పడగలు", 'ప్రేమసాగర మథనం' సీరియల్స్ చాలా వెరైటీగా సాగుతున్నాయి. మరో విశేషమేమిటంటే "రేపటి మహిళ" క్రొత్త సీరియల్ మొదట్లోనే మమ్మల్ని ఆనంద సరస్సులో ముంచెత్తింది. –డి. రమణారావు, ఖర్గపూర్

★ ★ ★

"ప్రేమసాగర మథనం" ఎంతో ఆసక్తిదాయకంగా వుంది. ఈ నవలా రచయితకి నా ప్రత్యేక అభినందనలు. "వేయి పడగలు" నవల యొక్క సాహిత్యం వీనులవిందుగా ఉంది.

–జె. వి. రమణమ్మ, బొబ్బిలి

## కంటితుడుపు

7వతేదీ సంచికలో క్రీడాకారిణి అంజూరాణి దయనీయ స్థితిని గురించి రాశారు. మనదేశంలో ఏరంగంలో అయినా కేవలం ప్రతిభ ఉన్నంత మాత్రాన సరిపోదు ఉత్తర, దక్షిణాలు ఉండాలని మరో సారి రుజువైంది. ప్రధాని దగ్గర నుండి వచ్చిన జవాబు కన్నీళ్ళ తుడుపుగా గ్రహించాలి. ప్రధాని ఆఫీసులో అన్ని రకాల ఉత్తరాలకి ముందే జవాబులు సిద్ధంగా ఉంటాయి. పేర్లు మార్చి, వచ్చిన వాటికి తగిన జవాబులు పోస్టులో వేస్తూ ఉంటారు. –కె. రామారావు, హైదరాబాద్

## కథలు

'ప్రకృతి ధర్మం' కథలో 'దుష్ట శిక్షణ' ను ప్రకృతిధర్మంగా ఆయాపాత్రల ద్వారా చక్కగా చెప్పగలిగిన జంట రచయితలు అభినందనీయులు.

–వక్కలంక రామారావు, మానేపల్లి

★ ★ ★

"పబ్లిసిటీ" కథ బాగా నచ్చినది. ఈ కథ ఈనాటి సినిమాల ధోరణికి అద్దం పట్టినది. రచయిత్రికి మా అభినందనలు.

–దేశరాజు, శ్రీరామశంకర శ్రీనివాస్, మచిలీపట్నం

★ ★ ★

"పబ్లిసిటీ" కథ వాస్తవానికి దగ్గరగా వుంది.

–కళ్యాణం వెంకటసుబ్బారావు, ఏలూరు

## న్యూఢిల్లీ లేఖ

జయదుబాషి గారు ది 7-8-87 గల పత్రికలో వ్రాసిన వ్యాసాన్ని చూసాను. అందులో ఆయన గారు చేసిన అమెరికా భజన, నెహ్రూ కుటుంబంపై వెలిగక్కిన ద్వేషం చాలా అసహ్యకరంగా వున్నాయి. విషయాన్ని విశ్లేషించటాన్ని బదులు ఆయన తన యిష్టాయిష్టాలను పాఠకుల మీద రుద్దారు.

–చం. వీరభద్రరావు, కాకినాడ □




# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు : (1938-1972)

4-10 సెప్టెంబర్ '87

శ్రీ ప్రభవ నామ సం. భాద్రపద శు. ఏకాదశి

సంపుటము 80 : సంచిక 2

ముఖ్య సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు :

మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75 |
| పోస్టులో 6నెలల చందా | రు. 80.60 |
| పోస్టులో 12నెలల చందా | రు. 161.20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి : రజని

(ఫోటో : ప్రభుశంకర్)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :

# హైందవ తత్వంలో ఏకత్వం

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

సాన్‌ఫ్రాన్సిస్కో : అమెరికాలో మీకు ఎక్కువమంది పిచ్చివాళ్ళు కనబడరు. బహుశా వాళ్ళందర్నీ మానసిక రోగుల చికిత్సాలయాలలో ఏర్పంధిస్తారు. నేను పిచ్చివాళ్ళ గురించి చెపుతున్నాను, అతిగా ప్రవర్తించే వాళ్ళ గురించి కాదు. అటువంటి వాళ్ళు బ్రిటన్‌లోనూ, ఇతర చోట్ల చాలమంది ఉన్నారు. కాని నేను మొట్టమొదటి అమెరికన్ పిచ్చివాణ్ణి సాన్ ఫ్రాన్సిస్కోలోనే చూశాను. ఆయన ఒక నీగ్రో.

సాన్‌ఫ్రాన్సిస్కోలోని డౌన్‌టౌన్‌లో మేసీస్ దగ్గరి పెద్ద ప్రదర్శనశాల దాటుతూ ఉండగా, ఒక మురికి చింపి కోటును భుజాల మీద వేసుకొని రీగన్‌ను తిడుతూ కొండమీది నుంచి ఆయన పరుగెత్తుకొచ్చాడు. మొదట నేనాయన ఒక రాజకీయవేత్త కావచ్చు ననుకున్నాను. కృష్ణమీనన్ లాగ పిచ్చి వాళ్ళ వలె నటించే రాజకీయ వేత్తలు కొందరున్నారు. కాని ఆయన రాజకీయవేత్త కాదు. ఆయన ఒక కళాశాల ప్రొఫెసర్ కూడా కాదు. ఆయన సాదా సీదా పిచ్చి నీగ్రో. నాకు కనబడిన మొదటి పిచ్చి అమెరికన్ ఆయనే గనుక ఆయన పట్ల నేను జాలి పడ్డాను.

ఆ తర్వాత నేను మరికొందరు పిచ్చి వాళ్ళను కూడ చూశాను. అందరినీ సాన్‌ఫ్రాన్సిస్కోలోనూ కాదు, అందరూ నీగ్రోలు కూడ కాదు. సందర్భవశాత్తు, అమెరికన్ నీగ్రోలు తమని నీగ్రోలని పిలవడానికి ఇష్ట పడరు. వాళ్ళు తమను తాము బ్లాక్స్ అని పిలుచు కుంటారు. బహుశా ఆఫ్రికన్ల నుంచి తమకు గల తేడాలు ప్రకటించుకునేందుకు కావచ్చు. నేనొకసారి ఒక నీగ్రోను ఆ ప్రత్యేక నగరంలో ఎంత మంది నీగ్రోలున్నారని అడిగాను. ఆయన నావైపు చాలా అవమానకరంగా చూశాడు.

అమెరికాలో నల్లవాళ్ళు ఆర్థిక, సాంఘిక రంగాలలో రెండింట్లోనూ దయనీయమైనటు వంటి స్థితిలో ఉన్నారు. మీరు న్యూయార్క్ నుంచి వాషింగ్టన్ వెళ్ళేటప్పుడు రాజధానీ నగరం చేరబోయే ముందు ఎన్నో నల్లవాళ్ళ వాడలు దాట వలసి వస్తుంది. అవి మురికి వాడల కన్న ఏమంత గొప్పగా ఉండవు. ఐతే, న్యూయార్క్‌లో కూడా ఇంకా ఘోరమైన మురికి వాడలున్నాయనుకోండి. ఉదాహరణకు హార్లెమ్ ఎంత దారుణమైన స్థలమంటే టాక్సీడ్రైవర్లు మిమ్మల్ని అక్కడికి తీసుకు పోవడానికి నిరాకరిస్తారు. న్యూ ఆర్లీన్స్ గురించి నేను తర్వాత రాస్తాను. కాని అక్కడ కూడా సొగసైన ఫ్రెంచ్ క్వార్టర్ పక్కనే విశాలమైన నల్లవాళ్ళ మురికివాడ ఉన్నది. ఆ ఫ్రెంచి క్వార్టర్‌లో టిన్నెసీ విలియమ్స్ అప్పుడప్పుడు బస చేస్తుండే వారు. న్యూ ఆర్లీన్స్ మిసిసిపి నదీ తీర నగరం. మార్క్ ట్వేన్, తదితర రచయితలు దానికి చాలా పేరు తెచ్చి పెట్టారు. ఈ అమెరికన్ రచయితలందరూ నల్లవాళ్ల పట్ల ఆకర్షణ కలిగించ గలిగారు. కాని వాళ్ళ నుంచి నాయకులను తయారు చేయడంలో విజయం సాధించ లేక పోయారు.




అమెరికాలోని నల్లవాళ్ళు ఒక అంతరించి పోయిన జాతి, ఎందుకంటే వాళ్ళు ఎంతగా పూర్తిగా అపసంస్కృతీ కరించ బడ్డారంటే వాళ్ళకు తామెవరో తెలియదు. వాళ్ళు తాము అమెరికన్లమనే అంటారు. కాని వాళ్ళు పదహారణాల అమెరికన్లుగా గుర్తించబడలేదన్నది స్పష్టమే. శ్వేత జాతి నాయకులు, నల్లజాతి నాయకులు ఏమైనా చెప్పవచ్చుగాక. వాళ్ళు తెల్లవాళ్లనుంచి విభిన్నంగా ఉన్నప్పటికీ, వాస్తవంలో వాళ్ళు అంత తేడా ఉన్నట్టు కనిపించరు. ఎందుకంటే వాళ్ళలో చాలామంది క్రైస్తవులే. వాళ్ళకు శ్వేతజాతి అమెరికన్లకు ఉండేటటువంటి పేర్లు, ఇంటి పేర్లు ఉంటాయి. జాన్ కెన్నడీని కాల్చి చంపినటువంటి టెక్సాస్‌లోని డల్లాస్‌లో ఒక నల్ల బస్ డ్రైవర్‌ను కలిశాను. ఆయన పేరు నెపోలియన్ బోనపార్ట్ అని చెప్పాడు. నాకు కాస్త సందేహం ఉందిగాని, అది ఆయన నిజమైన పేరు కూడా కావచ్చు. ఇంకొకతని పేరు థామస్ జెఫర్‌సన్. వాళ్ళు తమను ఓడించిన వారి పేర్లు పెట్టుకుని తెల్లవాళ్ళ లాగా చలామణీ అవుదామనుకుంటున్నారు. భారత దేశంలో వారెన్ హేస్టింగ్స్, విన్‌స్టన్ చర్చిల్ లాంటి పేర్లు పెట్టుకున్న ఒక హిందువును కూడ మీరు చూడలేరని నేను వాళ్ళతో చెప్పాను. ఇటువంటి పేర్లను గౌరవించే కొందరు ఆంగ్లో - ఇండియన్లు ఉండవచ్చుననుకోండి. దేవతలు ఎవరిని సంహరించదలచుకున్నారో వారికి ముందుగా తప్పుడు పేర్లు పెట్టారని కూడా నేను వాళ్ళకు చెప్పాను.

అమెరికాలాంటి పోటీ నిండినటువంటి సమాజంలో నల్లవాళ్ళు తెల్లవాళ్ళతో పోటీ పడడం కష్టం. ఎందుకంటే నల్లవాళ్ళ జీవిత విధానపు లయ చాలా నెమ్మదయినది. ఇంకా చెప్పాలంటే, తెల్లవాళ్ళ జీవిత విధానం కంటే చాలా ఎక్కువ ప్రకాశవంతమైనది. న్యూ ఆర్లీన్స్‌లో ఇంకా ప్రవహిస్తున్న మిసిసిపి నది ఒడ్డున నలుగురు నీగ్రో పిల్లలు మిట్టమధ్యాహ్నపు ఎండలో చేపలు పట్టుకుంటూ కూర్చుని ఉండగా నేను చూశాను. మేమందరమూ చెమటలు కక్కుతుండగా,

తెల్లవాళ్ళ

ఉండగా

వేసుకుని గాలా... ...ర్లు వాళ్ళలో ఒక్కళ్ళు ఒక్క మాట కూడా మాట్లాడటం లేదు ఒక 'ఉదయం న్యూయార్క్‌లోని ఒక సబ్‌వేలో ఒక నల్ల పెద్దమనిషి చాలా వేడిగా ఉన్నటువంటి వాతావరణంలో కోటూ టైతో కూచుని ఆ ఉదయపు దినపత్రిక తీసి కొన్ని పేరాగ్రాఫుల కింద కలంతో గీతలు గీయడం మొదలు పెట్టాడు.' మా అందరి జేబుల్లోనూ ఏవో చిన్న స్థానిక పత్రికలుండగా ఆయన వాల్‌స్ట్రీట్ జర్నల్ చదువుతున్నాడు

అపసంస్కృతికి, పరాయి సంస్కృతికి లొంగి పోయిన మనిషి మెదడు శస్త్రచికిత్సకు గురయిన వాడిలా ఉంటాడు "ఆయన గానీ, ఆమెగానీ మాట్లాడేటటువంటి పద్ధతిని బట్టో, ప్రవర్తించేటటువంటి పద్ధతిని బట్టో ఆ వ్యక్తి మెదడుకు శస్త్ర చికిత్స జరిగిందని మీరు చెప్పలేరు టెన్నెసీ విలియమ్స్ చెల్లెలు రోజ్ యువతిగా ఉండగా ఇటువంటి శస్త్ర చికిత్స చేశారు. ఆమె 70 ఏళ్ళ వయసులో చనిపోయింది గాని జీవితాంతం వరకూ తాను 26 ఏళ్ళ యువతి నని ఆమె భావిస్తూ ఉండేది జీవిత భాగాలగుండా మీరు సాగిపోతారు గాని, మీరు మరణించినట్టే లెక్క. యూదులను ఇట్లా చేయాలనేదే హిట్లర్ కోరిక కొందరు గోవన్నను పోర్చుగీసు వాళ్ళు ఇట్లాగే చేశారు

... నిరాకరి... ఈ

... ఇచ్చిందో

రాం... రుద్ది జవహర్లాల్ నెహ్రూ మనందరిని అట్లాగే మార్చదలచుకున్నారు నెహ్రూ గనుక విజయం సాధించి ఉంటే, ప్రస్తుతం అమెరికాలో నల్లవాళ్ళు ఎటువంటి స్థితిలో ఉన్నారో మనమూ అటువంటి స్థితిలోకే నెట్టబడి ఉండే వాళ్ళం వాళ్ళు అటు ఆఫ్రికాకూ, ఇటు అమెరికాకూ చెందక తమకు తామే అపరిచితులుగా ఉన్నారు నెహ్రూ తనను తాను అభివర్ణించుకున్నది ఇటువంటి మాటలలోనే ఇంకా ఈ దేశంలో ఆయనను ఆరాధించే దౌర్భాగ్యులు ఉన్నారు.

భారతదేశానికి వెలుపల నన్ను నేను ఇండియన్‌గా చెప్పుకోను, హిందువునని చెప్పుకుంటాను 'ఇండియన్' అనేది హిందువు అనే మాటకు బ్రిటిష్ వాళ్ళ తర్జుమా అని, బ్రిటిష్ వాళ్ళు వెళ్ళిపోయారు గనుక, నేను నా నిజమైన జాతీయ గుర్తింపుకు, హిందూ అనే మాటకు కట్టుబడుతున్నానని వివరిస్తాను ఫ్రెంచివాళ్ళకు ప్రశ్నలేమీ ఉండవు. ఎందుకంటే వాళ్ళు ఇండియన్లందరినీ హిందువులనే అంటారు. బ్రిటిష్ వాళ్ళు మాత్రం నానుస్తూ ఇండియన్‌వి కాదా అని మళ్ళీ అడుగుతారు. 1947 ఆగస్టు 15 నుంచి నేను ఇండియన్‌ను కావడం రద్దయిందని ఎందుకంటే బ్రిటిష్ వాళ్ళు మనదేశాన్ని దురాక్రమించకముందు నేను ఉన్నటువంటి స్థానానికి, అంటే, హిందువును కావడానికి ఆ తేదీన

... నిరాకరిస్తాన... వాళ్ళు నాకు తిక్క

... పెంకుతనం

ప్రకరించడానికి ప్రయత్నించారని, నేను మళ్ళీ దాన్ని సవరించడానికే ప్రయత్నిస్తున్నాననీ గుర్తించరు

అమెరికాలో నల్లవాళ్ళు ఏక్షణాన తమను తాము నీగ్రోలమని పిలుచుకోవడం ప్రారంభిస్తారో, నల్లవాళ్ళమని పిలిపించుకోవడానికి నిరాకరిస్తారో ఆక్షణాన తమ ఆత్మగౌరవాన్ని పునరుద్ధరించుకోగలుగుతారు నీగ్రోయిజం అంటే తమ మాతృఖండమైనటువంటి ఆఫ్రికాతో ఏకత్వాన్ని ప్రకటించడం. కాగా నల్లవాళ్ళు అంటే ఒక రంగో, రంగు లేక పోవడమో మాత్రమే దానికి అర్థం లేదు. నన్ను నేను హిందువునని పిలుచుకున్నప్పుడు నేను ఐదువేల సంవత్సరాల హిందూ స్మృతులతో ఏకత్వాన్ని గుర్తిస్తున్నానన్న మాట. నన్ను నేను ఇండియన్ అని పిలుచుకున్నప్పుడు అదేమీ లేదు. మెదడులో శస్త్ర చికిత్స సాధించేది కచ్చితంగా అదే– అది జ్ఞాపకాన్ని తుడిచేస్తుంది. నెహ్రూలకు ఇండియన్ల నుంచి భయపడ వలసిందేమీ లేదు. కాని హిందువుల నుంచి భయపడ వలసింది ఎంతో ఉంది. అటువంటి కారణం వల్లనే ఆ కుటుంబం మనందరి మెదడులకు శస్త్ర చికిత్స చేయదలచుకున్నది. మనలో కొందరయినా స్థిరంగా నిలబడి 'వీల్లేదు' అని ఉండకపోతే ఆ కుటుంబం విజయం సాధించేదే. ■






## మహిళా పాఠకుల శీర్షిక!

# ఈకాలం పెళ్లిళ్లు

## పద్ధతుల్లో మార్పులేదు మనుష్యుల్లోనే మార్పు!

వివాహ మనేది స్త్రీకి ఎంత
అవసరమో పురుషునికి అంతే అవసరం
తరతరాలుగా ఎందరో ఆడపిల్లల
జీవితాన్ని బలికొంటున్న వరకట్నపు
సమస్య దురాచారమని తెలిసిన మన
పెద్దలే మేమంత కట్నం యిస్తాము,
ఇంత కట్నం ఇస్తాం అని అమ్మాయిల
తలిదండ్రులు పోటీ పడుతున్నారు.
ఎవరు ఎక్కువ రేటు పెడితే అబ్బాయి
తాలుకువాళ్లు వారి వైపు మొగ్గు
చూపటం రివాజు

స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యము లేక
పోవటమే వరకట్న దురాచారానికి
ముఖ్య కారణం. నేటి సమాజములో
వివాహ వ్యవస్థ వ్యక్తి గుణానికి సాంప్ర
దాయానికి అనుగుణంగా కాకుండ
డబ్బు ప్రాతిపదికపై నడుస్తుంది
అందువలన కట్నం ఎక్కువైంది ప్రతి
స్త్రీకి కట్నం ఒక సమస్యగా తయారైంది
ఆర్థికంగా స్వాతంత్ర్యము లేకపోవుట
వలన ఉద్యోగి అయిన స్త్రీ కూడ కట్నం
అనే రక్కసి కోరలలో ఇరుక్కుంటుంది
కట్నమనేది మన వివాహ పద్ధతులలో
ఏదో రూపంలో ప్రత్యక్ష మవుతుంది
లాంఛనాల పేర్న మీదనో, అలక పాన్పు
మద సాగించుకొనే ఈ ఆడంబరాలు
అంతము అనేది కన్పించదు నాకైతే
కట్నం అక్కర లేదు మరి మా చెల్లెలు
మాటేమిటి అంటారొక మధ్య తరగతికి
చెందినవారు మా అబ్బాయికి కట్నం
అక్కర లేదు కాని మా ఆడపిల్లలకు
లాంఛనాలు దండిగా జరిపిస్తే చాలు,
కట్నానికి మించిన లాంఛనాల లిస్టు
ఇదివే. తెలివైన తలిదండ్రులు
అమ్మాయిలు ఉద్యోగము చేయాలి,
కట్నమూ కావాలి అనే వాళ్లు కొంత
మంది ఆదర్శవాదులు కట్నం లేకుండా
చేసుకొంటామన్న వారికేదో లోపం
వుందని అంటకట్టి చెవులు కొరుక్కొనేది
సంఘమే 'కట్నం
తీసుకోవటం నేరం' అని ప్రభుత్వము




ప్రకటించినా ఎంతో మంది ఉపన్యాసా లిచ్చినా చెవిటి వానిముందు శంఖము ఊదినట్టుగానే ఉంది.

కట్నం ఎవరి పరిధిలో వాళ్లు ఇవ్వకలిగితే బాగుంటుంది. కాని వాళ్లు ఇంత ఇస్తున్నారు, మీరు ఇంకెంత ఇస్తారు లేదా మా అబ్బాయికి ఇంత ఇస్తామని అంటున్నారని అంటే నాగరికతకు దూరమయి పోతున్నామని



పించటమే కాకుండా కన్నె హృదయాలలో చిచ్చు పెడుతున్నారని పిస్తుంది పెద్దల ప్రమేయం లేకుండా జరిగే వివాహాలలో కట్నం ప్రసక్తి వుండనే వుండదు కదా! యువతీ యువకులు పరస్పరం అర్థం చేసుకొని భావాలను, ఇష్టాలను ఒకరు కొకరు చెప్పుకొని వివాహం చేసుకోవాలి అలాంటి వివాహాలను మన పెద్దలు, సమాజం మెచ్చుకోవాలి స్త్రీలు చదువుకొని, ఉద్యోగాలు చేస్తూ

ధైర్యంగా, స్వతంత్ర ంగా నడచుకోవాలి కట్నం తీసుకొనే అబ్బాయిలను పెండ్లి చేసుకోమని ప్రతిజ్ఞ చేయాలి అబ్బాయిలలో కూడ ఇలాంటి మార్పు రావాలి ఎంతెంతో కట్న కానుక లిచ్చి ముక్కు మొఖం తెలియని వారితో వివాహం చేసి ఒకరి భావాలు మరియొకరు అర్థము చేసికొనలేక ఆదరణ, అనురాగం పొందలేక పురుష దురహంకారముతో స్త్రీని నానా అగచాట్లు పెట్టి నాకీ పెండ్లి ఎందుకు జరిగిందా అని వాపోయే స్త్రీలు దానివలన మనశ్శాంతిని కోల్పోయే తలిదండ్రులు మన సమాజములో చాల మంది వున్నారు ప్రతి తలిదండ్రులు తమ ఆడపిల్లలను గూర్చి బెంగలు వదలి వాళ్లకు కావలసినంత విద్య నభ్యసింప జేసినట్లయితే కొంత మార్పు రావచ్చును. కట్నానికి మేము అమ్ముడు పోమని యువకులు, కట్నం అడిగే వారిని మేము చేసుకోమని యువతులు నిర్ణయించుకొంటే ఈ సమస్య కొంతవరకైనా దూరమవు తుందని చెప్పాలి పెద్దలు కూడ మారాలి మా అబ్బాయిలకు కట్నం తీసుకోము, అమ్మాయిలకు కట్నం ఇవ్వము అని ప్రతి తలిదండ్రులు అనుకొంటే ఈ దురాచారము కొంత వరకైనా సమసి పోతుంది "కట్నం అంటే ఏమిటి?" అని బావితరం కుతూహలంతో ప్రశ్నిం చాల్సిన స్థితికి మనము తప్పక చేరతాము ఆడంబరాలు లేని సామూహిక వివాహాలను, రిజిస్టర్ వివాహాలను ప్రోత్సహించాలి.

– వి. విజయసుశీల,
పోరుమామిళ్ల, (కడప)

* * *

## ఆర్థిక స్వాతంత్ర్యం ఉండాలి!

ప్రతి వ్యక్తి జీవితంలో 'పెళ్లి' అన్నది అతి ముఖ్యమయిన మలుపు స్త్రీపురుషుల జీవితాలలో అదొక మధురానుభూతి కానీ నేటి సమాజంలో మారుతున్న పరిస్థితు లను బట్టి వివాహ బంధానికి 'పవిత్రత'అనేది లేకుండా పోయింది 'పెళ్లి' అనేది అబ్బాయిలను కన్న తల్లిదండ్రులకు మంచి లాభసాటి వ్యాపారం కాగా, ఆడపిల్లలను కన్న తల్లిదండ్రులకు పెద్ద భారంగా తయారయింది. అబ్బాయి పుడితే ఆనందోత్సాహాలతో పండుగలు చేసుకునే తల్లిదండ్రులు అమ్మాయి పుడితే తమ నెత్తిమీద పెద్ద కుంపటి ఉన్నట్లు దిగులుపడుతున్నారు ఈ మార్పు ఎంత వరకు దారి తీసిందంటే 'శిశువు' గర్భంలో ఉండగానే ఆడో, మగో కనుక్కొని 'మగశిశువు' అయితే సంతోషిస్తున్నారు 'ఆడశిశువు' అయితే 'అబార్షన్' చేయించటానికి కూడా వెనుకంజ వేయటంలేదు.

ఈ విధంగా ఎందుకు జరుగుతున్న దంటే సమాజంలో నేడు 'వరకట్నం' అనే భయంకర పిశాచం విలయ తాండవం చేస్తున్నది ఆడపిల్లల పెళ్లిళ్లు చేయాలంటే వేలకు వేలు 'కట్నం'గా ఇవ్వవలసి వస్తున్నది 'కట్నం'గా అడిగినంత డబ్బు ఇవ్వకపోతే అత్తగారింట్లోకి అడుగు పెట్టిన అమాయక స్త్రీల నూరేళ్ల జీవితాలు ఎలా మంటకలసి పోతు న్నాయో నిత్యం మనం దినపత్రికల్లో చూస్తూనే ఉన్నాము డబ్బు తేలేదని కట్టుకున్నవాడి చేతిలో నరకయాతన అనుభవించలేక ఉరిబోసుకుని చనిపోయే అబలలు కొందరయితే, అత్తమామల పోరు భరించలేక అగ్నికి ఆహుతి చెందే అభాగ్యురాళ్లు మరికొందరైతే, హత్యలకు గురియై మరణాన్ని పొందే నిర్భాగ్యురాళ్లు కొందరు ఈ పరిస్థితులలో ఒక ఆడపిల్ల పెళ్లి చేయాలంటే కట్న కానుకలు ఇవ్వటం అనేది తప్పనిసరి అయింది ఆర్థిక పరిస్థితులు బాగోలేని ఓ సమిష్టి కుటుంబంలో నలుగురు ఆడపిల్లలున్నారంటే ఆ



ఇంటిని విషాద చాయలు ఎప్పుడూ అలుముకొనే వుంటాయనటంలో సందేహంలేదు పెళ్లీడు దాటినా కన్యగా ఉండాల్సిన పరిస్థితులు ఇలాంటి ఇళ్లల్లో ఉంటూ ఉంటాయి

అతి త్వరలోనే మనమంతా ఇరవయ్యోకటవ శతాబ్దంలో అడుగుపెట్టనున్నాము మనందరమూ ఇప్పుడు ఎలక్ట్రానిక్స్, కంప్యూటర్ యుగంలో విహరిస్తున్నాము పురుషులతో బాటు స్త్రీలు అన్నిరంగాలలో సమానమయిన ప్రతిభను కనపరుస్తూ, కొన్ని రంగాల్లో పురుషులకంటే స్త్రీలే ఎక్కువ ప్రతిభను కనబరుచుచున్నారు అయినా పెళ్లి విషయానికొస్తే మగవారు కట్నాలు ఎందుకు తీసుకొనవలసి వస్తున్నది? 'పెళ్లి' అనేది స్త్రీలకు ఎంత అవసరమో, పురుషులకూ అంతే అవసరము మరలాంటప్పుడు పెళ్లి సమయంలో 'పెళ్లికొడుకు' ఎందుకు కట్నం తీసుకుంటున్నాడంటే అది అనాది నుంచీఒక ఆచారంగా వస్తున్నది



ప్రజలు కూడా ఈ వరకట్నాన్ని ప్రోత్సహిస్తూ వస్తున్నారు ప్రభుత్వం వరకట్న నిషేద చట్టం చేసింది కానీ ఎవ్వరిని శిక్షించింది? ఎందుకు శిక్షించలేదంటే ప్రజల సహకారం లోపించటం వల్ల అందుకే నేటి సమాజంలో ఈ 'వరకట్న పిశాచం' విలయతాండవం చేస్తున్నది దీన్ని హతమార్చడానికి 'యువత' నడుం కట్టి ముందుకు రావాలి యువత లంతా ఏకమై రావాలి యువతలంతా తమ కాళ్లపై తాము నిలబడటానికి ప్రయత్నించాలి పూర్వకాలం నుంచీ గూడుకట్టుకుని వస్తున్న ఆచార సాంప్రదాయ వ్యవహారాలకు స్వస్తి చెప్పాలి యువతీయువకులు మతాంతర కులాంతర వివాహాలు చేసుకోవటానికి సిద్ధపడాలి కట్నం తీసుకోని యువకుడినే పెళ్లి చేసుకోవాలని ప్రతి యువతి ప్రతిజ్ఞ చేయాలి ఇలా ... కట్నం అనే సమస్య ... కుండా పోతుంది అపుడే స్త్రీ జాతికి మంచి రోజులు వస్తాయి ఈ మంచి రోజుల కొరకు యువత తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహించాలి దేశాన్ని ముందుకు నడిపించాలి

- కోటగిరి సుజన, సత్తుపల్లి

★ ★ ★

# స్త్రీకి ప్రాధాన్యత ఉండాలి

"యత్ర నార్యస్తు పూజ్యంతే
తత్ర రమంతే దేవతాః

ఇది పూర్వం పెద్దలు చెప్పిన సూక్తి మరి నేడు స్త్రీల పట్ల పూజ్య భావమెక్కడిది? వివాహ వ్యవస్థ అన్నది ఒక యజ్ఞమైతే నేటి వధువొక బలిపశువు అమ్మాయిలకు కూడ ఆశలు, ఆశయాలు ఉంటాయని, వారి అభిప్రాయాలకు కూడ విలువ నిచ్చి, వారిని కూడ మనసున్న మనుషులుగా పరిగణించాలనుకొనే వారి సంఖ్య నేటి ఆధునిక సమాజంలో నూ బహు తక్కువ

నేటి మన సమాజంలో కాలానుగుణంగా ఎన్ని మూర్పులు వచ్చినా, వివాహ విషయంలో మాత్రం స్త్రీలకు తగినంత ప్రాధాన్యత ఇవ్వబడడం లేదు అవివాహిత యైన స్త్రీ ఎంత విద్యావంతురాలైనా, ఉద్యోగినియైనా, సత్ప్రవర్తన కలదైనా అందం, ఆర్థిక స్థోమత (కట్నం యివ్వ గలిగే శక్తి) లేనపుడు తృణీకరించ బడుతోంది ఇలా వైవాహిక జీవితానికి నోచుకోని స్త్రీ యొక్క దుస్థితికి కారణం ఎవరు? ఆమెను కన్న తల్లిదండ్రులా? కట్నం ఆశించే దురాశా పరులా? అందం, ఆకర్షణ అంటూ పైపై మెరుగులను తప్ప ఆత్మ సౌందర్యాన్ని ఆదరించలేనివారా? పెళ్లి కాని స్త్రీకి విలువే లేదంటూ పరుషోక్తులతో పరిహసించేలోకులనబడే కాకులా? ఇవన్నీ నేడు మనకు సమాధానం దొరకని ప్రశ్నలు

పితా రక్షతి కౌమారే
భర్తా రక్షతి యౌవనే
వృద్ధాప్యే రక్షంతి పుత్రాః
నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి"

అని మను ధర్మ శాస్త్రంలో నుడివినట్లు స్త్రీ ఎప్పటికీ స్వాతంత్ర్యం పూర్తిగా పొందలేక పోతోంది.

బాల్యమంతా తండ్రి సంరక్షణలో చదువు, ఆట, పాటలతో గడచిపోయినా, భర్త లభించ వలసిన ప్రాయంలో కన్య, ఆమె తల్లిదండ్రులు



ఎంతో మానసిక క్షోభకు గురవుతున్నారు ఒక వేళ కట్నం లేకుండా ఏ ఉదార స్వభావుడైనా ఆమెను పెళ్లాడినా, అత్త మామలో, ఆడబిడ్డలో, ఆఖరికి ఆ తాళిగట్టిన మగడో ఏక్షణాన్నైనా మనసుమారి ఆమెను కిరోసిన్ వేసి తగుల బెట్టవచ్చు లేదా ఉరి బిగించి, ఆత్మహత్యగా ప్రచారం చేయవచ్చు ఇలాంటి దూరాలోచనలతో తమ కూతురి భవిష్యత్తును, నూరేళ్ల జీవితాన్ని బలి చేయాలని చూడాలన్న తలంపుతో ఎంత శ్రమకు ఓర్చి ఐనా కన్య తల్లిదండ్రులు, వరుడి తల్లిదండ్రులు కోరినట్టుగానే వరదక్షిణ, లాంఛనాలు సమర్పించు కొంటున్నారు 'వరకట్నం దురాచారం' అంటూ ప్రభుత్వం నినాదాలను ప్రచారం చేయుట హర్షదాయకమే కానీ ఎన్ని వరకట్నపు విషనాగుల కోరల నుండి ఎందరు




అభాగినుల ప్రాణాలు కాపాడగల్గింది ఎందరు తల్లిదండ్రుల కన్నీళ్లన తుడవ గలిగింది? ప్రభుత్వాలు మారిన నినాదాలు హెచ్చినా పెళ్లిళ్ల వ్యవస్థన ఏమాత్రం మార్చలేక పోతున్నాయి

భార్యా భర్తలు, వర్ణాంతర మతాంతర వివాహాల్లో కూ తాత్కాలికంగా సర్దుకు పోగలరేమొ కాని బిన్న ఆచార, సాంప్రదాయాల వల్ల చిన్నచిన్న మనస్పర్థలు, స్వవర్ణ జా అభిమానాలు ఎక్కువై పోయి ఒకరిపట్ల ఒకరు చిన్నచూ చూపుతూ, ఆవేశాలకు లోనై పచ్చ సంసారాల్లో తమకు తావే విచ్ఛిన్నతను తెచ్చుకొనే వారెందరో?

వధూవరులిద్దరిలోనూ, కులమేదైన గుణానికి, మతమేదైనా మానవతక అందం కంటె ఆదరాభిమానాలక అశాశ్వతమైన కట్నం డబ్బు యిచ్చే ఆనందం కంటే అమితమైన అనురా బంధానికే ప్రాముఖ్యతనిచ్చు కొంటు జీవన రథాన్ని సక్రమంగ నడపగలమన్న ఆత్మ విశ్వాసం కలగాలి అందుకు పెద్దల తోడ్పాటు, ప్రోత్సాహ కూడ ఎంతో అవసరం ధనం పదవున దహింపజేయ గలిగే ఇంధనం కానినాడు అందం అన్న పదమొక్కటే అమ్మాయి వివాహ బంధానికి ప్రతి బంధకం కా నాడు ప్రతి కన్నె హృదయ హర్షిస్తుంది తల్లి దండ్రుల కళ్ల నుండి ఆనంద బాష్పధార వర్షిస్తుంది

–కె. శ్రీదేవి (కర్నూలు)

కూపన్
ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## ఈ కాలం పెళ్లిళ్లు

పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

పిన్ కోడ్

సీరియల్

# [illegible] మహిళ

సి. ఆనందారామం

(గత సంచిక తరువాయి)

**పా**త ఇనప సామాను కొట్టులో తూకానికి అమ్మదగ్గ దశలో వున్న సెకెండ్‌హేండ్ హిందూస్థానీ కారులో హైదరాబాద్ సరస్వతీ ఎపార్ట్‌మెంట్సు ముందు దిగాడు డిటెక్టివ్ పల్గుణ్ అతను సోమనాద్ ఏజన్సీస్ రిక్రూట్ చేసిన ప్రయివేట్ డిటెక్టివ్

బాగవతార్ నోట్ చేసి ఇచ్చిన అడ్రస్ స్లిప్ వేపు ఒకసారి చూసుకున్నాడు ఎపార్ట్‌మెంట్ నంబర్ బి- సెవెన్ రెండంతస్థులే లిఫ్ట్‌తో నిమిత్తం లేకుండా ఎక్కేయ్యొచ్చు అలా అయితే ఎవరికీ కనపడకుండా అనుమానం రాకుండా తన పని చూసుకోవచ్చు రెండో అంతస్థులో కెళ్లి యేడో నంబర్ ఎపార్ట్‌మెంట్ తలుపు తీసి వుండడం చూసి ఎదురుగా వున్న కామన్ బాల్కనీలో కాస్సేపు అటూ యిటూ తిరిగాడు కొంతసేపటికి ఆ అపార్ట్‌మెంటులోంచి హైహీల్స్ షూస్‌తో ఫ్రాక్‌తో ఒక అందమైన అమ్మాయి తలుపుకి తాళం పెట్టి బయటికి వెళ్లడం చూసాడు ఆ అమ్మాయిని వెనక నించి మాత్రమే చూడ గలిగాడు అయినా బాగవతార్ చెప్పినదాన్ని బట్టి ఆ యింటిలో మృదుల తప్ప మరెవ్వరూ లేరు కాబట్టి ఆవిడ మృదుల అయివుంటుందని వూహించాడు అప్పుడు యేడో నంబరు ఫ్లాట్ ముందు కెళ్లి పరిసరాలు పరీక్షగా చూసాడు ఎదురుగా వున్న మరో అపార్ట్‌మెంట్ కూడా తాళం వేసి వుంది అతని దగ్గిర ఆటోమాటిక్ తాళాలు తెరిచే సాదనాలున్నాయి తలుపు తెరుచుకుని బెడ్ రూమ్‌లో కొచ్చి రూమ్ నాలుగు వైపులా చూసాడు కలిగిన ఇంట్లో అందరి బెడ్ రూమ్స్ వున్నట్టుగానే వుంది రోజ్‌వుడ్ డబుల్‌కాట్స్ యూ-ఫోమ్ బెడ్స్ డ్రెస్సింగ్ టేబిల్ సైడ్‌టేబిల్స్ ఒక సైడ్ టేబిల్ మీద ఫ్లవర్‌వేజ్ వేజ్‌లో రంగు రంగుల పూలు ఆ పూలు ప్లాస్టిక్ పూలు అంచేత వాటిని రోజూ మార్చే అవకాశం లేదు ఈలోగా తనొచ్చి మళ్లీ చెక్ చేసుకోవచ్చు ఫ్లవర్‌వేజ్‌లో వీడియో కెమేరా అమర్చి జాగ్రత్తగా తలుపు లేసి వచ్చేసాడు గ్రౌండ్ ఫ్లోర్‌లో ఒక ఎపార్ట్‌మెంట్‌లో వీడియో పార్లర్ నడుపుతున్నారు అక్కడ సైమల్ టేనియస్‌గా అయిదారు టి వి స్క్రీన్స్ వున్నాయి వాటి మద్య పార్టిషన్ వుంది వీడియో పార్లర్‌లో మెంబర్‌షిప్ తీసుకున్న వాళ్లు కొంత అద్దె చెల్లించి గ్రూప్‌గా గాని వొంటరిగా గాని తమకి కావలసిన వీడియో కేసెట్స్ స్క్రీన్ చేయించుకుని రకరకాల సినిమాలు చూసుకోవచ్చు ఫల్గుణ్ వీడియో పార్లర్ యజమానితో మాట్లాడి టి వి స్క్రీన్‌తో సహా వున్న ఒక పార్టిషన్ విబాగాన్ని నెలరోజులకి అద్దెకు తీసేసు కున్నాడు ఎలక్ట్రానిక్ ఇంజనీర్ సహాయంతో ఫ్లవర్‌వేజ్‌లో ఫిక్స్ చేసిన వీడియో కెమేరా తీసే ఫిల్మ్ అంతా టి వి స్క్రీన్ మీద ప్రసారమయ్యే ఎర్పాటు చేసుకున్నాడు స్క్రీన్ మీద నుంచి వీడియో కేసెట్‌లో రికార్డు చేసుకోవడం తేలిక ఆ వీడియో పార్లర్‌లో ఒకరు చూసుకునే కేసెట్స్ వల్ల మరొకరికి డిస్టర్‌బెన్స్ లేకుండా ఇయర్ ఫోన్స్ కూడా సప్లయి చేస్తారు అంచేత ఫల్గుణ్‌కి మిగిలిన వాళ్ల వల్ల డిస్టర్‌బెన్స్ వుంటుందన్న బయం కూడా లేకపోయింది సోమనాద్ ఏజన్సీస్ పల్గుణ్‌కి వీడియో రికార్డింగ్ పని అప్పజెప్పి సహదేవుడికి మృదులని ఫాలో అయి ఆమె దిన చర్య అంతా రిపోర్టు చేసే పని అప్పగించారు సహదేవ్ రిపోర్టు పల్గుణ్ వీడియో కేసెట్ సోమనాద్ ఏజన్సీ ప్రొప్రయిటర్‌కి అప్పగించాలి

టి వి స్క్రీన్ ముందు కూర్చున్న పల్గుణ్ ఆనందంతో పొంగి పోయాడు టి వి స్క్రీన్ మీద అమ్మాయి అబ్బాయి గదిలోకి వస్తున్న దృశ్యం వెనక నుంచి కనిపించింది వాళ్ల ముఖాలు కనపడటం లేదు టి వి స్క్రీన్ మీద నుంచి కేసెట్‌లోకి రికార్డ్ చెయ్యసాగాడు ఏమాత్రం ఆలస్యం చేయకుండా వాళ్లిద్దరూ ఏదో పాప్ మ్యూజిక్ రికార్డు పెట్టుకుని స్టెప్స్ వేస్తూ డాన్స్ చేసారు తరువాత డబుల్ కాట్స్ మీదకి వాలి పోయారు ఆ తరువాత కూడా చూడాలని రికార్డు చెయ్యాలని పల్గుణ్ చాలా ఉబలాట పడ్డాడు కాని వాళ్లు లైట్ ఆర్పేయడం వల్లనో కెమేరాని ఫేస్ చెయ్యక పోవడం వల్లనో స్క్రీన్ మీద నల్లటి నీడలు తప్ప మరేమీ రాలేదు సంతోషంగా ఆ కేసెట్ తీసుకుని సోమనాద్ డిటెక్టివ్ ఎజన్సీస్‌లో చీఫ్ డిటెక్టివ్ సోమనాద్‌కి అప్పగించాడు

* * * * * * * * * * *

ఉదయం తొమ్మిది గంటలకల్లా చాలా డ్యూటిఫుల్‌గా బాగవతార్ ఫ్లాట్‌కి వచ్చి కూర్చుంటాడు అతని పి ఎ నక్షత్ర్ అతనికి యాభై ఏదేళ్లు మనిషి పెద్ద అందగాడు కాదు కాని సాత్వికంగా విద్వత్తు ఉట్టిపడు తూంటాడు ఆ కారణం చేతనే బాగవతార్ నిర్భయంగా అతన్ని మృదుల కేం కావాలో చూడమని చెప్పాడు ప్రబాత సమయాన మంచు బిందువుల మధ్య స్నిగ్ధంగా మెరిసే విరిసిన గులాబిలా కళకళలాడుతూ కనిపించే మృదుల ఎంతో ముచ్చటగా వుంటుంది అతనికీ యిద్దరాడ పిల్లలున్నారు పెద్దమ్మాయికి ఇద్దరు పిల్లలు పైకి యేం మాట్లాడకుండా గుంబనంగా వుంటుంది కాని లోలోపల యెంతో విషాదాన్ని దాచుకుంటున్నట్లుగా కనిపిస్తుంది ఎందులోనూ ఉత్సాహం చూపించదు పుట్టింటికి రమ్మంటే ఇప్పుడు కుదరదులే నాన్నా! చాలా పను లున్నాయి, అంటుంది పెద్ద అరిందాలా అల్లుడు ముబావంగా ముక్తసరిగా మాట్లాడి ఎక్కువ మాట్లాడితే తన గొప్పతనం ఎక్కడ తక్కువౌతుందో నన్నట్లు వ్యవహరిస్తాడు

రెండో కూతురికి ఇంకా పిల్లలు లేరు ఎప్పుడు చూసినా పగలడానికి సిద్ధంగా వున్న నీటి కుండలా కనిపిస్తుంది అత్త మామల మీద బర్త మీద నేరాలు చెప్పడం తప్ప మరో మాటలు రావా అన్నట్లు ప్రవర్తిస్తుంది అహర్నిశలు వాళ్లమీద నిస్సహాయమైన కోపంతో లోలోపల రగిలిపోయి

జరిగిన కథ –4 తనను ఏరికోరి పెళ్ళి చేసుకున్న, తనకంటి ఇరవై సంవత్సరాలు చిన్నదైన మృదుల ప్రవర్తన బాగవతార్‌కు విచిత్రంగా కనబడుతుంటుంది ఆమె మరెవరినైనా ప్రేమిస్తున్నదేమోనని అనుమానిస్తుంటాడు ఏండెటో మింగియార్ అనంగ్‌లలో ఎవరితోనో ఆమెకు సంబంధాలున్నాయనుకుంటుంటాడు నెలరోజుల అమెరికా కార్యక్రమం మీద వెళుతూ మృదుల సంతోషించడం చూసి అనుమానిస్తాడు ఆమెపై గూఢచారులను నియమించి వెళ్తాడు

మానసికంగా దెబ్బ తినదు కదా అని భయం వేస్తుంది

ఈ వెధవ సంసారం నాకొద్దు అన్నీ రోజుకి పదిసార్లైనా అనుకుంటుంది కాని ఆ సంసారం వదిలి రాలేదు రమ్మని చెప్పడానికి తనకీ, తన భార్యకీ కూడ నోరు రాదు చూస్తూ చూస్తూ సంసారం పాడు చేసుకోమని యెలా చెప్పగలరు ఆడపిల్లకి

ఈ అమ్మాయి ఎంత హాయిగా నవ్వుతుంది మనసులో యే కల్మషాలు లేనివాళ్ళు తప్ప అలా నవ్వలేరు సృష్టిలో అందాలన్నీ తనవే- జీవితంలో ఆనందమంతా తనదే- అన్నట్టు నిశ్చింతగా నవ్వుతూ తుళ్ళుతూ వుంటుంది అలాగని జీవితం పట్ల ఒక అవగాహనం లేకుండా నిర్లక్ష్యంగా- సోమరిగా వుండదు మృదుల తన గదిలో టి వి స్క్రీన్ మీద ప్రాజెక్టు చేసుకునే వీడియో కేసెట్స్ నక్షత్ర కూడా చూసాడు అవి సినిమాలూ కావు వినోద కార్యక్రమాలు కావు పల్లెటూళ్ళల్లో ముఖ్యంగా శ్రామికులలో స్త్రీల శ్రమ జీవితాన్ని చిత్రించినవి

ఒకసారి అడిగాడు ఇవి మీ కెందుకు పని కొస్తాయి? ఇలాంటి వీడియో కేసెట్స్ నేనెక్కడా చూడలేదు

ఇవి మా కరదీపిక కార్యాలయంలో మేమంతా చూస్తాము వీళ్ళని ఎల ఎడ్యుకేట్ చెయ్యాలా అని రకరకాల మార్గాలు ఆలోచిస్తున్నాము ఇప్పటి మాలో కొందరు కొన్ని రూరల్ ఏరియాస్ ఎడాప్ట్ చేసుకుని అక్కడి స్త్రీలక విజ్ఞానం కలిగించడానికి పుస్తకాల ద్వారా- వీడియోల ద్వారా- రికార్డుల ద్వార ప్రయత్నిస్తున్నారు అయినా చదువుకున్న వాళ్ళు మాత్రం ఏమం చైతన్యవంతంగా జీవితాలు ఎదుర్కొంటున్నారు గనక వీళ్ళల్లో లేని సంస్కారం వాళ్ళకెలా వస్తుంది?

నిట్టూర్పు వదిలాడు నక్షత్ర తన కూతుళ్ళిద్దరూ బి ఏ లు పాసైన వాళ్ళే తమ సమస్యల నెదుర్కోవడానికి యేం చేస్తున్నారు వాళ్ళు

నక్షత్రలో కనిపించిన సంచలనం అర్థం చేసుకుని మళ్ళీ అంది మృదుల ఇరవై అయిదు- పది- ఎనభైఅయిదు హిందూస్తాన్ టైమ్స్‌లో ఒక వార్త వచ్చింది ఢిల్లీలోని సుచేతా కృపలానీ ఆసుపత్రిలో రోజుకు సగటున ఇద్దరు స్త్రీలు మాయమౌతూంటారట ఆ ఆసుపత్రికి రాజధాని రెడ్‌లైట్ ఏరియాకి సంబంధించిన స్త్రీలు కొందరు చికిత్స కోసం చేరారట నిర్లక్ష్యమైన వైద్య విధానాలు భరించలేక చాలా మంది స్త్రీలు పారిపోతూంటారట అలా పారిపోయిన వారిని అధికారులు వైద్య సలహాలు తిరస్కరించి పారిపోయిన వా



## రేపటి మహిళ

కింద జమకట్టి కేసు మూసేస్తారట హాస్పిటల్ సిబ్బందితో జరిగిన సంభాషణలో ఇది చాలా మామూలు విషయంగా చెప్పారట

మరోచోట ఇరవై రెండు సంవత్సరాల సాదనా దేశిలే అనే ఇల్లాలిని ఆడపిల్లని కన్నందుకు ఆమె భర్త అత్తగారూ కాల్చి చంపేసారట మన దేశంలో ఆడవాళ్ళు బుద్ధిగా కాలేజీల కెళ్ళి కష్టపడి సంపాదించుకున్న డిగ్రీలు వాళ్ళ కేవిధంగా వుపయోగిస్తున్నాయో చెప్పండి?

కంఠంలో ఆవేశం వున్నా పెదవుల మీది చిరునవ్వు చెరగలేదు కళ్ళల్లో కాంతి తరగలేదు ఆ చిరునవ్వులోని చైతన్యపు మెరుపుల్ని మనసులో మెచ్చుకుంటూ, ఔనమ్మా! డిగ్రీలు సంపాదించుకున్న మన నాగరిక స్త్రీలు చదువుకోని అనాగరిక గ్రామీణులకంటే ఏవిధంగానూ మెరుగ్గా లేరు అందుకే, సరసో విపరీత శ్చేత్ సరసత్వం నముంచతి సాక్షరా విపరీతాశ్చేత్ రాక్షసా ఏవకేవలం అన్నారు

అంటే?

సరసుడు విపరీతంగా మారినా సరసత్వం పోదు కాని అక్షరాస్యుడు విపరీత పరిస్థితుల్లో రాక్షసుడై పోతాడు ఈ శ్లోకంలో శబ్దాలకి సంబంధించిన శ్లేష కూడా వుంది సరసా అనే అక్షరాలు తిరగేసినా, సరస , అనే వస్తుంది సాక్షరా, అనే శబ్దం తిరగేస్తే రాక్షసా ఔతుంది

చాలా బాగుంది మీకింత పాండిత్యం వుందని నాకు తెలియదు నిజంగా చదువుకున్న వాళ్ళే ఆ తెలివిని వక్రమార్గంలో పెట్టి మరింత రాక్షసు లౌతున్నారు అంది

ఫోన్ మోగింది వెళ్ళి అందుకుంది మృదుల, అవతలి వాళ్ళు చెప్పింది విని ఇప్పుడే వస్తున్నాను అని పెట్టేసింది నక్షత్ర్ దగ్గిర కొచ్చి, ఇది విన్నారా అంకుల్! మన ఆంధ్ర ప్రాంతాలకి యేవో మూలికలు సేకరించడం కోసం ప్రభుత్వం వారి అనుమతి పొంది మింగియార్ అనే టిబెటియన్ ఇక్కడ వుంటున్నాడు అతడికి జ్ఞాననేత్రం వుందని దాని సహాయంతో డాక్టర్లకి అంతు పట్టని రోగాలను గ్రహించి సునాయాసంగా నయం చేస్తాడని వార్త ప్రచార మైందట చాలా మంది అతని సంఘంలో సభ్యులుగా చేరుతున్నారట వెళ్ళి అదేదో చూస్తాను ఏమీ అనుకోరుగా! మీరు ఎక్కడి కెళ్ళాలో చెప్తే అక్కడ డ్రాప్ చేసి వెళ్తాను అంది

ఏదో ఆప్యాయత పొంగి వచ్చింది నక్షత్ర్‌లో బాగవతార్‌కి పేరు ప్రఖ్యాతులు వచ్చినప్పటి నుంచి అతని దగ్గర పి ఏ గా పని చేస్తున్నాడు ఏనాడూ అంకుల్ అని పిలవ లేదు కారులో లిఫ్ట్ యిస్తానని అస్సలనలేదు నువ్వు నాకంటే చాలా తక్కువ వాడివి సుమా! అని హెచ్చరిస్తున్నట్లే ప్రవర్తించేవారు బాగవతార్ వెళ్తూ తనతో చెప్పిన మాటలు బాగా గుర్తున్నాయి నక్షత్ర్‌కి మృదుల చిన్న పిల్ల తనకేం కావాలంటే అది అమర్చి పెట్టండి అలాగే యేం చేస్తూంటూందో కూడా కని పెట్టి వుండండి

ఈ మాటలు వింటున్నప్పుడు మనసులో నా మొగుడుకి తగని అనుమానం నాన్నా! కూరగాయల కోసం బయటి కెళ్ళినా, ఇంటి కొచ్చిన స్నేహితురాలిని వీది దాకా సాగనంపినా అనుమానమే దానికితోడు ఇంట్లో పని చేసేదాన్ని నా మీద కాపలాకి పెడ్తారు ఎంత అవమానమో చూడు ఏడుస్తూ అంటూన్న కూతురు గొంతు ప్రతిధ్వనించింది ఉస్సూరని నిట్టూర్చి చెప్పినట్టు చెయ్యడానికి వొప్పుకున్నాడు ఇప్పుడీ అమ్మాయిని చూస్తూంటే గౌరవం కలుగుతోంది ప్రేమ పొంగు కొస్తోంది ఆడపిల్లలంతా యిలా వుంటే యెంత బావుణ్ను అనిపిస్తోంది

నక్షత్ర్‌ని కార్లో తన పక్కన కూర్చో బెట్టుకుని అతను దింపమన్న చోట దింపేసి మింగియార్ బస చేస్తున్న యింటికి కారు డైరక్షన్ మళ్ళించింది

* * * * * * *

బాగవతార్ ఫ్లాట్‌కి కొంత దూరంలో నిలబడి మృదుల రాకపోకలు గమనిస్తూన్న సహదేవ్ మృదుల నక్షత్ర్‌తో బయలుదేరగానే మోటార్‌సైకిల్ మీద అనుసరించాడు నక్షత్ర్ దిగిపోగానే తన డైరీలో నడివయసు పెద్ద మనిషితో బయల్దేరింది దారిలో ఆ మనిషిని దింపేసి యెడమ వైపుకు మళ్ళింది అని రాసుకున్నాడు తరువాత మింగియార్ ఇంటివరకు అనుసరించాడు మింగియార్ ఇంట్లోకి వెళ్ళిన మృదుల యెంతకీ బయటికి రాకపోయేసరికి యేంచేయాలో తోచక గేటు దగ్గర కాపలావాడ్ని ఈ ఇల్లెవరిది? అని అడిగాడు

అయ్యగారిది

అయ్యగారంటే ఎవరు?

స్వామి వారు

ఈ ఇంట్లో యెవరెవరుంటారు?

ఎవరెవరొస్తే వాళ్ళందరూ వుంటారు

అంటే! ఈ ఇంట్లోకి యెవరేనా రావొచ్చా?

రావొచ్చు

నేను కూడా రావొచ్చా?

రావొచ్చు

అయితే నేను లోపలి కెళ్ళనా?

డొనేషన్ చెల్లించి వెళ్ళండి

డొనేషన్ దేనికి?

అయ్యగారి సంఘానికి

ఎంత?

పది రూపాయలకి తక్కువ కాకూడదు తరువాత యెంతైనా మీ యిష్టం మీ రెంత పుణ్యం సంపాదించు కోవాలను కుంటున్నారో దాన్నిబట్టి యివ్వంది

అతని చేతిలో పది రూపాయలు పడేసి లోపలి కొచ్చాడు సహదేవ్ పెళ్ళి హాలు లాంటి పెద్ద హాలు తప్ప ఇంకేమీ లేదు ఎవరూ కనపడ లేదు గోడమీద టిబెటియన్ లామా వేషంలో ఒక వ్యక్తి ఫోటో దాని కింద లామా మింగియార్ అనే అక్షరాలు కనిపించాయి అవి నోట్ చేసుకుని మృదుల లామా మింగియార్ ఇంట్లోకి వచ్చి మాయమై పోయింది ఈ మిస్టరీ తెలుసుకోవాలి అని నోట్ చేసుకున్నాడు

* * * * * * * *

మేలి ముసుగుల్లో వున్న ఆడవాళ్ళు– నల్లటి గంతలు కళ్ళకి కట్టుకున్న మగవాళ్ళు వాళ్ళ యెదురుగా చిన్న వేదిక మీద మింగియార్‌తో పాటు టిబెటియన్స్‌లా కనిపించే మరో యిద్దరు– వింతగా అందర్నీ చూసింది మృదుల ఏదో మాట్లాడ టానికి ప్రయత్నించేలోగా పెదవుల మీద వేలుంచి మాట్లాడొద్దు అన్నట్టు సైగ చేసాడు మింగియార్ మొదట ఆడవాళ్ళు ఒక్కొరొక్కరుగా వచ్చి మింగియార్ ముందు వొంగి నమస్కారాలు చేయసాగేరు అతడు వాళ్ళ ముఖాల్లోకి పరిశీలనగా చూసి పక్కన దొంతరగా పెట్టుకున్న స్లిప్స్ మీద ఏదేదో రాసి ఒక్కొక్కరి చేతికి యిస్తున్నాడు దాన్ని వాళ్ళు కళ్ళ కద్దుకుని బయటికి వెళ్ళిపోతున్నారు ఒకరు వెళ్ళిన పది నిముషాల



# నెస్టమ్ బేబి సిరియల్
# ప్రారంభించేందుకు ఆదర్శప్రాయమైనది
# పెరుగుదలకు ఆదర్శప్రాయమైనది

**నెస్టమ్, పాలు-పూర్తి పోషక విలువలున్న ఆహారం.**

మీ బాబు,సుమారు 4 నెల్లవాడయేసరికి,కావాలి పాలతోపాటు ఘనఆహారం.పాపాయికి తేలిగ్గా జీర్ణమయేట్లు, ప్రత్యేక శ్రద్ధతో తయారయిన. నెస్టమ్ బేబి సిరియల్ ని పెట్టడం ప్రారంభించండి. ముందుగా మరిగించిపెట్టిన గోరువెచ్చటి పాలతో కలపండి. ఇక, పూర్తి పోషక విలువలున్న ఆహారం సిద్ధమవుతుంది.

పాపాయి ఆరోగ్యంగా, చలాకీగా పెరిగేందుకు తోడ్పడుతుంది.

**నెస్టమ్‌తో వివిధవంటలు-పాపాయి ఆహారంలో బోలెడన్ని రకాలు**

మీ పాపాయి ఎదుగుతున్న కొద్దీ కొత్త రకాలు రుచి చూపించండి.

ఉడికించిన కూరముక్కలూ, పండ్ల ముక్కలూ, పప్పు-వీటిని నెస్టమ్‌తో కలిపి పెట్టండి. బాబు, కుటుంబంలో వారు తినే ఆహారాన్ని తినుకోవడం నేర్చుకునేందుకు ఇది తోడ్పడుతుంది.

**నెస్టమ్®**
**రైస్**

**ఇనుము-విటమిన్లతో కూడినది**
**పాలలో కలపండి.**

**ఉచితం**
మీ బాబు, తన ఆహారంలో, కొత్త రుచులను కోరుతాడు అందుకని—మీ ఉచిత నెస్టమ్ వంటల పుస్తకం కోసం రాయండి.
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం. 6016,
న్యూ ఢిల్లీ-110008.

Nestlé






# రేపటి మహిళ

తరువాతగాని, మరొకర్ని పిలవడం లేదు మింగియార్. మొదట ఆడవాళ్ళైపోయాక, తరువాత మగవాళ్ళు కూడా వచ్చి మింగియార్‌కి వొంగి నమస్కారం చేసి, అతను తమని పరిశీలనగా చూసాక రాసిచ్చిన చీటీలు అంధుకుని వెళ్ళి పోసాగేరు పదేసి నిముషాల వ్యవధిలో. స్త్రీ పురుషులు జంటలుగా వెళ్ళిన వాళ్ళు కూడా వున్నారు. వాళ్ళు చాలా కొద్దిమంది. అందరూ వెళ్ళిపోయాక మృదుల వైపు తిరిగి, "ఏమిటి మీరిలా వచ్చారు?" అడిగాడు మింగియార్.

"అయితే నేవిన్నది నిజమేనన్న మాట. మీరు– మీరు కూడా మోసగాళ్ళైన సన్యాసుల్లాగ జ్ఞాన నేత్రం వుందని సమాజాన్ని మభ్యపెట్టి జనాన్ని దోచుకోవడానికి ప్రయత్నిస్తున్నారా? అడవులలో గిరిజనులకి యెంతో సాయం చేస్తూంటే చూసి మీరు చాలా మంచివారను కున్నాను," అంది.

ఈ ఆరోపణకి మింగియార్ కోపం తెచ్చుకోలేదు– చిన్న బుచ్చుకో లేదు. చిరునవ్వుతో, "మంచి– చెడు అనే పదాలు వాడకండి. వాటికి స్థిరమైన అర్థం లేదు. సందర్భాన్ని బట్టి ఆ పదాల విలువ మారిపోతూ వుంటుంది. ఉదాహరణకి ఇలా మా రహస్య సమావేశాలకి వచ్చి మేం చేస్తున్న దేమిటో తెలుసుకోవడం మీ దృష్టిలో మంచి– మీ భర్త భాగవతార్‌ని అడగండి. మీరింట్లోంచి వంటరిగా యిక్కడికి రావడం చాలా చాలా చెడ్డపని అంటారు."

"భాగవతార్ మీకు తెలుసా? ఆయన మనస్తత్వం గురించి మీరెలా చెప్పగలరు?"

"భాగవతార్ యిక్కడి కొచ్చారు. అప్పుడు ముఖం చూసాను. భాగవతార్ మీ భర్తని మీరే చెప్పారు. జ్ఞాన నేత్రంతో ఆయన మనసు తెలుసుకో గలిగాను."

నిజంగా ఆశ్చర్య పోయింది మృదుల. భాగవతార్ ఆలోచనా ధోరణి మృదులకి తెలుసు. అయితే మింగియార్ దానిని జ్ఞాననేత్రంతో తెలుసుకో గలిగాడంటే మాత్రం నమ్మలేక పోయింది.

"అతడి మాటల్ని బట్టో, చేతల్ని బట్టో వూహించి వుంటారు అవునా?"

"కరెక్ట్. అదే జ్ఞాన నేత్రం. మనందరం మన చూపుల్లో– మాటల్లో– నడకల్లో– చేతల్లో మన మనస్సును ఆత్మను వ్యక్తీకరిస్తూనే వుంటాం. అయితే ఆ మనిషి లోపలి మనిషిని తెలుసుకో గలిగే శక్తి మనలో యెంత మందికి వుంది?"

"వీళ్ళంతా ఎవరు? ఎందు కొస్తున్నారు– ఈ ముసుగు లెందుకు?"

"డాక్టర్ జకిల్– అండ్ మిస్టర్ హైడ్" నవల మీరు చదివే వుంటారు. ఆ రచనలో ఫాంటసీ వున్నా ఆ మహామేధావి మానవ మనస్తత్వాన్ని ఎంత బాగా అర్థం చేసుకున్నాడు? మనమంతా మన ఐడెంటిటీ నిలుపుకోవాలని ఎంత తాపత్రయ పడ్తామో ఒక్కొక్కసారి ఆ ఐడెంటిటీ నుంచి మరుగున పడాలని కూడా అంతగానూ ప్రయత్నిస్తాము. మనలో వున్న ఉదాత్త భావాలను, ఉన్నత ఆదర్శాలను ఐడెంటిటీలో వెలిగించు కోవాలని ప్రయత్నిస్తాము. అలాగే మనలో




తలెత్తే అసహజం– అవాంఛనీయము అయిన అనేక భావాలకు– కోరికలకు– వాంఛలకు ఐడెంటిటీ నుంచి ఎలాగో తప్పించుకుని తృప్తి కలిగించాలని చూస్తాము. అదే యీ ముసుగులు. ఇలా ప్రత్యేకించి ముసుగులు వేసుకున్నా– వేసుకోకపోయినా మనలో ప్రతి ఒక్కరం ఏదో ఒక సందర్భంలో ముసుగులో దాక్కోవాలనే ప్రయత్నిస్తాము."

"అయితే యింతకీ మీరు జ్ఞాన నేత్రంతో ఎదుటివాళ్ళ జీవిత మంతా తెలుసుకో గలగటం నిజమేనా?"

"జీవిత మంతా కాదు. ఆ క్షణంలో నా యెదుటి వ్యక్తి శారీరక– మానసికావస్థలను గ్రహించ గలను. బహుశా మీకు తెలిసే వుంటుంది. జీవం వున్న ప్రతీ ప్రాణిని ఆవరించుకుని కాంతి వలయం వుంటుంది. ఇది ఆ ప్రాణిలోని జీవశక్తి ప్రతి ఫలనము. ఈ జీవశక్తి విద్యుత్ శక్తి లాంటిదే. విద్యుత్ కారణంగా ఆకాశంలో మెరుపు మెరిసినట్లే మనిషిలో వున్న జీవశక్తిని ఆధారం చేసుకుని కాంతివలయం వుంటుంది. మన పూర్వులు యేనాడో యిది అర్థం చేసుకున్నారు. అందుకే దేవతలను– ఉత్తమ పురుషులను చిత్రించేటప్పుడు శిరస్సు వెనక కాంతివలయాలను కూడా చిత్రించేవారు. ప్రతి ప్రాణిలోను అంతర్నిహితంగా విద్యుత్తు వుందని– దానివల్ల జనించిన అయిస్కాంత శక్తి వుందని ఇప్పుడు సైంటిస్ట్స్ కూడా చెప్తున్నారు. కొంత సాధనతో మనిషిని ఆవరించి వున్న యీ కాంతి వలయాన్ని– ఆ వలయంలో మనిషి– శారీరక– మానసిక కాంతి వర్ణాలని చూడొచ్చు. వాటి సహాయంతో అతని శారీరక– మానసిక రుగ్మతలను గ్రహించి తగిన విధంగా వైద్యం చేయెచ్చు. మాదంతా మూలికల వైద్యమేనని మీకు తెలుసు. ఆ మాటకొస్తే ఇపుడు మనం వాడే మందులన్నీ మూలికల్లోంచి తయారైనవే. ప్రకృతి సహజమైన మూలికల కున్న శక్తి అపారం. అది సరిగా తెలుసుకుని వైద్యం చేయగలిగితే దానిని అతిశయించగల వైద్యం లోకంలో యెక్కడా లేదు"

ఈ మాటలు ఒప్పుకోక తప్పలేదు మృదులకి. మూలికలలో వున్న ఔషధీ శక్తుల్నే రసాయనిక ప్రక్రియల ద్వారా మాత్రలుగా – కేప్సూల్సుగా – టానిక్‌లుగా వుపయోగించి అలోపతిలో వాడతారని మృదులకి తెలుసు.

"మీరు చెప్పిన జ్ఞాన నేత్రం యెలా వస్తుంది? ఎవరేనా పొందగలరా?"

"ఏకాగ్రమైన సాధన ప్రాక్టీస్ చేయగలిగితే ఎవరేనా పొందగలరనుకుంటాను. మాకు కొంత తంతు వుంది. అయితే యీ తంతు కూడా ఏకాగ్రతకి సంబంధించిందే."

"తంతా! ఏమిటది?"

"టిబెట్‌లో మేమంతా చాల కష్టజీవులం. విపరీతమైన ఎండకి – విపరీతమైన చలికి – ఎత్తైన కొండల మీంచి విజృంభించి వచ్చే చల్లటి గాలులుకి తట్టుకుని జీవించాలి మేము. మాలో చాలా మంది బౌద్ధమతాన్ని స్వీకరించారు. మా కుటుంబం కూడా బౌద్ధమతాన్ని పాటిస్తూ వచ్చింది తరతరాలుగా. పాతకాలపు సాంప్రదాయాల ననుసరించి మాబోటి కొన్ని కుటుంబాలలో ఒక పిల్లవాడి భవిష్యత్తు మతాచారుల నిర్ణయాన్ననుసరించి వుంటుంది. నాకు ఏడేళ్ళ వయస్సులోనే జ్యోతిష్కులు నా జాతకాన్ని చూసి, నేను లేమేస్రీలో చేరి అక్కడ వైద్యుణ్ని కావాలని నిర్ణయించారు. నా తల్లిదండులు ఆనందంతో యేడేళ్ళ వయస్సులో వున్న నన్ను లేమేస్రీకి అప్పగించారు. ఆ వయస్సునించే మతగురువుల శిక్షణలో జీవితం పారంభమైంది నాకు. అంత చిన్నతనం నుంచి యెంతో కఠినమైన క్రమశిక్షణలో మతాచార్యుల దగ్గిర –మతగ్రంథాలు చదవటం – జ్ఞాపకశక్తిని పెంపొందించుకొనడం –ఎదుటి వ్యక్తిని అన్ని కోణాలలోంచి తెలుసుకోవడం – తెలుసుకున్న దానిని అవసరమైనప్పుడు కాని బయట పెట్టకపోవడం – వగైరాలన్నీ నేర్చుకున్నాను. ఈ రకమైన ట్రైనింగ్ పూర్తయ్యాక అక్కడి విద్యార్థులలో కొందరిని మాత్రమే జ్ఞాననేత్రం ప్రసాదించడానికి అర్హులుగా మతగురువులు నిర్ణయిస్తారు. అలా నన్ను ఎంచుకున్నారు. జ్ఞాననేత్రాన్ని ప్రసాదించడానికి ముందు రోజు నన్నొక్కణ్ని వేరే గదిలో వుంచి ఒక రోజంతా ధ్యానంలో వుండమన్నారు. రాత్రి అవుతుండగా ఆధ్యాత్మిక రంగంలో యెంతో కృషి చేసిన ముగ్గురు మతలామాలు నాగదిలో కొచ్చారు. నా నుదుటి మీద యేదో మూలికల చూర్ణం దట్టంగా అదిమారు. అందులో మహత్తు యేమీ లేదు. నుదిటి మీద గాయం అయితే త్వరగా మాన్పడానికి

# సోవియట్ వైద్యుని చిట్కా వైద్యం

గొంతు నొప్పి, తలనొప్పితో పడిశం, చలిజ్వరం మొదలయిన జబ్బులకు వనమూలికలలో మంచి మందులున్నాయని సోవియట్ వైద్యుడు డాక్టర్ కె అల్లాయరోవ్ అంటున్నారు ఆయన అనేక జానపద ఔషద తయారీ పద్ధతులను అధ్యయనం చేశారు ఐతే ఈ ఔషధాలన్నీ కూడ ఆయా ప్రాంతాల శీతోష్ణస్థితి మీద, అక్కడ దొరికే వనమూలికల మీద ఆధారపడి ఉంటాయి

ఉల్లిపాయ . చలి జ్వరం , తీవ్రమైన తల నొప్పితో కూడిన పడిశం, గొంతు నొప్పిలకు నిరోదకంగా ఉల్లిపాయ వాడవచ్చును తాజా




ఉల్లిపాయను ముక్కలుగా తరిగి ఆ ముక్కపై నున్న తేమను రెండు మూడు నిమిషాల పాటు పీల్చుకోవాలి ఇలా రోజులో చాల సార్లు చేయాలి లేదా దాన్ని ముద్దలా తయారు చేసి రసం పిండి, అంతే మోతాదులో తేనె, మీగడ కలపాలి ఈ సమ్మేళనంలోంచి నాలుగు చుక్కలు రోజుకు ఐదారు సార్లు చొప్పున ముక్కుల్లో వేసుకోవాలి వెల్లుల్లితో కూడ ఇటువంటి సమ్మేళనం తయారు చేయవచ్చు

కారట్ కారట్ నుంచి రసం తీసి, అంతే మోతాదులో తేనె కలిపి రోజుకు నాలుగైదు సార్లు 4 నుంచి 6 చుక్కలు ముక్కుల్లో వేసుకోవాలి

కాబేజ్ రసం తీసి దానిలో వెచ్చని నీరు కలిపి పలచగా తయారు చేసి గొంతులో పుక్కిలించడానికి వాడాలి

దినుసుగడ్డ రసం తీసి అంతే మోతాదులో నీళ్ళు కలిపి వాడితే గొంతునొప్పి, గొంతువాపు, గొంతులో తడి ఆరిపోవడం తగ్గుతాయి

ద్రాక్ష ఎండి పోయిన ద్రాక్ష ఆకుల పొడిని ఒక గ్లాసు మరిగే నీటికి ఒక చెమ్చా చొప్పున వేసి దానితో రోజుకు మూడు నాలుగు సార్లు పుక్కిలించాలి

స్ట్రాబెర్రీ స్ట్రాబెర్రీని నీటిలో నాన బెట్టితే ఆ నీరు అనేక రోగ కారక క్రిముల్ని చంపెయ్యగలుగుతుంది ఈ నాన బెట్టిన నీటిని మరిగే నీటిలో గ్లాసుకు రెండు చెమ్చాల చొప్పున వేసి రోజుకు మూడు నుంచి ఐదు సార్ల వరకు పుక్కిలించాలి స్ట్రాబెర్రీ ఆకులు, వేళ్ళు కూడ ఆరోగ్య రీత్యా రోగనిరోధక శక్తి గలవి ఎండిన ఆకులతో నానిన నీటిని కూడ పైవిధంగానే చేసి రోజుకు ఐదుసార్లు పుక్కిలించాలి

మునగ మునగ రసాన్ని అదే మోతాదుగల నీటితో పలచన చేసి, కొంచెం వెచ్చబరిచి రోజుకు నాలుగైదు సార్లు పుక్కిలించాలి

జల్దారు మధ్య ఆసియా జానపద ఔషదాలలో జల్దారు కాయల్ని పొడి చేసి, ఒక చెమ్చా తేనెలో ఒక చెమ్చాపొడిని కలిపి శ్వాస కోశానికి సంబంధించినటు వంటి వ్యాధులలో వాడతారు ఈ మిశ్రమాన్ని వెచ్చని పాలతో కలిపి లోపలికి తీసుకుంటారు

గోదుమ గోధుమ తౌడు కలిపిన వెచ్చని నీటిని తేనెతో కలిపి తీసుకుంటే శ్వాసకోశం




శుభ్రమవుతుంది గోధుమ తౌడు నీరు రెండు చెమ్చాలు తీసుకుని గ్లాసు నీటిలో ఐదు నుంచి ఏడునిమిషాలు వెచ్చబెట్టాలి ఆ వెచ్చని నీరు అరగ్లాసుకు ఒక చెమ్చా తేనెకలపాలి □

---

మాత్రమే పనికొస్తుందా చూర్ణం తరువాత నేను పూర్తిగా తెలివిలో వుండగానే 'యు' ఆకారంలో వున్న పదునైన పళ్ళున్న ఉక్కు చట్రాన్ని నేర్పుతో నుదిటిలోకి గుచ్చారు దానిని గుచ్చబోయే ముందు మా గరువు, "మింగియార్ ఇది చాలా బాధాకరంగా వుంటుంది ఈ ప్రయోగం మత్తు మందిచ్చి చేయడానికి వీల్లేదు నువ్వు పూర్తిగా తెలివిలోనే వుండాలి నీ ధ్యాన బలంతో యీ బాధనంతా భరిస్తూ యేమాత్రం కదలకుండా స్థిరంగా వుండాలి నీ మానసిక – శక్తి పైన నీకు సిద్ధించబోయె జ్ఞాననేత్ర ప్రభావం ఆధారపడి వుంటుంది" అన్నారు అది చాలా బాధాకరమైన అనుభవం అప్పటికే యెంతో సాధన వుండటం వల్ల మనసుని యేకాగ్రంగా ధ్యాన ంలో నిలిపి యేమాత్రం కదలకుండా ఆ బాధంతా భరించగలిగాను బహుశాః ఆ ఇనుస్ట్రుమెంట్‌లో మహత్తు యేమీ లేదేమో మనసుకున్న యేకాగ్రత పరిమితిని నిర్ణయించడానికి అది కేవలం పరీక్ష మాత్రమే నేమో? నేను సరిగా చెప్పలేను ఆ స్థితిలో నేను ఒక రోజంతా పద్మాసనంలో ధ్యాన ంలో వుండిపోయేను తొలి క్షణాల తరువాత నాకు బాధ తెలియలేదు కాలం ఆగిపోయినట్లు అనిపించింది ఆ మరునాడు స్టెరిలైజ్ చేసిన కొన్ని వెండి పనిముట్లతో నుదిటి నుంచి "యు" ఆకారం గల ఇన్‌స్ట్రుమెంట్‌ని తీసేసారు హెర్బల్ లోషన్స్‌తో మతగురువు స్వయంగా నుదురు కడిగి మూలికల చూర్ణం పూసారు ఇంతే ఆ తంతు ఆ రోజుల్లో నేను యేకాంత వాసంలో గడిపేవాడిని. వైద్య విషయాలు, ఆధ్యాత్మిక విషయాలు బోధించే గురువులు తప్ప మరెవరూ నా గదిలోకి వచ్చే వారు కారు ఆ రోజులలో నేను కేవలం శరీరధారణకి అవసరమైనంత ఆహారమూ, నీరూ తీసుకునేవాడిని అలా ఎన్ని రోజులు గడిచాయో నాకు తెలియదు ఎందుకంటే ఆ రోజుల్లో నాకు టైమ్‌సెన్స్ ఏమాత్రం వుండేది కాదు ఒకరోజు మా గురువు గారు నన్ను ఆశీర్వదించి, "మింగియార్! ఇప్పుడు నువ్వు కూడా మాలో ఒకడివైపోయావు. ఇహ నీ మిగిలిన జీవితమంతా మనుష్యుల్ని వారి వారి యథార్థ తత్వాలతో చూడగలవు ఎదుటి వాళ్ళు నీ ముందు యేరకంగా కనిపించాలని ప్రయత్నించినా నీకు మాత్రం నిజ స్వరూపం మాత్రమే కనిపిస్తుంది అన్నారు

మృదుల ఆశ్చర్యంగా, ఇప్పుడు మీరు ప్రతీ మనిషినీ ఆవరించి వున్న కాంతి వలయం చూడగలరా? అడిగింది

చూడగలను ప్రయత్నించి సాధన చేస్తే యెవరేనా చూడగలరేమో? సూర్యుడ్ని ఆవరించి వున్న కాంతి వలయాన్ని మనం మామూలుగా చూడలేము కాని గ్రహణ సమయంలో మసి పూసిన అద్దంలోంచి దాన్ని దర్శించగలం ఇప్పుడు సైన్‌టిస్టులు కొందరు ఎలక్ట్రిక్ బ్రైన్ వేవ్స్‌ని అంచనా వేసి రికార్డు చేయగలుగుతున్నారు నేను కేవలం కాంతి వలయం మాత్రమే కాదు ఆయా శారీరక – మానసికావస్థలకు సంబంధించిన వర్ణాలను కూడా చూడగలను'

"వర్ణాలా?'

'అవును మన వాతావరణం సమస్తము యెన్నెన్నో వర్ణాల సముదాయం. ప్రచండమైన సూర్యకాంతిలో అవి లీనమై తెలుపు మాత్రమే తోస్తుంది ప్రిజమ్ లోంచి చూసినప్పుడు తెల్లని సూర్యకాంతిలో రంగులన్నీ మనకి కనపడటం లేదూ!"సెన్సిటివ్‌నెస్ పెంపొందించుకుంటే యీ వర్ణాలు కనపడతాయి'

(ఇంకా ఉంది)




## పెద్దలు కుదిర్చిన పెళ్లి!



శ్రీమతి బెనాజిర్ బుట్టో ఆక్స్ పోర్డ్ హార్వర్డ్ విశ్వ విద్యాలయాలలో చదువుకున్నారు తండ్రి కీ శే జుల్ఫికర్ అలీ బుట్టో లాగే పాకిస్తాన్ రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించటానికి ప్రయత్నిస్తున్నారు

ఈమె హటాత్తుగా తన వయస్సు (34) కల శ్రీ అసీప్ అలీ జర్దారిని పెళ్లి చేసుకోబోతున్నట్లు వెల్లడించారు శ్రీ జర్దారీ లండన్ విశ్వవిద్యాలయంలో చదువుకున్న వారు ఈయన బవనాలు నిర్మించే కాంట్రాక్టరు

ఇంత పెద్ద నాయకురాలు - అందులోనూ పారిన్ లో చదువుకున్న ఆవిడ - మామూలు పాకిస్తానీ ఆడవారి లాగే పెద్దలు కుదిర్చిన పెళ్లి చేసుకుంటున్నారేమిటి? అని కొందరు పాశ్చాత్యులు అడుగుతున్నారు అంతే కాకుండా ఆమె సోదరులు సోదరీమణులు ప్రేమ వివాహాలు చేసుకున్నారు! ఒక రాజకీయ నాయకురాలు ప్రేమించి పెళ్లి చేసుకోవటం తమ దేశంలో కుదరదని శ్రీమతి బెనాజిర్ అబిప్రాయం

శ్రీమతి మార్గరెట్ డాచర్ లాగే తను రాజకీయాలలో ఉంటే బర్త వ్యాపారంలో ఉండవచ్చునని ఆమె అంటున్నారు

కీ శే జుల్ఫికర్ అలీబుట్టో బార్య ఒకరు డిల్లీలో డాన్సింగ్ గర్ల్ గా ఉండేవారని ప్రతీతి ఆయన తండ్రి జునాగడ్ సంస్థానానికి ప్రదానిగా ఉండేవారు పాకిస్తాన్‌కి పారిపోతూ బార్య సంతానాన్ని వదిలి వెళ్లిపోవటానికి సందేహించని పెద్ద మనిషి

## దక్షిణ ఆఫ్రికా కుట్ర!



ఎనిమిది నెలల క్రితం మొజాంబిక్ అద్యక్షుడు సమోరా మాచెల్ ఒక విమాన ప్రమాదంలో మరణించాడు అది నిజంగా ప్రమాదమేనా విద్రోహ చర్యా అనే చర్చ ఇంకా కొనసాగుతుండగానే కొత్త అద్యక్షుడు జోక్విమ్ చిస్సానో స్థానం సుస్థిరత మీద అనుమానాలు తలెత్తేటటువంటి పరిస్థితి మొదలైంది ప్రెలిమో పార్టీ తరఫున ఆయన నడుపుతున్న మార్క్సిస్టు తరహా ప్రబుత్వాన్ని కూలదోయాలని రెనామో పేరు గల మితవాద గెరిల్లా బృందం ప్రయత్నాలు సాగిస్తున్నది రెనామో గెరిల్లాలకు దక్షిణాఫ్రికా ఆర్థిక సైనిక సహాయం అందజేస్తున్నది ఆ గెరిల్లాలు జులై చివరి వారంలో హూమొయిన్ అనే నగరం మీద దాడి చేసి 386 మంది పౌరులను ఊచకోత కోశారు ఒకవైపు రెనామో గెరిల్లాలను ఎదుర్కొంటున్న చిస్సానో మరొక వైపు ప్రతికూల ఆర్థిక పరిస్థితిని కూడా ఎదుర్కొంటున్నారు ముందే ఎంతగానో దిగజారి పోయి ఉన్నటువంటి మొజాంబిక్ ఆర్థిక వ్యవస్థ ఎనిమిదేళ్ళుగా సాగుతున్న కరువు వల్ల మరింత క్షీణించింది ఇటువంటి ప్రతికూల పరిస్థితులలో కూడా చిస్సానో ధైర్య సాహసాలతో కొనసాగుతున్నారంటే కారణం ఆయనకు అమెరికా బ్రిటన్‌లతో పాటు ఇరుగుపొరుగు ఆఫ్రికన్ దేశాల నుంచి అందుతున్న ఆర్థిక సైనిక నైతిక సహాయమే ప్రస్తుతం 43 సంవత్సరాల వయసున్న చిస్సానో గతంలోని మాచెల్ ప్రబుత్వంలో పదకొండు సంవత్సరాల పాటు విదేశాంగ శాఖ మంత్రిగా పని చేశారు

## చదరంగానందలహరి



చదరంగం మన దేశంలోనే పుట్టినా అంతర్జాతీయ స్థాయిలో మనదేశపు ఆటగాళ్ళకు సాదారణంగా విజయం లబించడం లేదు మొదటి సారిగా ప్రపంచ జూనియర్ చాంపియన్ షిప్‌ను కైవసం చేసుకుని విశ్వనాథన్ ఆనందన్ ఈ అపవాదును రద్దు చేశాడు 1969 డిసెంబర్ 11న జన్మించిన ఆనందన్ ఆరేళ్ళ వయసునుంచే చదరంగం ఆడడం ప్రారంబించాడు దక్షిణ రైల్వేలో జనరల్ మేనేజర్‌గా పనిచేసి రిటైరయిన తండ్రి నుంచి అంతకన్న ఎక్కువగా తల్లినుంచి ప్రోత్సాహాన్ని పొందుతూ ఆనంద్ చదరంగ విజయాలలో ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ వచ్చాడు 1978లో మనిలాలో ఉండగా పోటీలలో ఆడడం ప్రారంబించిన ఆనంద్ 1983 కల్లా బొంబాయిలో జరిగిన జాతీయ టీమ్ చాంపియన్ షిప్‌లో టాప్ బోర్డ్ ప్రైజ్ గెలుచుకున్నాడు తర్వాత అహ్మదాబాద్ పారిస్ ఫిన్లాండ్ నార్వే హాంగ్‌కాంగ్‌లలో ఆడిన ఆటలు ఆనంద్‌ను అంతర్జాతీయ మాస్టర్‌ను చేశాయి 16 సంవత్సరాల వయసులోనే ఆనంద్ సీనియర్ నేషనల్ క్రౌన్ సాదించడం ద్వారా గ్రాండ్ మాస్టర్ కావడానికి తగిన అర్హతలు సంపాదించాడు గత నెలలో పిలిప్పైన్స్‌లోని బాగియో నగరంలో ప్రపంచ జూనియర్ చెస్ చాంపియన్ షిప్‌ను సాదించి బారతదేశ ప్రతిష్టను నిల బెట్టిన ఆనంద్ ప్రపంచ చాంపియన్ షిప్ వరకు ఎదగాలని కోరుకోవడం సహజం అది నా మనసులో ఉంది కాని నేను ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ వెళతాను అన్నాడు ఆనంద్

## నిరోధక శక్తి ముఖ్యం



కాన్సర్‌ని మామూలు మందులతో నయం చెయ్యటానికి ప్రయత్నించటం కన్నా దేహంలోనే ఆ రోగాన్ని ఎదిరించి పోట్లాడగలిగే పదార్థాలని తయారు చెయ్యాలని వాదిస్తారు 43 సంవత్సరాల ప్రొఫెసర్ (డాక్టర్) కారిన్ మిల్లింగ్ ఈమె ప్రస్తుతం జర్మనికి చెందిన వారు బెర్లిన్‌లో ఉంటారు గొప్ప శాస్త్రవేత్తగా పేరు పొందారు

## గీత్ రికార్డులు!



1985లో సంచలనాత్మకంగా బిలియర్డ్స్‌లో ప్రథమశ్రేణి క్రీడాకారుడుగా వెలుగు లోకి వచ్చిన గీత్‌సేఠీ ఈ సంవత్సరం కూడా ప్రపంచ అమెచ్యూర్ బిలియర్డ్స్ ఛాంపియన్ షిప్ కైవసం చేసుకుని చరిత్ర సృష్టించారు

గీత్‌వయసు 26 సంవత్సరాలు 1976లో జాతీయ జూనియర్ బిలియర్డ్స్ పోటీల్లో గెలిచి జాతీయ బిలియర్డ్స్ పోటీల్లో ప్రవేశించిన గీత్ అప్పటి నుంచి బిలియర్డ్స్ స్నూకర్‌లలో విజయాలని సాదిస్తున్నాడు 1982లో జాతీయ సీనియర్ బిలియర్డ్స్ టైటిల్, జాతీయ జూనియర్ డబుల్స్ టైటిల్, 1984, 85 86 లలో వరుసగా విజయాలు, 1985లో అమెచ్యూర్ బిలియర్డ్స్ ఛాంపియన్ షిప్ సాదించాడు అతి చిన్న వయసులోనే ఈ విజయం సాధించిన గీత్ ఈ సంవత్సరం ఛాంపియన్ షిప్ గెలవడమే గాక ఇప్పటి వరకూ నమోదయిన రికార్డులను అదిగమించాడు □

# పళ్ల డాక్టర్లకు కూడా లవంగ నూనె పైన పరమ విశ్వాసం.



ఆయుర్వేదంలోనేమి, అల్లోపతీలోనేమి లవంగ నూనెకు గొప్ప ప్రశంస ఉంది. దంతవైద్యశాలల్లో కూడా దీనికి గొప్ప స్థానం ఉంది.

వెనకటి రోజులలో, పళ్లలో ఎంత చిన్న బాధ వచ్చినా లవంగ నూనెనే గుర్తు చేసుకునే వారు. అదే లవంగ నూనె, అచ్చంగా కావలసినంత మోతాదులో మీకిప్పుడు ప్రామిస్ టూత్‌పేస్టులో అందుతుంది. ఇందుచేత మీరు ప్రామిస్‌తో పళ్లు తోముకున్నప్పుడు, అదే లవంగ నూనె మీ పళ్లలో మూలమూలలా చేరి, మీ పళ్ల మొదళ్లకు హాని చేస్తున్న సూక్ష్మజీవులను తరిమి కొట్టుంది. ఈ సూక్ష్మ జీవుల పీడ నుంచి విముక్తి పొందిన మీ పళ్లు సదా ఆరోగ్యవంతంగానూ దృఢంగానూ, మెరిసిపోతూనూ ఉంటాయి. ఇది లవంగ నూనె అద్భుత గుణాలలో ఒక్కటి మాత్రమే.

ప్రామిస్‌లోని అద్వితీయ ఫార్ములా కారణంగా ఈ లవంగ నూనె, నోటి దుర్వాసన కలిగించే సూక్ష్మజీవులను కూడా కూల్చివేస్తుంది; మీ శ్వాసలో సువాసనలు నింపి తెస్తుంది.

మీ పళ్లను సదా ఆరోగ్యవంతంగా ఉంచుకోండి, మంచి ముత్యాల్లా మెరిసిపోనీండి. నోటిలో అద్భుతమైన తాజాదనం తీసుకు రండి — ఒక్క మాటలో చెప్పాలంటే ప్రామిస్ టూత్‌పేస్టు వాడడం ప్రారంభించండి.






**Promise**

లవంగ నూనెతో అద్భుత సృష్టి - ప్రామిస్ టూత్‌పేస్టు




రోజంతా విసుగు, విరామం లేకుండా తిరిగిన దినకరుడు పశ్చిమాద్రి కొండల చాటున విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఇక నెల రాజు వాహ్యాళికి బయలుదేరాడు. నింగిపై తారలు ఒక్కొక్కటే తొంగిచూస్తున్నాయి.

కళానిలయం ప్రాంతంలో నేల ఈనినట్లు జనం. తండోపతండాలుగా జనం కళానిలయం చేరుకుంటున్నారు. అందరిలోనూ పరవళ్ళు తొక్కుతున్న ఉత్సాహం.

మహానటి మోహినిని సాధ్యమయినంత దగ్గరగా చూడాలని తాపత్రయం. కళానిలయం కిక్కిరిసి పోయింది.

జనసందోహాన్ని అదుపు చేయడం నిర్వాహకులకు సాధ్యం కావడంలేదు. మహానటిగా అవార్డుల పరంపరలందుకొని దక్షిణాది భాషా చిత్రాలలో తిరుగులేని రాణిగా రాజ్యమేలుతున్న మోహిని పుట్టి, పెరిగి ప్రాభవం సంపాదించిన ఊరికి రావడం ఇదే మొదటిసారి కావడంతో జనానికి పట్టలేనంత ఆనందంగా ఉంది.

'మోహిని తమ మనిషి' అన్న భావం అందరిలోనూ అంతర్లీనంగా తాండవమాడుతోంది.

ఇక అభిమానుల కోలాహలానికి అంతేలేదు.

అవధులు దాటుతున్న వారి సంబరం అంబరాన్ని తాకుతోంది. ఏ క్షణంలో మోహిని సమ్మోహన హాసంతో కారు దిగుతుందోనని కళ్ళల్లో వత్తులేసుకుని చూస్తున్నారు.

"ఇదిగో ... రెండు నిముషాల్లో ఆవిడ వచ్చేస్తారు" అంటూ నిర్వాహకులు అభిమానులను ఊరిస్తున్నారు.

"అసలు అంతగా ఆర్థిక స్తోమతలేని ఈ నాటక సమాజం ఏర్పాటుచేసిన ఈ సన్మాన సభకు మోహిని వస్తుందా" అని కొంతమంది అనుమానం వ్యక్తం చేస్తున్నారు.

"ఎందుకు రాదు ... ఈ నాటక సమాజంలోనే మొదటిసారిగా మొఖానికి రంగు వేసుకుని ... ఈ నాటక సమాజం ద్వారానే అనేక నాటకాలు ఆడి మంచి పేరు తెచ్చుకుని ... చివరికి ఈ సమాజం ఆడిన "ఆడది" నాటికద్వారాపరిశ్రమ పెద్దలను ఆకర్షించి పెద్ద స్టార్ అయిపోయిన మోహిని ఇప్పుడు - ఏరు దాటిన తర్వాత తెప్ప తగలేసే చందాన ప్రవర్తిస్తుందా, లేదు ... వచ్చి తీరుతుంది" అంటూ మరికొందరు వాదిస్తున్నారు.

అందరిలో స్పందన ...

ఉత్సాహం ...

ఉద్వేగం ...

వందలాది సినిమాల్లో నటించి తమను సంభ్రమపరచిన ఆరాధ్య దైవాన్ని చూడబోతున్నామన్న స్పందన ... వెండితెర ఇలవేలుపు మోహినిని తక్షణం చూడాలన్న తపన ... అసలు ఆ దివ్య సుందరి వస్తుందా? వస్తే ఎంతసేపు తమ కళ్ళ ముందు ఉంటుందన్న ఉద్వేగం అందరినీ పట్టి ఊపేస్తున్నాయి.

"అదిగో మోహినీ కారు" అరిచారెవరో ...

కొన్ని వేల కళ్ళు అటు తిరిగాయి.

వారి నరాల్లో ప్రవహిస్తున్నది రక్తంకాదు ... టెన్షన్.

మారుతి కారు మనోహరంగా వచ్చి ఆగింది.

అందులో నుంచి-

సుతారంగా దిగింది సినీనటి, అభిమానుల ఆశాజ్యోతి మోహిని.

"జిందాబాద్ మోహినిగారు"

"అగ్రనాయిక మోహిని వర్ధిల్లాలి"

"సూపర్ హీరోయిన్ మోహిని జిందాబాద్"

అన్న నినాదాలతో ఆ ప్రాంతం మారుమ్రోగింది.

మోహిని, ఆమె తండ్రి వాసుదేవరావు అతి కష్టంమీద కళానిలయంలోకి చేరుకున్నారు.

వాసుదేవరావు ఒకసారి హాలంతా కలియజూశాడు. హాలంతా జనసందోహంతో కిటకిటలాడుతోంది.

ఆయనకు కళానిలయాన్ని చూస్తుంటే మాతృమూర్తిని చూస్తున్న అనుభూతి కలుగుతోంది. ఇప్పుడు మోహినిని సత్కరిస్తున్న 'అభ్యుదయ నాటక సమాజం'వారే ఈ కళానిలయంలో తొలిసారి నాటకంలో వేషం వేసే అవకాశం ఇచ్చింది. తన చిన్నారి మోహినికి కడుపునిండా తిండిపెట్టలేక ఇదే కళానిలయంలో పస్తులతో గడిపిన నిశిరాత్రులెన్నెన్నో ... ఈ కళానిలయం ద్వారానే తన మోహినికి గుర్తింపు వచ్చింది. ఈ అభ్యుదయ సమాజానికి వేయి జన్మలు తామిద్దరం సేవలు చేసుకున్నా రుణం తీరదు. ఇదే కళానిలయంలో 'అభ్యుదయ నాటక సమాజం' వారు ఆడిన నాటకంలో మోహిని పాత్రను, ఆమె నటనను ప్రశంసించి మద్రాస్ తీసుకెళ్ళి నిర్మాత నరసింహం



గారు సినిమా ఛాన్స్ యిచ్చిన మధురానుభూతి ప్రతి రోజూ అన్నం తినే ముందు వాసుదేవరావుగారి కళ్ల ముందు కదులుతుంది.

అలాంటి కళానిలయానికి, తమకు చేయూత నిచ్చిన అభ్యుదయ నాటక సమాజానికి గొప్ప స్టార్‌అయి మోహిని ఏం చేసింది? అన్న విషయం గుర్తుకు వస్తే మాత్రం ఆయనకు ముద్ద గొంతుకు దిగేదికాదు.

"అభ్యుదయ నాటక సమాజం ఇప్పుడు దీనావస్థలో వుందట. ఎంతో కొంత సాయం చేయాలమ్మాయి" అంటే మోహిని రుస రుసలాడేది. మనకు ప్రతిభ ఉంది పైకొచ్చాం - మధ్యలో ఆ సమాజమేం చేసింది అని కొట్టిపారేసేది. అలాంటి సమయాల్లో వాసుదేవరావుగారు వ్యాకులమైన మనసుతో పక్కకు తప్పుకునేవారు.

అలాంటిది - ఓనాడు ...

అభ్యుదయ నాటక సమాజం నిర్వాహకులు మద్రాస్ వచ్చి నాలుగు రోజులు నిరీక్షించి ఎలాగైతేనేం మోహినిని కలుసుకోగలిగారు.

"అమ్మా! నువ్వు మా చేతులమీద పైకొచ్చిన చిట్టివమ్మా ... నీకు సన్మానం చేసి అందరూ దీవిస్తుంటే కళ్లారా చూడాలని వుంది. మా కోరిక మన్నించమ్మా" అంటూ వాళ్లు మోహినిని వేడుకుంటూంటే వాసుదేవరావు గారు కూడా మౌనంగా రోదించారు.

అదురుతున్న గుండెతో కూతురు నోటి నుండి ఏం సమాధానం వస్తుందోనని ఎదురు చూశారు.

"వస్తాను ... మీరంతగా ప్రాధేయపడుతుంటే తప్పుతుందా! ఏర్పాటు చేసుకోండి" అని చెప్పి కారెక్కి వెళ్లిపోయింది మోహిని.

ఆ మాట వాసుదేవరావు గారికి పన్నీటి జల్లులా అన్పించింది. నిర్వాహకులకంటే ఆయన ఎక్కువ సంతోషించారు, కూతురు మనసులో ఏ మూలో ఇంకా కృతజ్ఞత మిగిలి వున్నందుకు.

కళానిలయం అంతటా కరతాళ ధ్వనులు మారుమోగాయి.

వాసుదేవరావు గారు ఉలిక్కిపడి గతం నుంచి

# ఈ వేమన పద్యాలు




పాపమనగ వేఱె పరదేశమున లేదు
తనదు కర్మమునను తగిలియుండు
కర్మ ధర్మములను కనుగొనుటొ ప్పకు
విశ్వదాభిరామ వినుర వేమ.

వర్తమానంలోకి వచ్చారు. వేదిక మీద కూర్చున్న మోహిని నుదుట కుంకుమ ... మెడలో పూలమాలలు. నిర్వాహకులలో సీనియర్ ఒకాయన మాట్లాడుతున్నాడు.

"మీ అందరికీ తెలుసు. ఒకప్పుడు ప్రాభవదీప్తులు వెదజల్లిన అభ్యుదయ నాటక సమాజం నేడు దీనావస్థలో ఉంది. మేమేదో చిన్న చిన్న ఉద్యోగస్థులం. మాలో ఒక్కరుగా మెలగి ఈనాడు తారాపథంలో అగ్రస్థానాన్ని అధిష్ఠించిన మోహిని గారిని సత్కరించాలన్న ఆలోచన అయితే ఏర్పడింది కానీ దానికి కావలసిన ఆర్థిక సంపత్తి సమకూర లేదు. ఏదో మాకు ఉన్నంతలో మేము తెచ్చిన ఈ చీరను మోహినిగారిని స్వీకరించవలసిందిగా కోరుతున్నాము" అంటూ కరతాళ ధ్వనుల మధ్య

## మహానటి

మోహినికి చీర అందించారు.

కొద్దిసేపటికి -

మోహిని మైకు దగ్గరకు వచ్చింది -

హాలులో గుండు సూది పడినా విన్పించేటంత నిశ్శబ్దం.

అందరూ ఊపిరి బిగబట్టి చూస్తున్నారు.

"అందరికీ నమస్కారం. నేను ఎన్నెన్నో ఉన్నత శిఖరాలను అధిరోహించినా అదంతా అభ్యుదయ నాటక సమాజం పెట్టిన భిక్షేనని నేను జన్మలో మర్చిపోను. నేనంటే ఎవరికీ తెలియని రోజున సమాజం నన్ను ఆత్మీయురాలిగా అక్కున జేర్చుకుంది. నాకు నటనలో అక్షరాభ్యాసం చేసింది. అభినయంలో అ ... ఆ ... లు నేను ఇక్కడే నేర్చుకున్నాను. నిజానికి నాకు కన్నతల్లి కన్నా, కన్నతండ్రి కన్నా సమాజం ఎక్కువ. నేను ఎన్నెన్ని కీర్తి కిరీటాలు ధరించినా మీ మధ్య వున్నప్పుడు పొందే ఆనందాన్ని అనుభవించలేను. నేను మీలో ఒక్కరిని. నన్ను వేరు చేయవద్దు. ఎన్నో ఇబ్బందుల్లో ఉండి కూడ నన్ను సత్కరించి ఆడబడుచులా భావించి ఇచ్చిన ఈ చీర నాకు అపురూపమయినది. మీ అందరికీ మరోసారి కృతజ్ఞతలు ..."

ప్రసంగం ముగించింది మోహిని.

సభికుల హర్షధ్వానాలతో కళానిలయం దద్దరిల్లిపోయింది. కళ్లకొనకల్లో చేరిన కన్నీటి చుక్కలను వాసుదేవరావు గారు తుడుచుకుంటూ "ఎంతైనా నా కూతురు సుమా" అనుకున్నారు.

మోహిని, వాసుదేవరావు గారిని నిర్వాహకులు అతి కష్టంమీద కారు ఎక్కించారు. కారు పరుగెత్తుతుంటే చల్లటి గాలి మొఖాన్ని తాకి ఆహ్లాదపరుస్తోంది. ఆయన మనస్సు నిండా తృప్తి, సంతోషంతో కళ్ళు మూసుకొని సీటుకి జారగిల్లారు.

రెండు నిముషాల తర్వాత మోహిని మాటలు విన్పించి కళ్ళు తెరిచి వాసుదేవరావుగారు నిస్తేజమయ్యారు.

మోహిని నుదుట బొట్టు చెరిపేసుకుంది. పూలదండలు వేస్తున్నప్పుడు తలపై పడ్డ పూలను దులుపుకుంటూ -

"ఛీ ఛీ ... వెధవ గోల ... సత్కారమంట ... సత్కారం పేరుతో నా ప్రాణంతీశారు. సొంత ఊర్లో సన్మానం చేస్తాం రమ్మంటే రాలేదని జనం అనుకుంటారని వప్పుకుంటే ఈ 'బ్రూట్స్' వల్ల మంచి శాస్తే జరిగింది. సరిగ్గా ఫ్యాన్ గాలి కూడా లేని ఆ హాలులో ఒక్క క్షణం కూర్చో లేకపోయాను. సన్మానం అంటే అదా? లేని వెధవలు లేనట్లు పడుండాలి. సన్మానం అని తీసుకెళ్లి అంత 'చీప్'గా చేస్తారా వెధవలు ... నా ప్రెస్టేజీ అంతా గంగలో కలిపారు బాస్టర్డ్స్".

వాసుదేవరావుగారిలో భూకంపప్రకంపనాలు.

"నా వేల్యూబుల్ టైమ్ వేస్ట్ చేశారు పనికిమాలిన వెధవలు ..." అంటూ మధ్యలో నాప్‌కిన్ సీట్ పైన పడటంతో అప్పుడు చూసింది నిర్వాహకులు ఇచ్చిన చీరను.

" ... ఈ చీరను నేను కట్టుకోవాలట ... నా ఇంట్లో పనిమనిషి కూడా ఇలాంటి చీర కట్టదు ..."

నిరుత్తరుడయిన వాసుదేవరావుగారు చలనరహితంగా చూస్తున్నారు.

మోహిని విసురుగా చీరను తీసి కారు విండో నుంచి బయటకు విసిరేసింది.

సరిగ్గా-

అప్పుడే వెనుకనుంచి వస్తున్న కారు టైరు కింద పడిన చీరను చూస్తున్న ఆ 'మహానటి' తండ్రి కళ్ల నుండి ధారాపాతంగా కన్నీళ్ళు ఆ దృశ్యాన్ని మసకబార్చాయి. □

# వరిపైరు పిలకలు వేసే సమయం
# నాగార్జున యూరియకిదే సమయం




పైరు మొక్కల పోషణకు, మంచి దిగుబడులకు కీలకమైన పోషక పదార్థం నత్రజని. దీనిని సాధారణంగా యూరియ ద్వారా మొక్కలకు అందిస్తున్నాం.

పైరుకు ముఖ్యంగా మాగాణి వరికి అవసరమైన మొత్తం యూరియ ఎరువును ఒకేసారి వేయకుండా రెండు లేదా మూడు దఫాలుగా వేస్తే వృధా కాకుండా మొక్కలు సమర్థవంతంగా వినియోగించుకుంటాయి.

ప్రతి ఏటా వరిపైరు చేసే పొలాల్లో దమ్ము చేసి నాట్లు వేసేటప్పుడు నత్రజని (యూరియ) వేస్తే, అది వృధా అవడమే తప్ప, క్రొత్తగా నాటిన మొక్కలు వినియోగించుకోలేవు. అందుచేత మొక్కలు వేళ్ళూని పోషక పదార్థాలను సమర్థవంతంగా వినియోగించుకొనే దశలో యూరియ వేయాలి. నాట్టిన 20-25 రోజులకు వరి మొక్కలు వేళ్ళూని దుబ్బు చేసే (పిలకలు వేసే) సమయం. ఈ సమయంలో సిఫార్సు చేసిన మోతాదులో సగభాగం యూరియనే వేయడం మంచిది. లాభదాయకం కూడా. అటు తరువాత 20-25 రోజులకు వరి మొక్కలు చిరుపొట్టు దశకు వచ్చినప్పుడు మిగతా సగభాగం యూరియ వేయాలి

యూరియ వృధా కాకుండా మంచి దిగుబడులను పొందాలంటే :
- నీరు నిలువ ఉండకుండా బురదగా ఉన్న పొలంలో చల్లాలి.
- చల్లేముందు ప్రతి 5 కిలోల యూరియతో 1 కిలో వేప పిండిని కలపండి.
- మొక్కలకు దగ్గరగా పడేటట్లు చూడండి.
- చల్లిన 24-36 గంటల తర్వాత నీరు కట్టండి.

యూరియ ఎంత వేసామని కాదు. ఎట్లా వేసామనేది ముఖ్యమని గుర్తించుకోండి. నాణ్యతకు, నమ్మకకు పేరెన్నిక గన్న నాగార్జున యూరియనే వాడండి.

ఇతర వివరాలకు :



**నాగార్జున ఫెర్టిలైజర్స్ అండ్**
**NFC కెమికల్స్ లిమిటెడ్**

నాగార్జున హిల్స్, హైదరాబాద్ - 500 482.




## పైరుకు పసిమి-రైతుకు కలిమి నాగార్జున యూరియ

Imageads

# బాధితుల విచారణా పర్యటనలో మంత్రి మహాశయుల వినోద ప్రదర్శన!

"రాజకీయ నాయకులు ఎంత చెడ్డా మనలాంటి మనుషులే కదా బాధలతో అలమటిస్తున్న వారిని చూచి గుండె చెరువై కళ్ళనీళ్ళు నింపుకోరా" అని పొరపాటుగా నైనా ఎవరయినా అనుకొంటూ ఉంటే అలా అనుకోవడానికి ఎంత మాత్రం వీలులేదని ఇటీవల నీరుకొండ గ్రామంలో "నువ్వా నేనా" అంటూ సినిమా ఫక్కీలో మాటల "ముష్టి" యుద్ధానికి తలపడిన రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు, కేంద్రప్రణాళిక శాఖా మంత్రి శ్రీ పి. శివశంకర్ నిరూపించారు!

మంగళగిరిలో పానకాల నరసింహస్వామి చూస్తూనే ఉన్నాడు. పక్కనే బెజవాడ కనకదుర్గ కూడా ఉంది. అయినా హరిజనుల మీద "అగ్ర"వర్ణాల వారి దాడి జరగనే జరిగింది.

ఈ దాడిలో ఒక హరిజనుడు చంపబడ్డాడు. పసివాళ్ళను కొట్టారు. ఆడవాళ్ళని రకరకాలుగా హింసించారు. గోలగోల అయింది. విచారణలు మొదలయ్యాయి. అంతట్లోనే హరిజనవాడ మొత్తం అగ్నికి ఆహుతి అయిపోయింది. ఎవరన్నా నిప్పుపెట్టారా? లేక పోతే పొరపాటుగా ప్రమాదం జరిగిందా? తెలియడం లేదు. పోతే హరిజనులే కావాలని నిప్పు పెట్టుకొని పెద్ద గొడవగా తయారు చేస్తున్నారన్న వదంతులు కూడా వినబడుతున్నాయి. వీరి వెనుక ఒక జాతీయ రాజకీయ పక్షం ఉందని కొంతమంది చెబుతున్నారు. నిజానిజాలు స్పష్టంగా ఎవరికీ తెలియడం లేదు!

ఈ పరిస్థితిలో నీరుకొండను చూడాలని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ అనుకొన్నారు. మత కలహాలు నిత్యం జరుగుతూ వందలాది మంది చనిపోతున్న ప్రాంతాలు ఎన్నో దేశ రాజధానీ నగరానికి దగ్గరలో నే ఉన్నాయి. అయినా శ్రీ రాజీవ్ గాంధీ అలాంటి ఘోరాలు జరుగుతున్న ఎన్నో ప్రదేశాలకు వెళ్ళలేదు. ఎందుకో తెలియదు. అయితే చాల దూరంగా ఎక్కడో ఉన్న ఆంధ్రప్రదేశ్‌లోని ఒక గ్రామంలో స్వమతస్థులే కొట్టుకోగా ఒక్కరు చనిపోయారని ఎన్నో పనులున్నా మానుకొని వచ్చారు! ఈయన వెంట వందలాది మంది తరలివచ్చారు. ఈ మొత్తం తతంగానికి "కొన్ని లక్షలు" ఖర్చయి ఉండవచ్చునని ప్రజలు అనుకునే మాటల్లో కొంచమైనా వాస్తవ ముండవచ్చు.

రాష్ట్ర ముఖ్యమంత్రి నీరుకొండ గొడవను గురించి దర్యాప్తులు జరిపిస్తూనే ఉన్నారు. ప్రధానమంత్రి తగిన సూచనలు, సలహాలు ఇచ్చి ఉండవచ్చు. పోనీ ఏకంగా వచ్చినా తప్పేమీ లేదు కాని వెంట కేంద్రపరిశ్రమల శాఖామంత్రి శ్రీ వెంగళరావు, కేంద్ర ప్రణాళికల శాఖామంత్రి శ్రీ శివశంకర్ ఉండవలసిన అవసరం ఏమిటో తెలియదు. ఇళ్ళు ఎందుకు కాలిపోయాయని ప్రధాని బాధితురాలయిన మాబునీ అడినప్పుడు ఆమె ఒకటి చెబితే శ్రీ శివశంకర్ మరొకటి చెప్పారు. ప్రధానికి ఉన్నది ఉన్నట్లు, ఆమె చెప్పింది చెప్పినట్లు వివరించమని ముఖ్యమంత్రి అన్నారు. ఇందుకు కోపం వచ్చిన శ్రీ శివశంకర్ శ్రీ రామారావుని తూలనాడితే శ్రీ రామారావు కూడా సందర్భం ఎలాంటి దన్న విషయం సయితం మరచిపోయి ఘర్షణకు దిగడం ఎంతయినా విచారకరం. వారు పది నిమిషాలపాటు కొట్టుకోవడాన్ని వినోదంగా చూస్తున్న శ్రీ రాజీవ్‌గాంధీ ఆ తరువాత శ్రీ శివశంకర్‌ని కాదని మరొకరిని పిలిచి బాధితులు చెప్పే మాటల్ని ఇంగ్లీషులోకి తర్జుమా చేసి చెప్పమని ఆదేశించారు.

తమాషా ఏమిటంటే బాధితురాలయిన మాబుకి ఉర్దూవచ్చు. శ్రీ రాజీవ్‌గాంధీకి ఉర్దూవచ్చు. మరి ఇద్దరూ ఉర్దూలో మాట్లాడుకోవచ్చు కదా! మధ్యలో ఇంకొకరి ప్రమేయం ఎందుకు? బహుశా ఈ గొడవంతా చూచి కాబోలు తెలుగులో మాట్లాడుతూ ఉండిన మాబు ఆ తరువాత ఉర్దూలో ప్రశ్నలకు సమాధానాలు చెప్పడం ప్రారంభించారు.

ఇంతట్లో గొడవ పడ్డ శ్రీ రామారావుని, శ్రీ శివశంకర్‌ని శాంతింప జేసారు శ్రీ వెంగళరావు. "వక్రీకరించి అనువాదం చెయ్యడం తప్పుకదా" అని శ్రీ రామారావు అన్నప్పుడు "అసలు నేను అనువాదం చెయ్యలేదు. పార్లమెంట్ సభ్యుడు శ్రీ కావూరి సాంబశివరావు అలా అనువాదం చేసారు" అని శ్రీ శివశంకర్ అనడం మరింత ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది!

మొత్తం మీద ప్రధాని నీరుకొండ యాత్ర బాధితుల ఉపశమనం కోసంలా కనిపించడం లేదు. కాంగ్రెస్ (ఐ), తెలుగుదేశం పార్టీల రాజకీయాల ప్రచ్ఛన్న కలహవేదికలా గోచరిస్తుంది. మంత్రి వర్యుల ఈ విపరీత యాత్రలో విదూషకుల వింత ప్రదర్శన కూడా చోటు చేసుకోవడం అక్కడ గుమిగూడిన ప్రజలకు, ఆ వార్తలను సేకరించిన వారికి, వాటిని ప్రచురించిన పత్రికల వారికి, ఆ పత్రికలను చదివిన యావన్మంది భారతీయులకు, మరీ మాట్లాడితే మొత్తం ప్రపంచ ప్రజలందరికీ బహుచక్కటి వినోద కాలక్షేపం అని చెప్పక తప్పదు.

—నేస్తం

ప్రధాని సమక్షంలో నువ్వెంతంటే నువ్వెంతని ఘర్షణకు దిగిన శ్రీ రామారావు, శ్రీ శివశంకర్.






# చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి వైద్య సలహాలు

**కె. ముకుందారెడ్డి, సైదాపూర్**

ప్ర : నాకు నత్తి ఉన్నది.నత్తి ఉండుట వలన ఏదీ చెప్పలేక పోవుచున్నాను. నత్తి పోవుటకు ఏదైనా మందు ఉన్నదా?

జ : చిన్నతనము నుండి నత్తి ఉంటే మందులేదు. మధ్యలో గాని వస్తే వివరములు తెలుప గలరు.

**బి. విశ్వనాథరావు, హైదరాబాదు**

ప్ర : సెర్వికల్ స్పాండిలాసిస్‌కు ఔషధాన్ని సూచించండి. సి 4, సి5, సి6 పెరుగుదల వలన వచ్చిన నొప్పి.

జ : మీరు మీ యొక్క వ్యాధి వివరములు పూర్తిగా తెలుప గలరు. వివరములు తెల్సిన తరువాత మీకు వైద్య సలహా తెలుపగలము.

**సి. శంకర్‌రెడ్డి, పలమనేరు**

ప్ర : నా వయస్సు 24 సం. లు. ఎడమప్రక్కన మీసము పై ముందున్న వెంట్రుకలు రాలేదు. ఏమనగా పేను కొరికినది అన్నారు. దీనికి సరియైన మందు తెలుపగలరు.

జ : మీరు వెంట్రుకలు పేను కొరికిన చోట మందారపువ్వులు నలిపి రాయవలయును.

**డి. ఈశ్వరరావు, గుంటకల్లు**

ప్ర : కొద్దికాలంగా హెర్నియా ఉంది. దానిని ఆపరేషన్ లేకుండా నయము చేయుటకు సలహా ఇచ్చేది.

జ : చింతలూరి ఆయుర్వేద ఫార్మసీ వారి నిత్యానందరసం మాత్రలు 20 గ్రా. ఉదయం ఒక మాత్ర సాయంత్రం ఒక మాత్ర వేసుకోవాలి. శ్లీపద గజకేసరి రాత్రి పరుండబోవునపుడు వేడి నీటితో ఒక మాత్ర సేవించ వలయును. దుంపకూరలు తినకూడదు. రెండు పూటలా వేడి అన్నం తినవలెను. అయిదు, ఆరు మాసములు వాడవలసి యుండును.

**నక్కా నరసింహమూర్తి, కాకినాడ**

ప్ర : నా వయస్సు 50 సం. లు. చిన్నతనం నుండి హస్తప్రయోగం అలవాటు. అంగము చిన్నదైనది. నరముల బలహీనత, నిస్సత్తువ, అంగము పొడవుగా అయి పుష్టిగ ఉండుటకు మందు తెలుప గోరాను.

జ : చింతలూరి ఆయుర్వేద ఫార్మసీ వారి సిద్ధమకరధ్వజం మాత్రలు ఉదయం ఒకటి సాయంత్రం ఒకటి భోజనమునకు ముందుగా 40 రోజులు ఉపయోగించి తరువాత మా అడ్రస్సుకు లెటరు రాయవలెను.

**ఎన్. దుర్గారావు, వైజాగ్**

ప్ర : నాకు సం. ము నుండి పిక్కలు (గ్లాండ్సు) ఉన్నవి. ఇంగ్లీషు మందులు వాడినా అవి తగ్గలేదు. అవి అప్పుడప్పుడు నెప్పి పుట్టుచున్నవి.

జ : పిక్కల నొప్పులకు పూర్ణచంద్రోదయం మాత్రలు చింతలూరు ఆయుర్వేద ఫార్మసీ వారి ఔషధం తీసుకొన వలయును. ఉదయం ఒక మాత్ర, సాయంత్రం ఒక మాత్ర పాలతో సేవించ వలయును. అశ్వగంధాది లేహ్యం భోజనానంతరం పెద్ద ఉసిరి కాయంత తినవలయును. □

సీరియల్

# మంత్రనగరం

## రావినూతల సువర్ణాకన్నన్

(గత సంచిక తరువాయి)

నెమళ్ల గుంపులో కొన్ని నెమళ్ళు పురివిప్పి నాట్యం చేస్తుంటే తన్మయత్వంగా చూస్తోంది కాంతి.

రెండు లేళ్ల జంటల సరాగాలు, అలకలు వింతగా చూస్తున్నాడు ... అరవింద్.

"నిజంగా ... ఆంగ్ల కవి అన్నట్టు ... ప్రకృతి నుంచి, మూగజీవాల నుంచీ కూడా మనం ఎన్నో పాఠాలు నేర్చుకోవచ్చు!" అనుకున్నాడు.

"అరవింద్!" మెల్లగా పిల్చింది కాంతి.

"ఊఁ!" తన్మయావస్థలోంచి తృళ్ళిపడి చూశాడు అరవింద్.

"అరవింద్! నెమళ్ళు సాయంకాలాలు, మబ్బులు పట్టినప్పుడు మాత్రమే ఉల్లాసంగా ఆడతాయని విన్నాను ... కానీ .... ఇక్కడేమిటి ... ఇంత పొద్దున్నే డాన్స్ ప్రోగ్రాం పెట్టాయి?" వాటినే పరిశీలనగా చూస్తూ అంది.

అరవింద్ నవ్వాడు.

"ఈ చెట్ల మధ్య సాయంకాలంలాగే వుందిగా అందుకే .. ఆడుతున్నాయేమో!... అదీగాక ... క్రూరజంతువులు లేని సమయమల్లా వాటికి ఉల్లాస సమయమేమో!"

"నిజమే!"

"కాంతీ!" మెల్లగా పిల్చాడు అరవింద్.

"ఏమిటి?" అన్నట్టు అతనికేసి చూసింది కాంతి.

"నీకు రాత్రి నిద్ర పట్టలేదు కదూ?"

"ఊఁహుఁ!"

"ఏం?"

"భయమేసింది".

"నాకూ నిద్ర రాలేదు!"

"ఏం? నీకూ భయమేసిందా?" నవ్వింది కాంతి.

"భయంకాదు కానీ ... ఎంధుకో నిద్ర రాలేదు ..."

"అబద్ధం! నువ్వూ భట్టూ హాయిగా పడుకున్నారు". అంది కాంతి.

"నిజమే! కొంచెంసేపు పడుకున్నాం!"

"మరి? నిద్ర పట్టలేదా?"

"ఊఁహూఁ! నిద్ర కూడా పట్టింది ... కానీ ..." నసిగాడు అరవింద్.

"ఊఁ! కానీ ...?"

"మెలకువ వచ్చాక మళ్లీ నిద్రపట్టలేదు!"

"ఏం?"

"నీ మెత్తని చెయ్యి నామీద పడగానే ..."

"ఓ! అయామ్ సారీ!" తల వాల్చి గభాల్న అనేసింది కాంతి. ఆమె చెంపలు కందిపోయాయి.

"సారీ? ... ఎందుకు?"

"ఏమిటో అరవింద్! ... మొన్న లేని పిరికితనం నిన్న పూర్తిగా ఆవహించేసింది ... దానికితోడు జంతువుల అరుపులు ... అందుకే ..." గొణిగినట్టు అంది కాంతి.

"కానీ ... అదే నాకెంతో హాయినిచ్చింది తెలుసా?" గుసగుసగా అన్నాడు అరవింద్.

కాంతి కళ్ళు మరి వాలిపోయాయి.

"అందుకే... ధైర్యం చేసి నీ మీఁద చెయ్యి వేశాను. కానీ ... ఆ స్పర్శ నాలో ఎలాంటి కోరికల్నీ రేపలేదు కాంతీ! ఏదో తన్మయత్వం, హాయి, పులకింత కలిగింది".

"బావుంది!" సిగ్గుగా నవ్వింది కాంతి.

"నిజంగా అలా నా పక్కన శయనించి ... నా కౌగిట్లో ఒదిగిపోయే రోజు ఎప్పుడు రాబోతోందో, నీ ఎదలో మోము దాచుకొని ..." నాటకీయంగా అంటున్న అరవింద్ నోరు మూసేసింది కాంతి.

"స్టాప్! ... కవిత్వం ఆపండి సర్! ..."భట్టు ఒస్తున్నాడు అంది హాయిగా నవ్వేస్తూ.

అరవింధ్ కూడా నవ్వేశాడు.

జరిగిన కథ –5 : భానుగుహ దగ్గరి అడవిలో నిధికోసం తవ్వకాలు జరపడానికి అరవింద్ బృందం సిద్ధమవుతుంది. చివరి నిమిషంలో జయదేవ్ ప్రయాణం ఆగిపోయి, అరవింద్, కాంతి, భట్టు అడవికి చేరుతారు. అరవింద్ మొదట గుర్తుపెట్టిన స్థలం చేరుకుని తవ్వడం మొదలు పెడతారు. ఒకపెట్టె లాంటిది బైట పడబోతుండగా సింహాల గుంపు వస్తుంది. పని ఆపు చేసి మంచె ఎక్కి ఆ రోజు గడుపుతారు. మర్నాడు ఉదయం తగు జాగ్రత్తలతో భట్టు ఏటికి వెళ్తాడు.

భట్టు రాగానే లంచ్‌కి ఏవో ఏర్పాట్లు చేసుకుని జాగ్రత్తగా అన్నీ సర్దేసుకుని ... డిటెక్టర్ వగైరాలు తీసుకుని మళ్ళీ ముగ్గురూ తవ్వకపు స్థలంకేసి నడిచారు,

తవ్విన గొయ్యి తవ్వినట్టే వుంది!... ఎక్కడ పడేసిన వస్తువులు అక్కడే పడున్నాయి.

"ఎందుకైనా మంచిది ... ఏవైనా క్రూర మృగాలు నిన్నటిలా ... హఠాత్తుగా వస్తాయేమో ఓ వైపు చూస్తూండండి!" అన్నాడు అరవింద్.

"అవును! ... నిన్న మనల్ని చూశాక అవి అంత తేలిగ్గా ఈ చోటు విడచి పోవు!" అన్నాడు భట్టు.

కాంతి కళ్ళు మళ్ళీ భయంతో రెపరెపలాడాయి.

"భయం లేదు కాంతీ! ... కాస్త అనుమానం రాగానే ... దగ్గర్లో వున్న ఏ చెట్టయినా సరే ఎక్కెయ్యండి! ప్రాణరక్షణ కోసం!... అయినా అంత అవసరం వస్తుందనుకోను!" అంటూ ధైర్యం చెప్పాడు అరవింద్.

ముగ్గురూ కలిసి మళ్ళీ త్రవ్వకం ప్రారంభించారు.

పది అడుగుల పొడవు, అయిదు అడుగుల వెడల్పు మూడడుగుల లోతు తవ్వితేగానీ ఆ పెట్టె సరైన ఆకారం కనిపించలేదు వారికి.

పెట్టె పూర్తిగా కనిపించగానే ముగ్గురూ పసిపిల్లల్లా అరుస్తూ గంతులు వేశారు.

ఆ పెట్టెపై చెక్కబడిన బంగారు నగిషీలు మరింత ఆకర్షించాయి వార్ని.

"దీన్ని గట్టుమీద పెట్టగలమా?" అంది కాంతి.

"చూద్దాం!" అన్నాడు భట్టు ఉత్సాహంగా.

ముగ్గురూ కలిసి పెట్టెని ఎత్తాలని ప్రయత్నించారు. అయితే అది కదల్నయినా కదల్లేదు.

దాదాపు ఎనిమిది అడుగుల పొడవు ... మూడు అడుగుల వెడల్పుగల ఆ పెట్టె బంగారు లతలతో అందంగా చెక్కబడి ఓ పెద్ద వీణపెట్టె మాదిరిగా ఉంది. రెండు వైపులా రెండు పెద్ద పెద్ద తాళాలు వేసున్నాయి. అవి కూడా దాదాపు శిథిలావస్థలో వున్నాయి. ఏ మెటల్‌తో తెలియడంలేదు గానీ అందంగా బలంగా ఉంది. చెక్క మాత్రం కాదు.

"ఇక్కణ్ణుంచే తాళాలు ఊడగొడదాం!" అన్నాడు భట్టు దాన్ని పైకి తియ్యడం అన్న ప్రయత్నాన్ని విరమించుకున్నట్టు.

"అలాగే" అన్నాడు అరవింద్.

"పెట్టె మాత్రం చాలా అందంగా ఉంది!" అంది కాంతి నవ్వుతూ.

"నగలూ అందంగానే ఉంటాయి!" నవ్వాడు భట్టు కూడా.

భట్టూ, అరవింద్ కలిసి అతి ప్రయాసతో ఆ తాళాల్ని ఊడగొట్టారు.

అందరికీ ఎంతో కుతూహలంగా ఉంది. ఒక విధమయిన ఉద్వేగం ఆవహించేసింది వార్ని.

"కాంతీ! ... పెట్టె నువ్వు ఓపన్ చెయ్యి!... నేనా చెట్టు దగ్గర నిల్చుని ఫోటో తీస్తాను ... మూత తీసి కొన్ని నగలు చేత్తో పట్టుకో!... అది కూడా ఫోటో తీసి ...



# మంజీరనాదం

పత్రికలకి పంపితే ... నీ పేరు ... దేశదేశాలు మార్మ్రోగిపోతుంది!" అన్నాడు అరవింద్ కెమెరా సర్దుకుంటూ,

"అమ్మ బాబోయ్!... నేనా? ... నేను చస్తే తెరవను!... నువ్వే తెరు!... కావాలంటే ఆ ఫోటో లు నేను తీస్తాను!" భయంగా అంది కాంతి.

"అయితే నీకు నగలు అక్కరలేదా?"

"కావాలి!"

"అయితే తొందరగా తెరు!... నీక్కావల్సిన నగలు తీసుకుందువుగాని! ఉత్సాహంగా అన్నాడు అరవింద్.

"అసలిందులో నగలే ఉంటాయన్న నమ్మకం ఏమిటి? ... ఏ మంత్రకప్పలో, పాములో, అదీగాక మనం కాశీమజిలీ కథల్లో చదువుకున్నట్టు... ఏ పిశాచాలో వుంటే? ... హమ్మ బాబోయ్! నాకా నగలూ వద్దు పాడూ వద్దు!... నేను మాత్రం పెట్టె తెరవను!" అంది కాంతి.

ఆమె మాటలకు మగాళ్ళిద్దరూ నవ్వారు.

"ఇక్కడ భానూర్ భార్యలు భద్రపరిచింది నిధుల్నే గానీ భూత పిశాచాల్ని కాదు! నా మాట విని ... తొందరగా పెట్టె తెరు!" అన్నాడు అరవింద్.

"అవునమ్మాయిగారూ! ... మీకేం భయం లేదు ... నేను చెప్తున్నానుగా ... తొందరగా పెట్టె తెరవండి!" ఆత్రుతగా అన్నాడు భట్టు.

తప్పనిసరిగా కాంతి పెట్టె దగ్గరగా వచ్చింది. ఎందుకో ఆమె చేతులు వణుకుతున్నాయి.

"ఊఁ! తెరు!" అన్నాడు అరవింద్ గట్టు మించే.

కాంతి పెట్టె మూత తియ్యడానికి ప్రయత్నించింది. అయితే ఎన్నాళ్ళ నుంచో మూసి వుండడాన కావచ్చు. మూత ఓ పట్టాన రావడం లేదు.

మొత్తానికి అతి బలవంతం మీద తెరిచింది భట్టు సాయంతో.

ఒక్కసారి దుమ్ముతో పరిసరాలన్నీ నిండిపోయాయి!... ఆ ధూళిలో ఒక విధమైన ఘాటు కూడా వుంది.

గభాల్న ఇవతలికొచ్చి నిల్చున్నారు అందరూ.

పది నిమిషాల తర్వాత ధూళి కాస్త తగ్గింది. ముగ్గురూ పెట్టె దగ్గరికొచ్చి తొంగి చూశారు.

పెట్టెలో ఓ వెల్వెట్ గుడ్డ నిధి మీద కప్పబడి ఉంది.

అందరికీ చెప్పలేని ఉత్సాహం ముంచుకొచ్చింది.

"అరవింద్! ... నువ్వు రెడీగా వుండు! నేను నిధి మీది గుడ్డ తీస్తాను!" అంది కాంతి గోతిలో దిగుతూ. ఆమెకిప్పుడు ఏమాత్రం భయంగా లేదు.

అరవింద్ కెమెరా సిద్ధం చేసుకున్నాడు.

"అరవింద్! ... భట్టూ! నేను క్లాత్ తీయగానే చప్పట్లు కొట్టండి!"




గంభీరంగా అనేసి ఓ రాజకీయ నాయకుడిలా ... పోజు పెట్టి మెల్లగా వెల్వెట్ క్లాత్ తొలగించింది!

అంతే!

ఆమె నోట భయంకరమైన కేక వెలువడి అరణ్యమంతా దద్దరిల్లి పోయింది.

చిరు జంతువులా అరుపుకి చెల్లాచెదరైపోయాయి. నిలువెల్లా వణికి పోతున్న కాంతి ఒళ్ళంతా చెమటలు కారిపోతున్నాయి.

దాదాపు భట్టు కూడా అదే స్థితిలో ఉన్నాడు.

అరవింద్ కూడా తేరుకుని గభాల్న వచ్చి పెట్టెలోకి తొంగి చూశాడు.

అంతే! అతను కూడా నిశ్చేష్టుడై పోయాడు! ఆ పెట్టెలో ఆరడుగులు మించిన ఓ అందమయిన యువకుడి శవం భద్రపరిచి ఉంది!

★ ★ ★ ★ ★

కాస్సేపటికి అంతా తేరుకుని మామూలు స్థితికొచ్చారు. మెల్లగా శవం దగ్గరగా వెళ్ళి పరిశీలనగా చూశారు.

ఆ యువకుడికి దాదాపు ఇరవై ఏళ్ళుండచ్చు. ముఖం మీది నవ్వు చెదరలేదు. నిద్రపోతున్నట్టున్నాడు.

పట్టు పరుపుల మీద పైన కప్పినటువంటిదే మరో వెల్వెట్ దుప్పటి పరచి దానిమీద పడుకోబెట్టారతన్ని. తల వైపు రెండు పెద్ద పెద్ద వెండి గిన్నెలున్నాయి. అవి ఖాళీగానే ఉన్నాయి. అవిగాక కొన్ని అమూల్యాభరణాలు కూడా ఉన్నాయి. గుండెల మీద పరుచుకున్న స్వర్ణ మంజీరాలు మిలమిల మెరుస్తున్నాయి. దాదాపు ఆరున్నర అడుగుల పొడవున్న అతను బలంగా, జీవకళ తొణికిసలాడుతూ వున్నాడు.

"అసలు బతికున్నట్టే వున్నాడు! ... స్వయంగా మనం తవ్వి చూడకపోతే ... ఇది శవం అని చచ్చినా నమ్మే వాళ్ళం కాదు!" అన్నాడు భట్టు.

"అరవింద్! ... ఈ శవం ఎవరిదై వుంటుంది?" అంది కాంతి శవాన్నే దీక్షగా చూస్తూ.

అరవింద్ ఏమీ మాట్లాడలేదు. అలాగే మౌనంగా చూస్తూండి పోయాడు.

"సర్! ... ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు భట్టు.

"అదే ఆలోచిస్తున్నాను!" అన్నాడు అరవింద్.

"ఇంతకీ ఈ శవం ఎవరిదై వుంటుందో?" మళ్ళీ అంది కాంతి.

"బహుశా ... ఆ భానూర్ ... అన్న అతనిదేమో!" అన్నాడు భట్టు.

"ఛ! ఛ! – కాదు!" గభాల్న అంది కాంతి.

"ఏం?"

"అంతకాలం క్రితం శవం కానే కాదు!... చూడు! ఇవాళే పోయినట్టుంది. నిజానికి అంత పాత శవం అలా వుండనే ఉండదు" అంది.

"లేదు!.. ఇది చాలా పురాతన శవం!" హటాత్తుగా అన్నాడు అరవింద్.

"అయితే ... చెడిపోదా? ..."

"ఊఁహూఁ! చెడిపోకుండా ఏవో అపూర్వ ఔషధాలు వాడుండాలి! ... మనం తవ్విన చోటు ఎంత గట్టిగా ఉంది!... ఎన్నో వేల సంవత్సరాల క్రితం నుంచి ... చలనం లేనట్టు చట్టు వేసుకు పోయింది. ఇది ఎంత పురాతనమైందో పరిశోధించి మాత్రమే తెలుసుకోగలం!" అన్నాడు అరవింద్.

"నిజమే వస్త్రధారణ అదీ కూడా పాతగా ఉంది! ఆకారం మాత్రం?... ఓహ్! ... హీరోలంతా బలాదూర్!" అన్నాడు భట్టు అతన్ని వర్ణిస్తూ.

"అరవింద్!" భయంగా పిల్చింది కాంతి.

"ఏమిటి!" అన్నట్టు చూశాడు అరవింద్.

"దీన్ని ఎలా వున్నది అలా పూడ్చేద్దాం!"

"ఎందుకు?"

"నాకేదో భయంగా ఉంది. ఇది నిజంగా అంత పాత శవమే అయుంటే ... ఏదో అపూర్వ శక్తి దీనికి వుండాలి! ఇప్పుడు మనం తీసే ..."

"నో! ... ఇంత మంచి అవకాశాన్ని జారవిడుచుకుంటామా కాంతీ! ... ఈ పెట్టె చాలా పురాతనమయిందని తెలుస్తూనే ఉంది!... అందుకే. దీని చరిత్ర పూర్తిగా కనుక్కు తీరాలి!" అన్నాడు అరవింద్ పెట్టెలోంచి వెండి గిన్నె అందుకుంటూ.

ఆ గిన్నె చాలా బరువుగా వుంది. దానిమీద ఎన్నో చిత్రాలు చెక్కి వున్నాయి!

"నిజంగా ఆనాటి పనితనం ముందు ఈనాడు మనం చేసే ... పనిముట్లు ఏపాటి?" అన్నాడు. భట్టు కూడా ఆ గిన్నెని పరిశీలిస్తూ.

కాంతి మొహం మాత్రం అప్రసన్నంగా అయిపోయింది. అది గమనించీ గమనించనట్టు ఊరుకున్నాడు అరవింద్.

గిన్నె యథాస్థానంలో ఉంచి–

"భట్టూ! ఈ శవాన్ని కింద పడుకోబెడదాం! పైన కప్పిన వెల్వెట్ దుప్పటి ... ఆ చెట్టు కింద వెయ్యి!" అన్నాడు.

"వీల్లేదు!" అరిచింది కాంతి.

"ఏమిటి కాంతీ!"

"ఈ శవాన్ని తియ్యడానికి వీల్లేదు!"

"అయితే మనం ఇక్కడికొచ్చిందెందుకు?" కాస్త చిరాగ్గా అన్నాడు అరవింద్.

"శవాల కోసం మాత్రం కాదు!" తీక్షణంగా అంది కాంతి.

"కాంతీ! నేను భూమిలో ఏముందో పరిశోధించే సంస్థలో పనిచేస్తున్నాను. పురాతన వస్తువుల గురించి రిసెర్చి చేస్తున్నాను ... అలాంటిది ... ఇంత మంచి అవకాశం వస్తే వదులుకోమంటావేమిటి? ... నీకు భయంగా వుంటే వెళ్ళి మంచెమీద కూర్చో!... నేను కొన్ని వివరాలు చూసి వస్తాను". కాస్త చిరాగ్గానూ, కాస్త అనునయంగానూ అన్నాడు అరవింద్.

"అయితే ఈ శవాన్ని మన ఊరు మోసుకు పోదామా?" అంది కాంతి సూటిగా చూస్తూ.

అరవింద్ నవ్వాడు.

"వద్దు! ఊరికే చూసి ఒకటి రెండు ఫోటోలు తీసుకుని, యథాప్రకారంగా పెట్టేసి వెళ్దాం! ... తరవాత మా అధికారుల సాయంతో మళ్ళీ వస్తాం!" అన్నాడు.

"అలా అయితే ... శవాన్ని పెట్టెలోంచి తియ్యకుండానే ఫోటోలు తియ్యి!..."

"అలా కుదరదు!... జాగ్రత్తగా చూస్తే తప్ప దాని చరిత్ర కొంత వరకు తెలియదు" అన్నాడు అరవింద్.

కాంతికి ఇష్టం లేకపోయినా అడుగడుక్కీ అతనికడ్డం పడ్డం అంత బావుండదేమో అన్నట్టు మౌనంగా ఊరుకుండి పోయింది.

భట్టు, అరవింద్ కలిసి గట్టు మీద దుప్పటి పరిచారు. మళ్ళీ గోతిలోనికి దిగారు.

స్వర్ణ మంజీరాలు, ఆ గిన్నెలు, అతని చుట్టూ పడున్న బంగారు నాణాలు, ఆభరణాలు తీసి కాంతి చేతికిచ్చారు.

శవం చేతులు రెండూ పొట్టమీద పెట్టి వున్నాయి. తల కింద మరో వెల్వెట్ దిండు వుంది.

మెల్లగా శవం చేతిని ముట్టుకున్నాడు అరవింద్. ఎందుకో అతని ఒళ్ళు జలదరించింది.

ఆ చెయ్యి బిగుసుకు పోలేదు. ఒక విధమైన రబ్బరులా మెత్తగా ఉంది.

అతను వేసుకున్న వెల్వెట్ కోటు బంగారు గుండీలు మిలమిల మెరుస్తున్నాయి.

"ఆ రోజుల్లో వెల్వెట్ ఎక్కువ ఉపయోగించేవారు కాబోలు!" అన్నాడు భట్టు.

"అలాగే ఉంది!" అన్నాడు అరవింద్.

"ఈ గిన్నెల్లో ఏం వుండి వుండేదో?" మళ్ళీ భట్టే అన్నాడు.

"బహుశా ... ఏ పసరో ఉండేదేమో! అదీగాక వాళ్ళ దేశాచారమో!" ఏదో ఆలోచిస్తూ అన్నాడు అరవింద్.

ఇదేం తనకి పట్టనట్టు మౌనంగా ఉండిపోయింది కాంతి.

ఇద్దరూ కలిసి అతి జాగ్రత్తగా ఆ శవాన్ని గట్టుకు చేర్చారు.

అందమైన ఆ విగ్రహాన్ని చూస్తుంటే అప్రయత్నంగా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి కాంతికి.

"అసలితను ఎవరో!... ఏ రాకుమారుడిలానో ఉన్నాడు!" అంది అతన్నే చూస్తూ.

భట్టు దిండు తియ్యబోయాడు. అయితే అది చాలా బరువుగా వుండి... అదో రకంగా చప్పుడైంది.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ, యితర
రచనలు పంపదలచుకున్నవారు
సంపాదకుడు,
ఆంధ్రసచిత్ర వారపత్రిక,
గాంధీనగరం, విజయవాడ-520 003.
అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షికపేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి — హామీపత్రం జతచెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు — వారి స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్ళలంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనేగాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటి పై నిర్ణయంకోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు. కాని— తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు — రచన పేరు — అది పంపినతేదీ, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్ళలంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్‌లు పంపేవారుకూడా ఎనిమిది వారాలలోగా మా మీద ఉత్తరాలదాడి చెయ్యకూడదు ... ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్‌ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలువెంబడి జరుగుతుంది.

★ రచయితలకు, కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ "ప్రతు"లను — కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు.

సం॥

## గడుసులోకం — బాబు







# మంజీరనాదం

"సర్! ఇది మామూలు దిండులా లేదు!" అన్నాడు గట్టిగా.

ఒక్క అంగలో అక్కడికొచ్చి భట్టు చేతులోని దిండు లాక్కున్నాడు అరవింద్.

అతనిక్కూడా అది మామూలు దిండులా అనిపించలేదు. మెల్లగా తడిమి చూశాడు.

అది ఒక సంచి!

లో పలేదో పెట్టి దిండులాకుట్టి... అతని తలకింద పెట్టారు. అరవింద్‌లో ఆతృత హెచ్చింది. మెల్లగా ఆ సంచీ విప్పాడు.

అందులో ఓ అందమైన దంతపు పెట్టి వుంది.

"ఈ పెట్టిలో ఏముందో?..." భయంగా అంది కాంతి.

"నీక్కావల్సిన నగలు!" నవ్వాడు అరవింద్.

"ఛీ!... ఈ శవం కింద నగలా?"

"ఏం?... శవం కిందుంటే బంగారం క్వాలిటీ తగ్గిపోతుందా?"

"సరేలే!... ముందు పెట్టి తెరు!" అంది కాంతి కుతూహలంగా చూస్తూ. భట్టు కూడా ఆతృతగా చూస్తున్నాడు.

మెల్లగా పెట్టి తెరిచాడు అరవింద్.

అందులో ఏవో పత్రాలు! పుస్తకంలా అమర్చిన.... పత్రాలు.

అరవింద్ కళ్లు క్షణం ముడివడ్డాయి.

ఓసారి పెట్టిని పరిశీలనగా చూశాడు.

"ఇందులో ఏదో ముఖ్య విషయం వుండచ్చు!" అంది అతని మనసు. అక్కడే కూలబడి మెల్లగా పుస్తకం బైటికి తీశాడు.

ఆ పుస్తకం చాలా పెద్దదిగా ఉంది.

ఏదో ఆలోచిస్తూ సున్నితంగా పుస్తకం మొదటి పేజీ తిప్పాడు.

అది పాలి భాషలో రచింపబడి వుంది.

"ఏమిటరవింద్?" ఆతృతగా అడిగింది కాంతి.

"ఏదో చరిత్ర!" అన్నాడు భట్టు.

"ఉఁహు!" పరధ్యానంగా అన్నాడు అరవింద్.

"మరి? మరేమిటి?" అంది కాంతి.

"ప్రేమకి మరణం లేదు " ఏటో చూస్తూ అన్నాడు అరవింద్.

"ఏమిటి?" తుళ్లిపడ్డారిద్దరూ.

"సారీ! ఈ పుస్తకంపేరు... ప్రేమకి మరణంలేదు. పాలిభాషలో రాశారు." అన్నాడు అరవింద్.

"ఎవర్రాశారు?" కుతూహలంగా అడిగింది కాంతి.

"చూడాలి!"

"అయితే ఏం చేద్దాం సర్?" అన్నాడు భట్టు.

"చెప్తాను! నా ఉద్దేశం ప్రకారం ఈ శవం ఏనాటిదో, ఇలా పాతి పెట్టడానికి కారణం ఏమిటో ... ఇన్నాళ్లు శవం పాడవకుండా ఎలా వుందో ... అన్నీ ఇందులో ఉండచ్చు!! అందుకే... ప్రస్తుతం మనం ఈ శవాన్ని. పెట్టిలో పెట్టేద్దాం! ఇది చదివి ఆ తరువాత మిగతా సంగతి ఆలోచిద్దాం!" అన్నాడు అరవింద్.

"అలాగే..." అన్నాడు భట్టు.

అరవింద్ చేతిలోని పుస్తకాన్ని పెట్టిలో జాగ్రత్తగా పెట్టేసి ఆ పెట్టి కాంతి చేతికిచ్చాడు.

ఆ తరవాత భట్టు,అతను కలిసి ఆ శవాన్ని జాగ్రత్తగా పేటికలో ఉంచేశారు. నగలు అవీ కూడా ఎప్పటిలా పర్దేశారు.

"ఎప్పటిలా పూడ్చేద్దామా?" అంది కాంతి.

"ఆ పని మెల్లగా చేద్దాం ప్రస్తుతం పెట్టి మూతవేసి వెళ్దాం!" అన్నాడు అరవింద్.

భట్టు మూత వేశాడు.

"ఏ నక్కలైనా తీసేస్తాయేమో!" అంది కాంతి.

"ఈ పెట్టా?... ఏనుగులవల్ల కూడా కాదు దీన్ని తెరవడం!" మెచ్చుకోలుగా అన్నాడు అరవింద్.

ముగ్గురూ ఓ సారి దానికేసి చూసి పలుగు పారలు ఓ చోట సర్ది... తమ పరంజామాతో మంచెకేసి బయల్దేరారు.

అప్పుడందరికీ ఆకలిగుర్తొచ్చింది.

ముగ్గురూ ఏటి దగ్గరి కెళ్లి కాళ్లూ చేతులూ కడుక్కొచ్చి మంచె ఎక్కారు.

ఎలాగో లంచ్ అయిందనిపించారు.

అప్పుడే బ్రెడ్, బిస్కెట్స్ మొహం మొత్తేసింది వాళ్లకి.

ఒళ్లంతా హూనంగా అయిపోయింది. అలసటతో కళ్లు వాలిపోతున్నాయి.

మెల్లగా పక్కలు సర్దుకొని నడుములు వాల్చారు. విపరీతమైన ఎండకాస్తున్నా దట్టమైన చెట్లవల్ల వారిమీద ఎండ మాత్రం పడ్డం లేదు.

భట్టు... అటుకేసి తిరిగి కళ్లు మూసుకున్నాడు.

(ఇంకా ఉంది)

# కొడి

## వి.వి.బి

మబ్బులు చిక్కబడి నల్లగా పగలే చీకటయిపోయింది. ఏదో అసంతృప్తి. ఏదో ఆరాటం. ఎందుకో దిగులు. చిరాకు. నెత్తిన పొగలా ఆవరించుకు వస్తోంది.

"పెదనాన్నా! నే వెళుతున్నా!"

శాస్త్రి జవాబు చెప్పలేదు. ఒక్క క్షణం అక్కడే నుంచుని ఏమనుకున్నాడో ఏమో భాస్కరం "దొడ్డమ్మా, నాకు టైమయిపోయింది, నే వెళుతున్నా!" అని లోపలకి కేకేసి స్కెత్ మడిచి ఓవర్ ఆల్ జేబులో ఉంచుకుని బయలుదేరిపోయాడు.

-"ఏమిటీ అలా ఉన్నారు... కాస్త కాఫీ తెచ్చి ఇవ్వనా?" రాజ్యం భర్తని చూసి అడిగింది.

శాస్త్రి పడక కుర్చీలో జేరబడి గుండెలమీద దినపత్రిక పడేసుకుని శూన్యంలోకి చూస్తున్నాడు.

"ఏమైందండీ... కాఫీ కావాలా అని అడిగాను... భాస్కరం వెళుతూ చెబితే వినిపించుకోలేదే?"

"బ్రతుక్కి అర్థం ఏమిటా అని ఆలోచిస్తున్నాను."

"భలేవాళ్ళే! అంత సులువుగా అర్థమయితే అది బ్రతుకెందుకవుతుందీ - ఇంతకీ మీ మనసు ఒకరోజు సరిగా ఉంటే నాలుగు రోజులు సరిగా ఉండదు - అదంతే! ఆలోచనకందని విషయాల్ని అలా వదిలెయ్యడమే!"

"మనవాళ్ళు..." ఏదో చెబుదామనుకున్నా మరి శాస్త్రికి మాట ముందుకు సాగలేదు.

నెత్తిన బాధ్యతలు వేసుకోడం - తీరా వేసుకున్న తరువాత ఎందుకు వేసుకున్నానా అని వాపోవడం సుమారు అలవాటుఅయిపోయింది.

మంచి చేస్తూ మంచే ఎందుకు చెయ్యాలి అనే ఆలోచన వచ్చి అతని మనసుని కలవరపెడుతుంది.

కాఫీ గ్లాసుతో వచ్చింది రాజ్యం. అతను కాఫీ తాగడం అయ్యాక 'ఇక స్నానానికి లేస్తారా?" అంది.

"మనవాళ్ళకి మనం చెయ్యాలనుకున్నా చెయ్యలేకపోయాం. క్షణికమైన ఉద్రేకంతో నెత్తిన బరువులు వేసుకున్నాం. బాధ్యతలూ, బరువులూ లేకుండా సుఖ జీవితం గడపాలని ఎవరయినా అనుకుంటారు. కాని మనమూ ఉన్నాం చూడు. లేనిపోని ఊరుతంటాలు నెత్తిన వేసుకుని వాపోస్తూ ఉంటాం."

"అంటే మళ్ళీ భాస్కరం గురించేనన్నమాట ఆలోచనంతా... మనవాళ్ళకి చదువులు ఎలానూ అబ్బలేదు. వాడొక్కడే మన ఇంటిలో ఉన్నా ఒబ్బిడిగా చదువుకుంటున్నాడు. వాడికోసం నేనేమీ ప్రత్యేకంగా అలసిపోవడంలేదు. నలుగురిమధ్య వాడికో పిడికెడు మెతుకులు..."

"ఇవన్నీ ఎప్పుడూ ఉన్నవే. మరి నాకు చెప్పకు!"

"ఏం, ఎందుకు చెప్పకూడదు? మీకు చిరాకు పుట్టినప్పుడల్లా వాడిమీద చిందులేస్తారెందుకు? ఎలానూ నాలుగేళ్ళయిపోయాయి. ఇంకొక్క సంవత్సరం మీరు చిచ్చుపెట్టకుండాఉంటే మన వాళ్ళలో ఒకడు డాక్టరవుతాడు."

"అవుతాడు. అవుతాడు. అయి నీ నెత్తిన కిరీటం పెడతాడు. వాళ్ళమ్మ, నాన్నా, ఇద్దరూ ఉద్యోగాలు చేసుకుంటూ, కానీ పరకా వెనకేసుకుంటున్నారు. బిడ్డని కానీ ఖర్చు లేకుండా మన ఇంట్లో వదిలేసి రేపు వాడు పెద్దయ్యాక అదంతా వాళ్ళ ప్రయోజకత్వం అనుకుంటారు. రేపు మనం వాళ్ళ కంటికి ఆనం..."

"వాళ్ళ కంటికి మనం ఆనకపోతేనేం. అందరినీ చూచే దొడ్డ కన్ను ఒకటి ఉండనే ఉంది. ఆ సూర్యనారాయణమూర్తి గంపంత కన్నుతో అందరినీ చూస్తూనే ఉన్నాడు... ఆరంభించరు నీచమానవులు..."

"అవు! ఆ పద్యం నాకు కంఠతా వచ్చేసింది." దిగ్గునలేచి అక్కడనుంచి వెళ్ళిపోయాడు శాస్త్రి.

-"లే నాయనా, పొద్దున్న తిన్న మెతుకులు... ఎక్కడా ఏమీ తినవు..." భాస్కరాన్ని పిలవడం శాస్త్రి చెవిన పడింది.

"ఆఁ! ఇంటికి వచ్చేసరికి అమర్చిపెట్టడానికి ఉన్నావుగా... కానీ ఖర్చు లేదు. ఈ డబ్బు ఎక్కడ నుంచి వస్తోందన్న ఆలోచనా లేదు..."

శాస్త్రి మొదలెట్టాడు.

"దొడ్డమ్మా, నే వెళుతున్నా!"

రాజ్యం కిక్కురుమనలేదు. రెండు రోజులు భార్యాభర్తలూ మాటాడుకోనూ లేదు.

-"వీడు రాలేదా?"

"వాడెవడు?"

"అదేనే భాస్కరం."

"ఎందుకొస్తాడు. ఉన్నన్నాళ్ళు కళ్ళలో నిప్పులు పోసుకున్నారు" రాజ్యం కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

-"దొడ్డమ్మా... పెదనాన్నను రేపు మా ప్రొఫెసర్ దగ్గరకు తీసుకెళతాను. ఆయన రక్తపుపోటు పరీక్ష చేస్తామన్నారు..." భాస్కరం గొంతు వినపడింది.

"చూశావా. నా డబ్బు తిని, నీచేత చాకిరీ చేయించుకుని నాకు రక్తపుపోటని..." ఇంకా ఏమేమో అనాలనుకున్నాడు శాస్త్రి. కాని భార్య వంక చూసి ఆగిపోయాడు. ఆమె ఒత్తికి కట్టిన కొడి చేతితో నలిపేస్తోంది. □



నిత్య నూతన సీరియల్

# కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

# వేయిపడగలు

(గత సంచిక తరువాయి)

ఆ మరునాడు రంగారావుగారు చెన్న నగరమునుండి వచ్చిరి. ఆనాడు శుక్లాష్టమి. వెన్నెలలు విరియగాయుచుండెను. రాత్రి అరజాము ప్రొద్దుపోవువరకును గాలిచల్లబడలేదు. మాగాణికోసిన పొలము లన్నియు నెరియలుపడి వెచ్చని ఆవిరి వదలుచుండెను. ఊరు తూరుపు వైపున నున్న మెట్టమీది పైరుపచ్చ ఆవెచ్చదనమును తగ్గించలేకుండెను. రంగారావుగారు మేడ పై భాగమున కూర్చుండి సరోజినీదేవిగారిని గూర్చి ఆలోచించెను. ఆమెకు తనకు ఏమో దూరదూర మగుచున్నట్లు తోచెను. తన కామెమీద పూర్వమున్నంత ప్రేమ లేదేమో! ఆమె నూతనాభి ప్రాయముల కనుగుణముగా ఉండవలయునని అతని ఉద్దేశ్యము. ఆమె పూర్వాచార పరాయణు రాలు. ఒకసారి చెన్నపురిలో గవర్నరు గారికి టీ పార్టీ యిచ్చినపుడు రంగారావుగారు తన భార్యను కూడ రమ్మనెను. ఆమె రాలేదు. గవర్నరుగా రడిగెను. ఆయన భార్య ప్రశ్నించెను "మీ దేశమున ఇంతే! స్త్రీలకు స్వాతంత్ర్య మీయరు. మేము నూతనాభిప్రాయములు కలవారము అందురు. మీ భార్యలకు మాత్రము ఘోషా వదలలేదు" అని గవర్నరు భార్య యెత్తి పొడిచెను. ఆనాడు రంగారావు భార్యతో ఇది అంతయు చెప్పిరి. ఆమె "తాచెడ్డ కోతి వనమెల్ల చెరచిన"దని అన్నది. రంగారావుగారికి చాల కోపము వచ్చెను. అదివరకు వారిద్దరి మధ్యవున్న ఎడము ఈ సందర్భము మరింత ఎడము చేసెను. తరువాత భార్యా భర్తలిద్దరును సరిగా మాటాడనే లేదు. సుబ్బన్నపేట వచ్చిన తరువాత రాణిగారు తన త్రోవ తానే తప్ప రంగారావు గారు వచ్చినను పోయినను విచారణయే చేయుటలేదు. రంగారావు గారా రాత్రి కూర్చుండి, కూర్చుండి పరిచారకుని పిలిచి రాణిగారికి కబురంపించెను. సరోజినీదేవి "రావచ్చు" అని అనుజ్ఞ యిచ్చెను. రంగారావుగారు వెళ్ళిరి. గదిలో దీపము వెలుగుచుండెను. రాణి మొగమున పెద్ద కుంకుమ బొట్టు పెట్టి, ఎర్రని జరీ చీర తాల్చి సోఫాలో కూర్చుండి ఉండెను. రంగారావుగారు లోనికి పోవుట తోడనే ఆమె లేచి నిలుచుండెను. అదివరకట్లు లేదు. రంగారావుగారు "అదియేమి" టనెను. ఆమె "ఏది" అనెను. రావుగారు "నేను వచ్చినచో మీరు నిలుచుండవలయునా!" అనెను. ఆమె "సతికి పతి దైవము. వేణుగోపాల స్వామికిని, నా భర్తకును భేదములేదు" అన్నది. రంగారావు పరిహాసముగా నవ్వెను. ప్రక్కనున్న బల్లమీద రంగారావుగారి ఛాయాపటము దంతపు కైవారము నందిముడ్చబడి ఉండెను. దానిపైన పూవులు పూజచేయబడి ఉండెను. రంగారావది చూచెను. అతడు సరోజినీదేవి చేతిని పూని "ఇది మీరేనా చేసినది" అనెను. దేవి "అట్లనరాదు. మీరు నన్నింక "నీవు" అనియే అనవలెను" అనెను. రంగారావునకు మనసులో తన జమీందారీఫాయా అంతయు పోయినట్లు తోచెను. అతడేదో ఆలోచన చేసి, మరల తిరిగి వెళ్ళిపోయెను. వెడలిపోవుచుండగా సరోజిని అతని ఉత్తరీయము పట్టుకొని లాగెను. అతని కదియు క్రొత్తగా తోచి విదలించుకొని పోయెను. మరునాడు రంగారావు చెన్నపురి చేరెను.

దశమినాడుదయమున స్నానము చేసి సరోజిని పూవులు కోసి భర్త ఛాయా పటమును పూజ చేయుటకు పోయెను. ఛాయాపట మచ్చట లేదు. దాసీవాండ్రను పిలిచి ప్రశ్నించెను. వారు మాకు తెలియదనిరి. ఒక దాసిని కోపపడగా "బాబయ్యగారు తెచ్చి పెట్టుమనిరి. నేను కొనిపోయి యిచ్చితిని. వారు దానిని చిన్నపురి తీసుకొని పోయి"రని చెప్పెను. ఒకానొక దుఃఖ వీచిక దేవి నాభిలో నుండి రెండు ప్రక్కలకు మోచేతులతో పొడిచినట్లు పొడిచి, హృదయమున కెగదన్ని, కంఠమున ధ్వని ఉన్నచో గాద్గద్యమునకు సన్నిహిత స్థితి తెచ్చి, ప్రయత్నము చేత అణచబడుటచే ముఖమునందు రక్తచ్ఛాయలుదికి, కన్నులలో నెత్తురు లుమిసెను. దాని వెంట కోపము తరుముకొని వచ్చెను. నేత్ర పద్మములు నిమీలనము చేసి ఆమె వచ్చిన కోపమును గొంతుకలో నుండి క్రిందికి త్రొక్కెను. అర గడియయైన తరువాత ఆమె ఒక్కతెయు గదిలో కూర్చుండి పరిచారికల నందరను పంపివేసెను. తనమీద పిడుగు వచ్చి పడును అనుకొన్న ఆ దాసి రాణిగారి ఆ నిగ్రహము చూచి బేజారైపోయెను.




రాణి ఆనాడు భోజనము చేయలేదు. బోనాము పెట్టెలో బెట్టి, అన్నము ఆమె గదిలోనికి తెచ్చి, దాసీవాండ్రెదురు చూచిరి. ఆమె రాలేదు. పోయి మనవి చేయుట కెవ్వరికిని ధైర్యము చాలలేదు. రెండు జాములకల్ల భోజనము చేయు రాణి ప్రొద్దు క్రుంకి కూడ భోజనము చేయలేదు. ఆమె కిష్టురాలైన ఒక దాసి ఉన్నది. అది పోయి బతిమాలెను. అది పుట్టినింటి నుండి వచ్చిన దాసి. రాణి చివరకు పాలు త్రావుటకు అంగీకరించెను. దాసి పరమాన్నము చేసి యిచ్చెను. రాణి కోపగించెను. కాని దాసి ఒత్తిడికి

# వేయి పడగలు

ఆరగించెను. మరునాడెంత బలవంతము చేసినను ఏకాదశి అగుట వలన రాజు ఉపవాసమే అనెను. రోజు రోజెల్ల ఎండలు తీక్ష్ణముగా కాసి పోసెను. నాగేశ్వరస్వామి ఫాల నేత్రము నుండి నిప్పులుమిసెనో అన ఎండలు వాయు వీచికల మధ్య ఎఱ్ఱనై తరంగలు తరంగలుగా కనులు మిరుమిట్లు గొలిపెను. ఎండలో తిరిగిన పక్షి శవము మాత్రమే మిగిలెను. "అంభా" అని అడలిన గొడ్డునకు బయటికి వచ్చి కాపు నీరు పట్టలేదు. ఇంతకుముందాకు పచ్చన, మరి ఇంతలో ఎండి వఱుగై పోయినది. ప్రతి పచ్చి ఆకును. గజము లోతు త్రవ్విన జలలు పుట్టు సుబ్బన్నపేట బావులు దాహమెత్తిన శేషుడు వేయి నోళ్లతో భూమిలో ఉన్న అంతర్జల ప్రవాహములను ఆకర్షించినట్లు నీరు లోతుకు పీకుకొని పోయెను. సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ద్విసహస్ర నేత్రముల నెత్తురులుమిసి, ద్విసహస్ర జిహ్వల నుండి రక్తములు ప్రవహింపించినట్లు తెల్లని ఎండలు పోయి ఎఱ్ఱని ఎండలయ్యెను. పచ్చని ఆకన్నది లేకుండుట చేత చూచినంత మేర తగులబడి పోయెను. రెండు జాములు దాటి ప్రొద్దు వాటారెను. వాటారిన ప్రొద్దుతో ఎండ ఎఱ్ఱని తనములు తగ్గెనే కాని వెచ్చదనములు హెచ్చునే హెచ్చెను.

శోషవడిన ప్రాణము చెవులు రింగుమన్నట్లు హోరు గాలి యీ చెవి నుండి ఆ చెవికి ఊది పోసెను. మనిసి కదలలేదు. పిట్ట అడలేదు.

ప్రొద్దు క్రుంక వచ్చెను. కొద్దిగా చల్లబడినట్లే తోచెను. రాజుగారు అద్దాల బండి ఎక్కి దేవాలయమునకు పోయెను. దేవాలయము నందుండి పురుషులందరను పంపివేయబడిరి. రాజు దిగి చెఱువులో పాద ప్రక్షాళనము చేసికొనుటకు పోయెను. ఆచట ముగ్గురు స్త్రీలుండిరి. రాజు అందులో ఒకర్తుక నెరుగును. ఎరుగును గాని ఆమె ఎవ్వరో ఎరుగడు. ప్రతి ఏకాదశినాడు దేవాలయములో ఆమెను చూచుచుండెను. తక్కిన యిద్దరను చూడలేదు. రాజుగారు వచ్చునపుడు దేవాలయాంతర్భాగమున అర్చకులు పురుషులనే కాదు, స్త్రీలను ఉండనీయరు. కాని దేవదాసిని పొమ్మనరు. దేవదాసి రాజు దేవాలయమున ఉన్నంత సేపును ముఖమండపమునందు కూర్చుండును. ఆమె ఒడలు తెలియని స్థితిలో ఉండి ఏమో ఆలోచించు చున్నట్లుండును. రాజు ఆమెతో ఎన్నడును మాట్లాడలేదు. రాజుకి ఆమె ఎవరో కూడ తెలియలేదు. నేడు ముగ్గురు స్త్రీలామెకు కనపడినంతనే ఆమెలో ఉన్న జమిందారీతనము బయటికి వచ్చెను. ప్రక్క నున్న దాసితో "వీరెవరు? వీరిని బయటికేల పంపించలేదు?" అనెను.

దాసి వారిని పిలిచి బయటకు పొమ్మని చెప్పబోవుచుండెను. రాజు ఏమనుకొన్నదో - వలదని వారించి, వారి వద్దకు పోయెను. దేవదాసి కాక తక్కిన ఇద్దరును అరుంధతీ రథంతరులు. వారు ముగ్గురు ఏదో ప్రసంగించుకొనుచుండిరి.

రథం : చెల్లెలా! అరుంధతీ! ఊరిలో నీవు సంవత్సరము లేవు. గిరిక నీ మీద బెంగపెట్టుకొన్నది.

అరుం : బెంగ నామీద ఎందుకమ్మా? గుడిలో స్వామి ఉన్నాడు. స్వామి తరువాత స్వామి చెల్లెలు సుభద్ర అంత దానవు నీ వున్నావు. స్వామి అప్రత్యక్షమైన భర్త; నీవు ప్రత్యక్ష భర్తవు. మఱి వంటి దానను నేనుండి ఏమి, ఉండకేమి.

దేవ : వదినా! నిజము చెప్పితివి. నాకీమెయు, ఆయనయు ఒక్కటిగానే ఉండిరి. నీవు వెళ్ళిన తరువాత పెద్ద వదినగారు నా వంకనైన చూడలేదు. ప్రభువంతకు ముందే చూడలేదు. అన్న లేడు. స్వామికి నామీద దయ తప్పినది. ఉపవాసముల చేత నా ఒడలు కృశించుచున్నది కాని, స్వామి కాలి గోరు నా ఎదలో తాకలేదు. అన్న మూన్నాళ్ల నుండి నన్ను పరిహరించుచున్నాడు. ఆయనకు నామీద దయ పోయినది. ఆయన చెప్పిన పనులే చేయుచుంటిని. స్వామికి దయ వచ్చినట్లు లేదు.

అంతలో రాజు దగ్గరకు వచ్చెను. ఆమె దేవదాసి అనిన మాటలన్నియు విన్నది. ఆమెకేమియు అర్థము కాలేదు. వారు ముగ్గురును రాజు వంక చూచిరి. ప్రక్కనున్న దాసి వలన ఎవరును చెప్పకయే ఆమె రాజు అని తెలిసినది. రాజు నిశ్చలముగా దేవదాసి వంక చూచెను. ఆమె సిగ్గుచేత తాభేలువలె తనలో తాను కుదించుకొనెను. రాజు తక్కిన యిర్వురను చూచి "ఈమె ఎవరు?" అని అడిగెను. రథంతరి "ఈమె గోపిక" అన్నది. దేవదాసి నిలువెల్ల వణకి మెట్లపై కాలుజాఱి నీటిలో పడెను. అరుంధతి ఆమెను పట్టుకొని బయటకి లాగి, తడిసిన గాగరా అంచులు పిండెను. రాజు నివ్వెర పోయెను. రాజు "ఈమె ఎవ్వ"రనెను. "ధర్మారావు భార్య" అని రథంతరి చెప్పెను. ధర్మారావు పేరు రాజు రెండు మూడుసార్లు విన్నది. తన మామగారికి పురాణము చెప్పుట, కొన్నాళ్లత్త గారికి కూడ చెప్పుట. ఆమె ఎరుగును. గోపిక ఎవరో తెలియలేదు. "గోపిక అనగా ఏమి?" అని మఱల ప్రశ్నించెను. దేవదాసి మొగము దీనముగా పెట్టి, రథంతరిని కౌగిలించుకొని, "ఏమున్నది? ఏమి లేదు, ఏమిలేదు" అనెను. రాజుకేదో సందేహము కలిగెను. ఆ సందేహము కూడ ఇదమిత్థమని నిరూపింప రాకుండెను. "గోపిక అనగాఏమమ్మా?" అని మరల రాజు ప్రశ్నించెను. దేవదాసి రథంతరి నోటిపై చేయివైచి "ఏమున్నది, ఏమున్నది? ఏమిలేదు, ఏమిలేదు" అని ఏడ్వ ఆరంభించెను. ఈ దుఃఖము చూచి రాజు చలితయై పాదప్రక్షాళనము చేసి దేవాలయము లోనికి పోవుచుండెను. వెంటనే వీరు ముగ్గురును వెళ్ళిరి. వెళ్ళుట దేవదాసి కిష్టము లేదు; కాని వెళ్ళెను. నలుగురును భగవంతుని ఎదుట నిలుచుండిరి. రాజు వేణుగోపాలస్వామి వంక నిశ్చలముగా చూచుచుండెను. రాజుకి తన సంసార మంతయు స్మృతికి వచ్చెను. రంగారావు గారి ప్రస్తుత స్థితికిని, ప్రస్తుత భావములకును తాను భార్యగా ఉండుట తగనట్లు తోచెను. ఉన్నదున్నట్లు హేతువు లేకుండ "ప్రభూ! నన్ను నీలో కలుపు కొనుము. నేను బ్రతికి ఏమియు లాభము లేదు." అని మనసులో అనుకొనెను. స్వామి కన్నులు విప్పి రాజువంక చూచెను. రాజుకి భగవంతుని ఒక నేత్రము దేదీప్యమానమై ప్రకాశించుచు, మరియొకటి చీకట్లు చిమ్మినట్లు తోచెను. దేవదాసి భగవంతుని పాదముల వంకనే చూచుచుండెను. పాదములకు బంగారము తొడుగుండెను. నఖ ప్రదేశములయందింద్రనీల మణులు పొదిగిరి. తన్నఖకాంతులు భగవత్త్రిపాదము కన్నులు విచ్చిన తారకలవలె నీలరోచిస్సులు ప్రసరించు చుండెను. అరమోడ్చిన కన్నులతో దేవదాసి ఆ కాంతులను రెప్పల క్రింది నుండి లాగి తనలో నాళనాళమునకు ప్రసరింప చేసికొనెను.

అర్చకుడు శఠగోపము తెచ్చెను. ముందు దేవదాసికిచ్చెను. రాజుకి తెలియ లేదు. మఱి ఒకప్పుడైనచో రాజుకి కోపము వచ్చి ఉండునేమో! వధ్య స్థానమునకు కొనిపోబడుచున్న గొఱ్ఱెపిల్లవలె రాజు కనుల యందు దైన్యమే ప్రకటించెను. స్వామి నిత్య సన్నిధానవర్తి, అర్చకునకు స్వామి అనుగ్రహానుగ్రహములు తెలియును. ప్రభువునకు ఎవ్వ రెక్కువ దగ్గరవారో అర్చకునకు తెలిసినంత తన కేమి తెలియును? రాజు దేవదాసి వంక చూచెను. దేవదాసి కంఠము శంఖమువలె, నడుము చక్రమువలె, కనులు పద్మములవలె ప్రకాశించెను. రాజు కనులు మూసికొనెను. దేవదాసి వద్ద స్వామి వచ్చి నిలుచుండెను. ప్రభు వామె శిరస్సుపై చేయి వైచెను. దేవదాసి అతని పాదములు తాకెను. రాజు కనులు తెఱచి, "అన్నట్లుగా ఈమె గోపిక కదూ!" అనెను. తోడికోడం డ్రిద్దరును మఱదలిని ఆనుకొని నిలుచుండిరి. మరు నిముసమున వారిద్దఱు చేతులలో దేవదాసి వ్రేలాడుచుండెను.

అందరును కలసి ముఖమండపమునకు వచ్చిరి. రాజు ఎండిన ఆకుమీద దేనిమీదనో కాలు వేసెను. ఆమె కాలిలో ఏదో పులక గ్రుచ్చుకొనెను. ఆమె

జరిగిన కథ –21 : రుక్మిణమ్మా రావుగారి సాయంతో ధర్మారావు కళాశాలలో చేరతాడు. పుట్టినింటిలో తాను పడిన కష్టాలను అరుంధతి ధర్మారావుతో చెబుతుంది. రంగాజమ్మ గారు మరణిస్తారు. రామచంద్రరాజు సుబ్బన్నపేటలో స్థిరపడి పోతాడు. రంగారావుగారికి జమీతాలూకు ఆదాయ వ్యయాలు తెలవు. సూర్యపతి ధర్మారావును ఆర్థికంగా ఆదుకుంటాడు. ధర్మారావుకు రాధాపతి అనే కొత్త మిత్రుడు తారసపడతాడు. రంగారావుగారికి భార్య సరోజినీదేవికి అభిప్రాయభేదాలు వస్తాయి. రంగారావుగారు చెన్నపురిలో నే ఎక్కువగా ఉంటున్నారు. రాజు చచ్చి పోవునని గణాచారి చెబుతుంది.

"అబ్బా!" అని తొలగి పరిశీలించి చూచెను. అది ఎండిపోయిన రావిమండ. రాణి ఆగుటయు పరిశీలించుటయు చూచిన అర్చకుడు దగ్గరకు వచ్చి ఆ రావిమండను చూచి కదలాడి పోయెను. అర్చకునకు మనస్సులో ఏదో తళుక్కు మనెను. ఆ భావము వచ్చినందుకు తనలో తానే నిందించు కొనెను. అరుంధతి రావిమండ చూచినంతనే "అయ్యో దైవము!" అని కూలబడెను. తక్కిన వారి కేమియు తెలియ లేదు. రాణి "ఏమిటమ్మా?" అని ప్రశ్నించెను. అరుంధతి రాణిగారి చేతిలోని రావిమండను తీసి చూచెను. అది సగము త్రుంచినట్లుండెను.

ఎవరిదారిని వారు పోయిరి. ఎన్నడును లేనిది ఆ నా డేలకో అద్దాల బండి తూర్పు గుమ్మము వెంట పోయినది. కోట వీధి గుమ్మము తలుపు మూసి ఉండెను. ఇనుప తలుపులు బిగించిరి. బండి తోలువాడు తలుపు తీయుట కెవరినో పిలుచు చుండెను. రాణిగారి బండి కోటముం దాగుటచేత పిల్ల లందరును చుట్టును మూగిరి. రాణి తలుపు తీసి చూచెను. ఒక పిల్లవాడు దేనినో పుచ్చుకొని బండిని కొట్టు చుండెను. తలుపు తెఱచుటతో రాణి కది తాకెను. రాణి అది తీసికొనెను. అది ఎండిన రావిమండ. రాణి పరధ్యానముగా ఉండి గుడిలోని రావిమండ వెంటనే తెచ్చెను. దానిని దీనిని కలిపి చూచెను. రెండు ఒక్కటే మండ.

ఆ రాత్రి రాణి దాసీ నడిగెను. "ఏమే? ఆ రోజున గణాచారి ఏమి చెప్పినది?"

దాసి: "అమ్మా! రాణిగారు చనిపోవు నన్నది" అని చెప్పెను.

సరోజినీదేవికి రెన్నాళ్ళుగా తిండిలేక కనులు గుంటలు పట్టెను. ఒడలెల్లయు తపించి పోవుచుండెను. మనిసి వడలి పోయిన రావి ఆకువలె అయ్యెను.

రాణి ఆ రాత్రి నిద్దుర పట్టక అర్ధరాత్రి వేళ స్నానము చేసెను. ప్రౌఢచమరీవాల సదృశమైన ఆమె శిరోజభార మెండలేదు. ఇష్టురాలైన దాసి పొడిబట్ట తల వెంట్రుకల కుదుళ్ళ లోదాక పోనిచ్చి తుడిచెను. అగురు సాంబ్రాణి పొగ పట్టెను. కొన లొడిలో వేసికొని రెండు చేతులతో ఒట్ట నడుమ పడిపెట్టెను. బలవంతము మీద రాణి మఱల పాలు త్రావెను. తెల్లవారు వఱకు రాణికి జలుబు చేసి జ్వరము వచ్చెను. దాసి వలదన్నను ఆమె మఱల స్నానము చేసెను. బ్రాహ్మణుని పిలిచి ఆయనకు స్వయంపాక మిచ్చెను. దాసి ఆయనతో "అయ్యా! రెండు రోజుల నుండి అమ్మగారికి భోజనము లేదు. ఒక గంటలో మీరు భోజనము చేసి కబురంపించ వలయును." అని చెప్పెను. గంటలో బ్రాహ్మణుడు భోజనము చేసెనని కబురు వచ్చెను. రాణి భోజనము చేసెను. ఆమెకు తలనొప్పి ఎక్కువ అయ్యెను. దాసి "అమ్మా! వైద్యుని తెప్పింతునా?" అనెను. రాణి "ఎవరితో చెప్పి?" అనెను. దాసి తటపటాయించి "సర్వా........" రాణి "ఛీ!" అని దాని నోరు అదిమెను. రాణి మొగమున కొంచెము కోపము కూడ కనపడెను.

తరువాత మూడునాళ్ళకు రంగారావు గారు వచ్చిరి. ఈ మూడు రోజులును రాణికి జ్వరమే కాచినది. ఆ నాడు రాత్రి రంగారావు గారిని రమ్మని రాణి కబురంపించెను. అట్టి దదివఱ కెన్నడును జరుగ లేదు. రంగారావుగారు "సరే వత్తు"నని కబురంపించి యిట్లూహించెను. "ఈమె నన్ను దైవముగా ఆరాధించు చున్నది. ఈ దేశమున ఇది ఒక పిచ్చి. దంపతులు లోకమున పరస్పర సుఖము కొన మేర్పడుదురు. మనుష్యుని దైవముగా భావించు టయే దోషము. భార్యా భర్త లిద్దరును కలిసి లౌకిక మైన సుఖమును పొందవచ్చును. గాని, ఒకరి నొకరు దైవముగా ఆరాధించి ఏమి లాభమో తెలియుట లేదు. ఇట్టి ప్రాత అభిప్రాయములు నాగేశ్వరరావు నకు గిట్టవు. నాగేశ్వర రావొక మహా మేధావి. మతము లన్నియు చదివి అందులోని నిగ్గు తెలిసికొన్న వాడు. భార్య భర్తను దైవముగా ఆరాధించునేని భర్త వాంఛించుచున్న శారీరక సుఖమే అతనికి లభించదు.

గుడిలోని రాతివిగ్రహమునకును, పూజించువానికిని ఎంత సంబంధమో భార్యకు భర్తకు అంతియే సంబంధము. నాగేశ్వరరావు చెప్పినట్లే దేశములోని సర్వ సంస్థలును స్వాతంత్ర్య భావవిరహితములై పోయెను. ప్రధానమైన దాంపత్యమే యిట్లుండగా తక్కిన వాని విషయము చెప్పవలెనా!

ప్రొద్దు పోయినది. రంగారావుగారు వెళ్ళలేదు. మరునాడు ప్రొద్దున దాసి వచ్చి "అమ్మగారికి జబ్బుగా ఉన్నది. మిమ్ము రమ్మను చున్నా"రని చెప్పెను. అతడా రోజంతయు వెళ్ళలేదు. మరునాడు ప్రొద్దున మఱల దాసి వచ్చి "మీరు మఱల చెన్నపురికి పోకముం దమ్మగారు వచ్చి ఒకసారి చూచిపొమ్మన్నా"రని చెప్పెను. ఆ సాయంకాలమే రంగారావుగారు చెన్నపురి వెళ్ళిరి.

కోటలో రామేశ్వరము గారి భార్య ఉన్నది. ఆమె పోయి రాణిని చూచెను. రాణి ప్రతి దినము ప్రొద్దుననే లేచును. కంఠ స్నానము చయును. ఓపిక లేక మంచములోననే పరుండి, భగవద్ధ్యానము చేయు చుండెను. పండ్రెండు గంటలకు, గాని భోజనము చేయదు. చేసినను సరిగా సయించుట లేదు. రాతిరు లందు పాలు త్రాగు చుండెను. రామేశ్వరముగారి భార్య పరామర్శించి పోయెను. రాణి శుష్కించి పోయెను. దాసి తల్లడిలి పోయెను.

ఆ నాడు పూర్ణిమ. వెన్నెలలు పాలిపోయిన రోగి దేహచ్ఛాయవలె తెల్లనై, ఉష్ణరోగి శరీరము వలె వేసగి కాకలకు వెచ్చనై తెల తెల్ల పోయెను. కోటలో పూర్వము వలె నానా వృక్షములు లేవు. చాల చెట్లు పడిపోయి కోట అంతయు బంగరు బయ లయ్యెను. కృష్ణమనాయని దినములలో పచ్చని పోక చెట్లు, తమలపాకు తీగలు, ద్రాక్షావల్లులు, మామిడి, బత్తాయి, పనస మొదలగు ఫల వృక్షములు నిత్యము నీటిచేత తడుపబడి పచ్చనై కోటలోని కెండను చేరగట్ట నిచ్చెడివి కావు. వేసగి వెన్నెలకే దిక్కు లేదు.

మరునాడు రాణి హరప్పనాయని పిలిపించెను. పది యేండ్ల కుఱ్ఱవాడు దొరవలె వేషము వేసి, దొర టోపీ పెట్టి తీసికొని రాబడెను. రాణి కతని చూచినంతనే అసహ్య మయ్యెను. తన మామగారి తండ్రి హరప్పనాయని చిత్రము పెద్ద గదిలో ఉన్నది– బొందుచొక్కా, కంగులు తీర్చి కట్టిన పంచె, మెడలో రత్న హారములు, చేతులకు సింహతలాటపు మురుగులు, దండలయందు బాహుపురులు, శిరసున కుడి వైపున కొరగిన వంకి పాగా, పైన కలికితురాయి, కాలికి గండపెండారము, ప్రక్కన వ్రేలాడుచున్న కత్తి, బొడ్డున చిన్ని బాకు– హరప్పనాయడు శౌర్యమెల్ల కూడు కట్టిన మూర్తి వలె కన్పించెను. కొడుకైన హరప్పనాయని చూచెను. లాగు, చొక్కా, కోటు, బూట్సు, దొరటోపి– ఆమె మనస్సులో ఒక శతాబ్ది ఆ చివర ఆ హరప్ప నాయడు– ఈ చివర ఈ హరప్పనాయడు– తలక్రిందు లైనట్లు తోచెను. తల్లి కుమారుని దగ్గరకు తీసికొన్నది. దొరటోపీ తీసి వేసినది. సన్న జరీ పట్టు ఉత్తరీయమును తెమ్మన్నది. కోటలో వెదకినను అట్టిది కన్పించలేదు. జవాహిరీల గదిలో ఉండవచ్చును. అచ్చటనే రాజుల పట్టాభిషేక ద్రవ్యాదు లుంచబడును. కిరీటము, రత్న



హారములు, పూర్వపు చొక్కాలు, రాజులు ధరించు సెల్లాలు ఇవన్నియు పాతపద్ధ జవాహిరి క్రింద ఉత్సవము లప్పుడు, పట్టాభిషేకము లప్పుడు ధరించ నైనవిగా దాచబడి ఉండును. ఆ కొట్టు తాళపు చెవి పెద్ద కాసావాని దగ్గర ఉండును. అతని పేరు వెంకటాద్రి. వెంకటాద్రికై కబురంపెను. వెంకటాద్రి రాజుగారి అనుమతిలేక అవి తీయుటకు వీలులేదని మనవి చేసెను. రాణి ఏబది రూపాయ లిచ్చి అట్టి ఉత్తరీయమును బజారు నుండి కొని తెమ్మని పంపించెను. ఒక్క అరగంటలో అది వచ్చెను. రాణి పరిచారిక లందఱను పంపించి కుమారుని వద్ద కూర్చుండ పెట్టుకొని, లేనియోపిక తెచ్చుకొని, లేచి కూర్చుండి, కొడుకునకు తలపాగ చుట్టెను. ఎన్నడు ఏ పని చేయనిది- ఆమెకు చేతులు నొప్పి పెట్టెను. తల్లి "నాయనా! చదువు కొనవా?" అని అడిగెను. హరప్పనాయడు "చదువు వలదు. షికారు పోదును" అనెను. తల్లి "కాదు నాయనా! చదువుకొన వలయును. ఈ ఊరిలో ధర్మారావని ఉన్నాడట! నీ వెరుగుదువా?" అనెను. కుఱ్ఱవా "డెరుగ" ననెను. రాణి "బాబూ! ఆయన చాల మంచి వాడు. మన దేవుడు వేణుగోపాల స్వామికిని ధర్మారావునకును చుట్టఱిక మున్నది. నీ వాయన దగ్గర చదువుకొన వలయును. ఆయన నిన్ను భక్తికలవానినిగా చేయును. మీ తాతగా రాయన వద్ద చదువు కొనిరి" అనెను. హరప్పనాయనికి తాతగారన్నచో ఎందులకో ప్రేమ. ఐదేండ్లప్పుడు తాతగారి ఒడిలో కూర్చుండెడివాడు. ప్రక్కను పరిచారకులు లేనప్పుడు కృష్ణమనాయడు మనుమని తలమీది కెక్కించుకొనెడి వాడు. మనుమడు తాత మీసాలు గుంజెడివాడు. తాత వేటాడిన పులులు, సివంగులు, కత్తులు, కటారులు మనుమనికి ప్రదర్శించెడి వాడు. తాత మనుమల మధ్య ఒక విచిత్రమైన అనురాగ ముండెడిది. పసితన మైనను హరప్పనాయనికి తాతగారి చెయువులు గాటముగా మనమున నాటుకొని, తత్స్మృతి పోలేదు. అందు చేత అతనికి తాతగారన్నచో అభిమాన మెక్కువ. అతడు "అట్లనా! తాత చదువుకొనెనా? అయినచో ధర్మారావు వద్ద నేనును చదువుకొందును" అనెను.

మరునాడు రంగారావు గారు మరల చెన్నపురి నుండి వచ్చిరి. రాణి మరల కబురంపెను. రంగారావుగారు వెళ్ళలేదు. తదియ, చవితి, పంచమి, ఈ మూడు రోజులును రంగారావుగారు సుబ్బన్న పేటలో ఉండెను. పంచమినాడు సాయంకాలమున దాసి పోయి రాజుతో చెప్పెను, "రాణి రమ్మన్న"దని. రాతిరి జాము జామున్నర ప్రొద్దు పోయెను. రంగారావుగారు పోవుదమా, వలదా అని విచారించెను. జబ్బుగా ఉన్నదట. ఏమి జబ్బో! ఎక్కువ చేసినదని వర్తమానము లేదే! నెమ్మ దించియే ఉండును. మరల మన మతము, మన సంఘము, ఇతరుల మతములు, ఇతరుల సంఘములు- వీటిని గూర్చి విచారణ ప్రారంభ మయ్యెను. రంగారావునకు నిదుర పట్టలేదు.

## వేయి పడగలు

అప్పుడే చంద్రోదయ మగుచుండెను. ఐదు రోజు లైదురెండ్లు పది కళలు వదలి పెట్టిన చంద్రుడు పంచ ప్రాణములు వదలి వచ్చిన జీవచ్ఛవము వలె సువిస్పష్టముగా కనబడుచున్న తరిగిన కళలతో బియ్యపు దారపు రంగుతో అప్పుడే ఉదయించు చుండెను. రంగారా వేమను కొనెనో రాణి యింటికి నడచెను. భర్త వచ్చుట చూచి రాణి లేచి నిలువబడెను. నిలుచుండబోయి పడబోగా దాసి పట్టుకొనెను. రంగారావు భార్యను పరిశీలించి చూచెను. ఆమె ఒడలిలో ప్రాణము లేదు. పది రోజులలో చిక్కి బొమికల ప్రోవై మంచమున కంటుకొని ఉండెను. మొగమునందు సౌందర్యము కొట్టవచ్చు చుండెను. ఆమె అంత సౌందర్యవతి అని రంగారావుగా రెప్పుడు అనుకొన లేదు. అతడు ముగ్ధుడై పోయెను. దగ్గర కూర్చుండి ఆమె శరీరమును స్పృశించి పరామృశించెను. సరోజినీదేవి ఒక్కసారి కనులరమోడ్చి నిట్టూర్పు విడిచెను. రంగారావు "బాధగా ఉన్నదా?" అనెను. ఆమె "లే" దనెను. రంగారావు దీర్ఘ నిశ్వాసము వదలెను. మరునా డాయన చెన్నపురి కేగెను. ఆనా డంతయు రాణికి స్మృతి లేదు. దాసీవాండ్రు త్రొక్కిటపడిరి. వచ్చిన వాడాయెను. ప్రభువు మందిప్పించకయే పోయెనేమి? వారి కేమియు తోచినది కాదు.

దశమినాడు సాయంకాలమున హరప్పనాయడు తన్ను పెంచుచున్న కాసావానిని చూచి, "ధర్మారా వెవరురా?" అని అడిగెను. వాడు "ఎందుకు బాబయ్యగారు." అని ప్రశ్నించెను. కుఱ్ఱవాడు మరల మాటాడ లేదు. నల్లని మేఘ మొకటు విస్తరించి సంధ్యారాగము న్నాక్రమించు చుండెను. అంత వేసగిలో ఆ మొగి లెక్కడిదో! గాలి ఫెడీలుమని ప్రాగ్దిక్పతీకపోలమున చపేటము నమర్చెను. ఆ మొగిలు చిద్రుపలై మరల సంధ్యారాగ మంకురించెను.

మరునా డేకాదశి. రాణి భోజనము చేయలేదు. దాసి బ్రతిమాలెను. లాభము లేకపోయెను. సాయంవేళ కొడుకును వెంట పెట్టుకొని రాణి దేవాలయమునకు బయలు దేరెను. రాణి నిలుచుండ లేదు, కూర్చుండ లేదు. మరి యిద్దరు దాసీలు వెంట వెళ్ళిరి. వారు ముగ్గురును రాణిని పట్టుకొని దేవాలయము లోనికి కొనిపోయిరి. ఆలయములో గిరికారుంధతీరథంతరులు కని పించిరి. రాణికి జ్వరము చేత కన్నులు తిరిగి పోవుచుండెను. ఆమె దేవదాసి వంక చూచెను. వీరు ముగ్గురును దాళప్రమాణ వ్యక్తులవలె గోచ రించిరి. ప్రక్కనున్న దాసీల వంక ఆమె చూడనే లేదు. రాణి, ఏమో ఊహించెను. అరుంధతీ రథంతరుల చేత సేవింపబడుచున్న గిరిక వాణీ పార్వతులచేత కొలువబడుచున్న లక్ష్మీదేవి వలె కనపడెను. రాణి చేయెత్తి గిరికకు నమస్కరించెను. అందరును ఆశ్చర్య పోయిరి. స్మృతిలేని రాణిని మరల బండిలో కూర్చుండపెట్టి కోటలోనికి తీసికొని పోయిరి. రాణికి సంధించినది కోటలోనున్న స్త్రీలందరును ప్రోగైరి. ఎవరు ఏమియు చేయలేరు. ఊరిలోని డాక్టరును పిలుచుటకు పోయిరి. అతడేదో పొరుగూరు పోయెను. రాతిరి మూడు జాము లయ్యెను.

కోటలో అందరును మేల్కొనియే ఉండిరి. చెన్నపురికి తంతి పోయెను. రాణి "అదుగో! గోపాలస్వామి!.... రావిమండ.... గణాచారి.... హరప్ప...." ఈ మాటలు మధ్య మధ్య ఉచ్చరించు చుండును. ఒకసారి ప్రక్క నున్నదాసిని చూచి "చెన్నపురి నుండి వచ్చెనా!" అనెను. నిద్రపోవుచున్న పసివానిని లేపి తెచ్చిరి. అతడు నిద్ర కళ్ళతో తల్లి దగ్గర పరుండెను. తల్లి కా సంగతి తెలియదు. దాసీవాండ్రు పిల్లవానిని లేవదీసి తీసికొని పోయిరి.

అంతలో చంద్రోదయము కాజొచ్చెను. చెరిగిపోయిన కుంకుమ బొట్టువలె ఎఱ్ఱని సగమైన అతడు తూర్పునం దంకురించి కోట పడమటి వైపునున్న తాటి చెట్ల తలలలో పలుచని నెత్తురులు పోసెను. ఆ సమయమున గణాచారి నిదుర మేల్కొని, అన్నగారిని పిలిచి "రాణి పోయినది. చంద్రారెడ్డిని, రామచంద్రరాజును కోటలోనికి దీసికొనిపో" అని చెప్పెను. అందరును కోటలోనికి కలసి పోవుచుండిరి. ధర్మారావు గారి యింటి ముందుగా బోవుచుండిరి. ధర్మారా వరుగుమీద కూర్చుండెను. గణాచారి అన్న ధర్మారావును పలుకరించెను. ధర్మారావు "కోటలోనికా పోవుచున్నా" రనెను. వారు ముగ్గురును ఆశ్చర్యపడిరి. ముగ్గురును కోటలోనికి పోయిన తరువాత రాధాకృష్ణయ్య, రామేశ్వరము, సర్వారాయుడు గార్లు వారిని పరామర్శించిరి. "రాణిగారి కెట్లున్న"దని వారడిగిరి. అంతలో ఒక దాసి వచ్చి "అయ్యో! రాణి అన్నది లేకుండ పోయెను" అని చెప్పెను. రాధాకృష్ణయ్య ఏమిటేమి"టని అడిగెను. "అయ్యో! పెద్దరాణియు చిన్న రాణియు ఇద్దరును చనిపోయిరని చెప్పెను. అందరును దిగ్భ్రాంతు లైరి. దాసి అన్నది:- "చిన్నమ్మగారు- వేణుగోపాలస్వామి అదుగో! నా కోసము వచ్చె- నని లేచి నిలుచుండి విరుచుకొని మరల పడిపోయెను. తరువాత ఆమెను చూచినంతనే ఆమెలో ప్రాణములు లేవు. అంతలో పెద్దరాణి గారి దగ్గరనున్న దాసి వచ్చి పెద్దరాణి గారు చనిపోయినది. ఇన్నాళ్ళుగా కన్ను తెరవని, మాట్లాడని ఆమె యింకొక నిముసమునకు చచ్చిపోవుననగా కన్ను తెరచి- నా తపస్సు ఫలించినది. సంవత్సరము చేసిన తపస్సుకు స్వామి సంతోషించినా డదుగో! అదుగో! అని లేచి నిలుచుండి, విరుచుకొని పడిపోయెను. మరల చూచితిని గదా, ప్రాణము లేదని చెప్పిన"దని చెప్పెను.

చంద్రుడు బార పైకెక్కెను. పగిలి పోయిన గాజు ముక్కవలె సగము విఱిగినకూడ తళతళ మానలేదు. మహాసాగర తరంగ పరిధూతమై పరిత్యక్తమైన తీరమున ఎండిన ముత్యపు చిప్ప గుల్లవలె తూర్పు సముద్ర తీరమైన ప్రాగాకాశమున అతడును వెల్లకిలం బడెను. మొరిక ముడివలె ఉండెను.

(ఇంకాఉంది)

# నిత్యవినూత్న తారల జోడీ.

గుర్తుందా మీకు ? సినీతారరేఖ యొక్క అపూర్వమైన అభినయంతో కూడిన చిత్రం "ఉమ్రావ్ జాన్" క్లాసిక్ చిత్రాలలో వుండాల్సిన నిత్యవినూత్నలతో నిండి ఎన్నేళ్ళయినా అలాగే ఆనందాన్నందించే చిత్రం అది.

అది రేఖవంటి నిత్యవినూత్నతార చేసిన అనేక మరపురాని అభినయాలలో ఒకటి. అయితే ఈ ప్రకటనలో మేంచెప్పేది మరో నిత్యవినూత్నతార గురించి.

క్రాంప్టన్ గ్రీవ్స్ కలర్ టెలివిజన్ ఆధునికమైన, అత్యంత అధునాతనమైన సాంకేతిక విజ్ఞానంతో నిర్మించబడ్డ టీ.వీ. ఎంతో ప్రత్యేకమైన ఈ టీ.వీ.ని సొంతం



చేసుకుని తీరాలనిపించే అనేకానేక విశిష్టతలతో.

అన్నిటినీ మించి మరో విశేషం ! క్రాంప్టన్ గ్రీవ్స్ టీ.వీ. 12 నెలల పరిపూర్ణమైన భీమాతో వస్తుంది– అది మీ టీ.వీ.లో అన్నింటికన్న ఖరీదైన భాగం పిక్చర్ ట్యూబ్‌కి కూడా వర్తిస్తుంది. ఇంకా, అమ్మకాల తర్వాత కొందరే అలా ఇవ్వగల సేవా సౌకర్యం. గుర్తుంచుకోండి. ఇది క్రాంప్టన్ గ్రీవ్స్ టీ.వీ. ఇక క్రాంప్టన్ గ్రీవ్స్ ఏళ్ళ తరబడి గడించుకున్నతమ ఖ్యాతిని నిలుపుకునేందుకు ఎంతటికైనా వెనుకాడదని మరువకండి.

Crompton Greaves
LIMITED

## క్రాంప్టన్ గ్రీవ్స్ టీవీ
## ఎందుకంటే కొన్ని వస్తువులు ఆనందాన్నిస్తూనే వుంటాయి ఏళ్ళకేళ్ళుగా.

కన్‌స్యూమర్ ఎలెక్ట్రానిక్స్ & హౌస్‌హోల్డ్ అప్లయన్సెస్

బ్రాంచ్ : శ్రీనిధి కాంప్లెక్స్, 86, సరోజనీ దేవి రోడ్, సికింద్రాబాద్-500 003. 'ఉమ్రావ్ జాన్' లోని ఈచిత్రం ముజఫర్ అలీ సౌజన్యంతో.

# ది గేమ్

అమళ్ళదిన్నె పద్మజాశర్మ

మధ్యాహ్నం మూడు గంటల సమయం. వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. ఎండ విపరీతంగా ఉంది.

ఎండ తీవ్రతకి మొహం కందిపోయినట్టుగా ఎఱ్ఱగా అయిపోగా నీరసంగా ఆ బడ్డీ కొట్టు ముందు ఉన్న బెంచీమీద కూలబడ్డాడు రవీంద్ర.




చుట్టుపక్కల ఎక్కడా కనుచూపు మేరలో ఏ చెట్లూ లేవు. కొట్టు కూడ అది ఒక్కటే అక్కడ. షాపు ఓనరు కొట్టు ముందర కట్టి ఉన్న గోనె సంచుల మీద నీళ్ళు బాగా కొడుతున్నాడు. అయినా కూడ లోపల ఉక్కపోతగానే ఉంది.

షాపులో ఏదో పుస్తకం చదువు కుంటూ అపుడపుడూ దాంతోనే విసురుకుంటూ కాలక్షేపం చేస్తున్న ఓనరు, రవీంద్ర కూర్చున్న అలికిడికి తలెత్తి ఓసారి చూసి మళ్ళీ చదువు కోవటంలో మునిగి పోయాడు.

కూర్చుంటూ "మంచి నీళ్ళు అడుగుదామా" అనుకున్నాడు. మళ్ళీ అతని చదువుకి అంతరాయం ఎందుకులే అని మానుకుని తను కూడ చేతిలో ఉన్న ఫైల్‌తో విసురు కోవటం మొదలెట్టాడు.

ఇంటికి వెళ్ళాలంటే కనీసం యింకో మైలు అన్నా నడవాలి. ఆ రూట్‌కి డైరెక్ట్ బసస్ లేవు. రెండు బస్‌లు మారి వెళ్ళాలి. పోనీ ఏ ఆటోలోనో వెళ్దామంటే ప్రస్తుతం అతనికి అంత స్తోమత లేదు.

రవీంద్ర ఒక నిరుద్యోగి. నిన్నటి వరకు చిరుద్యోగి. కొన్ని ప్రైవేట్ సంస్థల్లోని ఉద్యోగాల్లాగే అది కూడ చాలా కాలం నిలవలేక పోయింది. రవీంద్ర కుటుంబం మధ్య తరగతికి చెందినది. ఇంటికి పెద్దగా పుట్టినవాడు అతడే. నడుం విరిగిపోయే బరువులు లేవు. కానీ కొన్ని బాధ్యతలు మటుకు ఉన్నాయి. ప్రస్తుతం మంచి ఉద్యోగం కోసం ప్రయత్నం చేస్తున్నాడు.

ఆలోచనల్లో మునిగి పోయిన అతనికి వడగాలి వచ్చి విసురుగా తగిలేసరికి ఇహ లోకం లోకి వచ్చి పడ్డాడు. విపరీతమైన దాహం అన్పించింది.

"మంచినీళ్ళు బదులు సోడానే తాగితే పోతుంది: అతనికి అంతరాయం అన్పించదు" తనలో తనే తలపోస్తూ, పాంట్ జేబు లోంచి చిల్లర తీయడానికి లేచి నుంచున్నాడు. మళ్ళీ బల్ల "కిఱ్ఱు" మని చేసిన శబ్దానికి షాపతను తలెత్తాడు.

చిల్లర ఏమీ దొరక్క పోవటంతో ఒక నిమిషం తటపటాయించి రెండు రూపాయల నోటు తీసి యిస్తూ "ఒక సోడా" అన్నాడు రవీంద్ర.

షాప్ అతను సోడా తేవటానికి వెనక్కి తిరిగేటంతలో పెద్ద శబ్దం చేస్తూ ఒక మోటర్ బైక్ వచ్చి ఆగింది షాప్ ముందర.

వెనక్కి తిరిగిన వాడు కాస్తా "రాంబాబుగారా! ఏవిటి ఈ రోజు మా అదృష్టం, యిలా వచ్చారు? తమరి స్నేహితు లెవ్వరూ లేరే వెంట? బావున్నారా! నేను పంపలేదని కేసెట్ల కోసమే వచ్చుంటారు కదూ." అంటూ తలా, తోకా లేకుండా ప్రశ్నలూ, జవాబులూ కూడా తానే చెప్పుకుంటూ బయటకు వచ్చాడు.

అటు చూసాడు రవీంద్ర. తన వయసు వాడే. బైక్ మీద ఒక కాలు ఆన్చి నిల్చున్న తీరులో నిర్లక్ష్యం. డబ్బుతో వచ్చిన హజం కన్పిస్తున్నాయి. మాటల్లో నిర్లక్ష్యం.

షాప్ అతను ఒక గోల్డ్‌స్పాట్ తెచ్చి అందించాడు అతనికి.

అలాగే తనకి సోడా యిస్తాడేమో అనుకున్నాడు రవీంద్ర. అతను యివ్వకపోగా వచ్చిన అతనితో మాటల్లో పడిపోయాడు.

మాటల్లో వారిద్దరు ఫ్రెండ్సు అనీ, యితను కొట్టు పెట్టుకోవటానికి అతడు సాయ పడ్డాడనీ అర్థం అయింది రవీంద్రకి.

ఫ్రెండ్ వచ్చిన హడావుడిలో మర్చిపోయాడేమోనని గుర్తు చేసాడు రవీంద్ర. "ఏమోయ్ సోడా" అంటూ.

షాప్‌వాడు తల కూడ తిప్పి చూడ్లేదు.

"అవునూ.... రాంబాబూ.... మీరు మొన్న పంపిన కేసెట్లు పెట్టాను. చాలా బావున్నాయి. వచ్చిన జనం అంతా అడిగారు ఆ మ్యూజిక్ ఎక్కడ చేయించావు? అని... ఆ రెండు రోజులూ కిక్కిరిసి పోయిందనుకోండి, నా షాపు జనంతో..." చెప్తున్నాడు షాపతను.

"ఏవిటీ.... యింతకీ నా కేసెట్లు అరిగి పోయాయి అంటావు. అవునా? అసలే నాకెంతో యిష్టమైన మ్యూజిక్ అది. వెస్ట్రన్ మ్యూజిక్ నా ప్రాణం, తెలుసుగా నీకు!" దర్పంగా అంటున్నాడు అతను.

"అమ్మమ్మా.... ఎంత మాట! అది కాదూ...." అంటూ యింకా ఏదో చెప్పబోతున్న అతనిని మధ్యలో ఆపుతూ, "ఏమోయ్. నీకే చెప్పేది" అంటూ పిల్చాడు నాలుక పిడచ గడు_న్న రవీంద్ర.

షాపతనయితే వెనక్కి తిరగ లేదు కానీ రాంబాబు వెనక్కి తిరిగి చూసాడు.

అతని చూపుకి చాలా ఫీల్ అయాడు రవీంద్ర. తన వయసు వాడి ముందే అలా పదే, పదే, అడగటం సిగ్గని పించింది రవీంద్రకి.

చాలా ఇన్‌సల్ట్‌గా ఫీల్ అయ్యాడు అతను.

తిరిగి చూసాడే కానీ మళ్ళీ మాటల్లో పడ్డాడు.... కాదు పడేసాడు రాంబాబు షాపతన్ని.

ఒక్కొక్కసారి అవతల వాళ్ళకి చాలా చిన్న విషయాలుగా కన్పించేవే, అనుభవించే వాళ్ళకి ప్రాణం పోతున్నట్టుగా ఉంటుంది.

వెనక్కి తిరిగి వెళ్ళి పోయేవాడే రవీంద్ర. కానీ అంతకు ముందే షాపతని చేతికి రెండు రూపాయల నోటు యిచ్చాడు. వాడు దాన్ని గల్లాపెట్టిలో భద్రంగా పడేసాడు అప్పుడే. దాన్ని అడిగితే యివ్వక పోగా తిట్టు లంకించు కోవచ్చు. యిటు సోడా అని యింకోసారి అడగాలంటే మొహమాటం. పోనీ వదిలేసి వెళ్ళిపోదామా అంటే అతని మధ్య తరగతి మనస_త్వం వొప్పటం లేదు.

ఇంకో రెండు నిమిషాలకి అతనికి లీలగా అర్థం అయిందేమంటే వాళ్ళిద్దరూ కావాలని తనని పట్టించుకోవట్లేదు అని. ఏడ్పిసు_న్నారని.

రెండు రూపాయలు నా దగ్గర ఉన్నాయి. ఎక్కడికి పోతాడులే అని షాపు వాడి ధీమా! అవతల వాడు యిబ్బంది పడుతూంటే, అదీ తన వలన పడుతున్నాడంటే చూసి సంతోషించే శాడిస్ట్ మెంటాలిటీ గల రాంబాబుకి యితన్ని క్రీగంట చూస్తూ_ంటే అదో రకమయిన ఆనందం.

పరిస్థితి అర్థం అయిపోయింది రవీంద్రకి.

హఠాత్తు_గా ఏదో గుర్తు_ వచ్చి కొంచెం గట్టిగా అన్నాడు రవీంద్ర. "అరె.... యిందాక నీకిచ్చిన నోటు మధ్య చిల్లుందే. మారుతుం దంటావా?" అడిగాడు అమాయకంగా.

మాట్లాడుతున్న వాడు ఆపి, "అమాయక చక్రవర్తీ_! చెప్పక పోతే చచ్చేవాడ్ని కదయ్యా నోటుతో" అనుకుంటూ వెనక్కి తిరిగి గల్లాపెట్టె తీసి నోటు చూపిస్తూ_, "యిదేనా ఎక్కడ?" అన్నాడు షాపతను.

"ఇలాతే.... చూపిస్తా_" అంటూ అందుకున్న రవీంద్ర నోటు జేబులో పెట్టుకుని కామ్‌గా బయటికి నడిచాడు.

అప్పటివరకు ఒక గేమ్ ఆడుతున్నా మన్నంత సంతోషంతో ఉన్న యిద్దరికీ, ఎవరో చెప్పుతో "ఫెడీ"మని కొట్టినట్టయింది పాపం. □

# ధర్మపథం | విద్వాంసుని లక్షణం

పాండిత్యం ఉన్న వారికి అహంభావం అధికమని సాధారణంగా కొందరు అంటారు. ఇది కొంత వరకూ యధార్థమే కావచ్చు. కాని యధార్థమైన విద్వత్తు_ కల వారు ప్రశాంతంగానే కాన వస్తా_రు. ఇతరులని అధిక్షేపించడం, తిరస్కార భావంతో చూడడం మిడిమిడి జ్ఞానం కల వారి స్వభావం.

విద్వాంసుల లక్షణం చక్కని ఉదాహరణతో కూడా ఎన్నడో ఇలా చెప్పబండి.

"గుణ దోషా బుధో గృహ్ణన్
ఇందు క్ష్వేళా వివేశ్వరః,




శిరసా ధార్యతే పూర్వం
పరం కంఠే నియచ్ఛతి."

అమృతం కోసం దేవ దానవులు పాల సముద్రాన్ని మథించినప్పుడు, మొదట ఉత్పన్నమైన హాలాహల విషాన్ని- సర్వ లోక రక్షణార్థం మహేశ్వరుడు, ఒక గుళికగా చేసికొని మ్రింగి కంఠంలోనే ఉంచుకున్నాడు. తర్వాత సముద్రంలో జనించిన చల్లని చంద్రుణ్ణి తలపై నిలుపుకున్నాడు. ఇట్లు చేసి, ఆ దేవ దేవుడు ఉత్త_మ విద్వాంసులకు ఆదర్శ మైనాడు.

అసంపూర్ణమైన విద్య నేర్చిన వారు, తాము మహా విద్వాంసులమని చెప్పు కుంటూ ప్రజలను మోస పుచ్చి ధనం సంపాదించవచ్చును. వారిని చూడగా, ఉత్త_మ విద్వాంసులకు కొంత అసంతృప్తి_ కలగడం సహజం. అయినా, వారు ఆ మోసగాండ్రకు ఎట్టి అపకారాన్నీ తలపెట్టరు. "ఎలాగో బ్రతకనీ" అని, వారిలో లోపాలను బయటికి వెల్లడించ కుండా గొంతుకలోనే అణచి వేసి, ఏ మాత్రం పాండిత్యం ఉన్నా, దానిని ప్రశంసిస్తా_రు.

ఆ పండితులు, తమ పట్ల దాక్షిణ్యం చూపుతూ మహా విద్వాంసులు తమ పాండిత్యమును ప్రశంసిసు_న్నట్లు గ్రహించక, తాము సర్వజ్ఞులమనియే భావిస్తా_రు. వీరి స్వభావం అసలు విద్వాంసుల స్వభావానికి విరుద్ధంగా ఉంటుంది. వీరు ఇతరుల గుణ గణాలను ప్రశంసించకుండా కంఠంలో ఉంచుకొనే, వారిలో అణు మాత్రం లోపం ఉన్నా గోరంతను కొండంత చేసి దుష్ప్రచారానికి పూనుకుంటారు.

ఉత్త_మ విద్వాంసుల స్వభావాన్నే మనం అలవరించుకోవాలి. ఎవరిలో నయినా మంచి వుంటే దానిని మెచ్చు కోవాలి. చెడ్డ గుణాలుంటే ఊరుకోవాలి గాని వానిని ప్రచారం చెయ్యడం సముచితం కాదు.

-బులుసు వేంకటరమణయ్య

# సినిమా

"ముద్దుబిడ్డ"లో కృష్ణ

## కె. మురారి చిత్రం "శ్రీనివాస కల్యాణం"

"కథా నాయకుని పేరు శ్రీనివాస్. అతని చుట్టూ మిగతా పాత్రలు పరిభ్రమిస్తుంటాయి గనుక, 'శ్రీనివాస కల్యాణం' అని మా 6వ చిత్రానికి పేరు పెట్టాం. ప్రతి నెలా ఏదో ఒక రకంగా కలిసి వచ్చే రెండు మూడు కోట్లను ఏం చేసుకోవాలో తెలియని బుక్కా లంబోదరం అనే ఒక విశిష్టమైన హాస్య పాత్రను మోహన్‌బాబు అద్భుతంగా పోషించారు." అన్నారు యువచిత్ర కె. మురారి. ఈయన చిత్రాలలో కథా బలంతో పాటు సంగీత సాహిత్యాలకు ఎంతటి ప్రాధాన్యత ఇవ్వబడుతుందో అందరికీ తెలుసు. ఇతివృత్తంలో అంతర్లీనంగా సన్నివేశపరంగా ఏడు మృదు మధురమైన పాటలు ఈ చిత్రంలో ఉన్నాయి. వీటిని కె. వి. మహాదేవన్ స్వరకల్పనలో వేటూరి, సీతారామశాస్త్రి, జొన్న విత్తుల రాశారు. సత్యమూర్తి కథ, మాటలు రాశారు. నందమూరి మోహనకృష్ణ ఛాయ, రావుశ్రీ సంయుక్త దర్శకత్వం, తార- శివసుబ్రహ్మణ్యం నృత్యాలు సాహుల్- రాజు సాహసాలు, జార్జి ప్రసాద్ ప్రొడక్షన్, తాతా సురేష్ కూర్పుతో కె. నరసింహం నాయుడు సమర్పించే ఈ చిత్రంలో వెంకటేశ్ సరసన భానుప్రియ, తాడిమళ్ల గౌతమి నాయికలు. గొల్లపూడి, సుధాకర్, వేలు, ప్రసాద్‌బాబు, వంకాయల, వై. విజయ, అనిత, వరలక్ష్మి, కల్పనారాయ్ ఇతర పాత్రధారులు- కోడి రామకృష్ణ దర్శకుడు.


"కృష్ణ లీల"లో కళ్యాణచక్రవర్తి, రమ్యకృష్ణ

# ...శేషాలు

_జి.వి.జి.



"రుద్రరూపం"లో కల్పన.

## "శ్రీమతి ఒక బహుమతి"లో శ్రీమతుల చర్చ

ఉమ (జయసుధ) వద్దకు దివ్య (కల్పన) వచ్చి, "ఈ వేళ నేనే వంట చేయాలనుకుంటున్నాను," అంది.

"ఇది నీ ఇల్లు - నీ ఇష్టం," అంది ఉమ.

"ఆ రోజు మీ ఇంటికి వంట చెయ్యడానికి రాలేదని గొడవపెట్టాను. ఇప్పుడొచ్చి నా అంతట నేనే చేస్తానని అడుగుతున్నాను. నా గురించి మీరేం అనుకుంటున్నారు?" అడిగింది దివ్య.

"నువ్వు మనిషంటే పెరిగావు కాని బుద్ధి పెరగలేదు."

ముఖం చిన్న బుచ్చుకుంది దివ్య. "అక్క, తమ్ముడు ఒక్కలాగే ఉన్నారు. అమెరికాలో సెటిల్ అవ్వాల్సినదాన్ని- అక్కరలేని వాళ్ళకి వంట చెయ్యాల్సి వస్తోంది... మా ఇంట్లో పెద్ద స్విమ్మింగ్ పూల్ ఉంది. ఇక్కడ బిందెడు నీళ్ళు కూడాలేవు....

మీ ఇంట్లో ఏమిటి- ఎసర్లో బియ్యం వేస్తారా, బియ్యం పోసి ఎసరు వేస్తారా"

ఉమ నవ్వుతూ, "దానికి ముందు పొయ్యి వెలిగిస్తాం," అంది.

"నాకు తెలుసు" అంటూ దివ్య వెళ్ళిపోయింది.

ఎ. వి. కె. రెడ్డి సమర్పణలో దయాకర్, కరుణాకర్ నిర్మించే పవన్ ఎంటర్ ప్రైసెస్ వారి "శ్రీమతి ఒక బహుమతి" చిత్రానికి విశు దర్శకుడు.



"శ్రుతిలయలు" నూరు రోజుల వేడుకలో శ్రీ విశ్వనాథ్, హీరో చిరంజీవి, శ్రీ టి. సుబ్బరామిరెడ్డి, హీరో రాజశేఖర్

## "శ్రుతిలయలు" శతదినోత్సవం

"చలన చిత్ర నిర్మాణంలోని అన్ని శాఖల్లోనూ పరిపూర్ణత్వం కలిగిన కె. విశ్వనాథ్‌గారు మన తెలుగు చిత్రాలకు అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించి పెట్టిన కళాతపస్వి," అన్నారు హీరో చిరంజీవి. ఎ. వి. కె. రెడ్డి సమర్పించిన సుదర్శన్ సినీ ఎంటర్‌ప్రైసెస్ వారి "శ్రుతిలయలు" చిత్రం శత దినోత్సవం ఆగస్ట్ 7 సాయంత్రం మద్రాసులోని సవేరా హోటల్‌లో అహ్లాదకరమైన వాతావరణంలో జరిగింది. పి. సుశీల జ్యోతి వెలిగించాక, శైలజ ప్రార్థనతో ప్రారంభమైన ఈ ఉత్సవానికి 'కళాబంధు' టి. సుబ్బరామిరెడ్డి ముఖ్య అతిథి. డాక్టర్ సి. నారాయణరెడ్డి అధ్యక్షత వహించారు. ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం వ్యాఖ్యాతగా వ్యవహరించారు. కథాబలం, కళాత్మక విలువలు గల చిత్రం అన్ని తరగతుల ప్రేక్షకుల ఆదరణను పొంది తీరుతుందని 17 కేంద్రాలలో వంద రోజులు అధిగమించిన ఈ చిత్రం నిరూపించిందంటూ వక్తలు శ్లాఘించారు.

"ఉత్తమాభిరుచి, సంస్కారం గల నిర్మాతలు, నటీనటులు, సాంకేతిక నిపుణులు నాకు తోడ్పడడం, నేను యజ్ఞంగా భావించి రూపొందించే చిత్రాలను సహృదయులైన ప్రేక్షకులు విశేషంగా ఆదరించడం – అంతా నా పూర్వజన్మ సుకృతం," అన్నారు డైరెక్టర్ కె. విశ్వనాథ్ తన సహజ వినమ్రతతో.

తారాగణానికి, సాంకేతిక వర్గానికి, పంపిణీదారులకు, ప్రదర్శనశాలల అధినేతలకు చిరంజీవి, ముఖ్య అతిథిగా విచ్చేసిన హిందీ నటుడు అనిల్‌కపూర్‌లు మొమెంటోలు ఇచ్చారు. ఆంధ్రులు గర్వించదగ్గ ఒక మహోన్నతమైన చిత్రాన్ని నిర్మించిన సుధాకర్, కరుణాకర్‌లకు నటి సుమలత బహుమతి ప్రదానం చేశారు. కృష్ణా జిల్లా పంపిణీదారులు ఎస్. కె. మూవీస్ తరఫున మొమెంటోలు అందజేసిన గీతా సుబ్బారావు వందన సమర్పణతో ఈ నూర్రోజుల పండుగ ఎంతో విశిష్టమైన రీతిలో జరిగింది.

## సినిమా
## శ్రీ యార్లగడ్డ శంభుప్రసాద్ అవార్డుల బహూకరణ

"అఖిల భారత నటీమణిగా ఖ్యాతినార్జించిన స్వర్గీయ సావిత్రి మెమోరియల్ అవార్డ్ అందుకోవడం నిజంగా నా పూర్వజన్మ సుకృతం" అన్నారు శోభన్‌బాబు ఆగస్ట్ 4న.

శ్రీ యార్లగడ్డ రాజ్యలక్ష్మి వెంకన్న చౌదరి కళాపీఠం మేనేజింగ్ ట్రస్టీ శ్రీ యార్లగడ్డ శంభుప్రసాద్ తమ జన్మదినోత్సవం సందర్భంగా నిర్వహించే అవార్డుల బహూకరణలో శోభన్‌బాబుకి, షావుకార్ జానకి చేతులమీదుగా సావిత్రి స్మారక అవార్డు అందజేయబడింది.

"వితరణశీలి అయిన తండ్రిగారి అడుగుజాడల్లోనే తనయుడు శ్రీ శంభుప్రసాద్ పేద కళాకారులకు ధన సాయం చేయడం ఎంతో ముదావహం" అన్నారు ఎం. ఎస్. రెడ్డి. పేద కళాకారులకు శ్రీ నందమూరి త్రివిక్రమరావు చేతులమీదుగా చెక్కులు అందజేయబడ్డాయి. తెలుగులో అత్యధికమైన మార్కులు పొందిన ఇద్దరు కళాశాల విద్యార్థినులకు తలా 500 రూపాయల చొప్పున చెక్కులు అందజేయబడ్డాయి. శ్రీ బి. ఎస్. ఆర్. కృష్ణ స్వాగతోపన్యాసం, ప్రముఖ రాజకీయవేత్త శ్రీ బెజవాడ గోపాలరెడ్డి చివరి ఉపన్యాసం మధ్య నాగభైరవ కోటేశ్వరరావు రచించి, దర్శకత్వం వహించిన "కవన విజయం" ప్రదర్శన ప్రేక్షకులను రంజింపజేసింది.

చాలా సంతోషం బ్రదర్! సినిమాలో శృంగారం లేనిలోటు నువ్వు తీరుస్తున్నావు!



## దర్శక – నిర్మాత క్రాంతికుమార్ తాజా చిత్రం

"విద్యాలయాల్లో జొరబడుతున్న కలుషిత రాజకీయాలు, నేటి సమాజంలో స్త్రీకి అడుగునా జరుగుతున్న అన్యాయాలు వగైరా సమకాలీన సమస్యలతో అల్లబడిన ఇతివృత్తం. మహిళాలోకాన్ని జాగృతంచేసే ఒక డైనమిక్ పాత్రను శారద పోషిస్తున్నారు. జులై 31 నుంచి ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుంది. అక్టోబర్ 2 గాంధీజయంతినాడు విడుదల" అన్నారు క్రాంతికుమార్. ఈయన స్వీయ దర్శకత్వంలో నిర్మిస్తున్న శ్రీ క్రాంతి చిత్రవారి పై చిత్రంలో మోహన్, స్వాతి, జె. వి. సోమయాజులు, పి. జె. శర్మ, నవనటులు గుంటూరు శాస్త్రి, శ్యామ్, డి. అప్పారావు పాల్గొంటున్నారు. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, రామచంద్రసింగ్ శిల్పం, నాగండ్ల సంయుక్త దర్శకత్వం, గుణశేఖర్ సహకార దర్శకత్వం, రామచంద్ర సారిక ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు.

## శోభన్‌బాబు–రాధలతో రాఘవేంద్ర సినీ క్రియేషన్స్

"సెప్టెంబర్ 21న ప్రారంభోత్సవం" అన్నారు గతంలో "శ్రీవారు", "కొంగుముడి", "చక్కనోడు" చిత్రాలు నిర్మించిన కందేపి సత్యనారాయణ. ఈయన కొత్త చిత్రంలో శోభన్‌బాబు, రాధ, సత్యనారాయణ, గొల్లపూడి, వై. విజయ, అన్నపూర్ణ వగైరా తారాగణం. కోడి రామకృష్ణ దర్శకుడు.

## దాసరి దర్శకత్వంలో జయసుధ చిత్రం "మోడల్"

"అక్టోబర్ నుంచి షూటింగ్" అన్నారు కళాప్రపూర్ణ దాసరి నారాయణరావు. ఈయన రచన, దర్శకత్వంలో సూర్యదేవర రామమోహన్‌రావు నవల "మోడల్"ను జె. ఎస్. కె. కంబైన్స్‌వారు తెరకెక్కిస్తారు. జయసుధ, కమల్‌హాసన్, రఘువరన్, రజని వగైరా తారాగణంతో జయసుధ సమర్పణ.



"అగ్నిపుష్పం"లో సీత

## బి. విఠలాచార్య దర్శకత్వంలో "శ్రీ దేవి కామాక్షి కటాక్షం"

"మొదటి షెడ్యూల్ జులై 31 నుంచి ఆగస్ట్ 16 వరకు జరిగింది. ఆ తర్వాత సెప్టెంబర్, అక్టోబర్‌ల రెండు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది. ఈ చిత్రంలో గొర్రె, పొట్టేలు, గుఱ్ఱం, నంది, నెమలీ, పాములు కూడా పాల్గొంటున్నాయి" అన్నారు బి. విఠలఆచార్య. ఈయన దర్శకత్వంలో ప్రముఖ తిరపతి ఎగ్జిబిటర్ ఐ. ఎస్. వాసు నిర్మించే కృష్ణవేణి ఆర్ట్ పిక్చర్స్‌వారి పై చిత్రంలో వినోద్, అరుణ, రాజ్యలక్ష్మి, సాగరిక, సీత, కాంచన, కె. ఆర్. విజయ, సత్యనారాయణ, సారధి, మాడా, మల్లాదిశాస్త్రి నటిస్తున్నారు. కర్పూరపు ఆంజనేయులు మాటలు, దుత్తలూరి రామారావు పాటలు, పార్థసారధి సంగీతం, హెచ్. ఎస్. వేణు ఛాయ, జయకృష్ణ సంయుక్త దర్శకత్వం, కృష్ణయ్యంగార్ – పార్థసారధి ప్రొడక్షన్, బాలు కూర్పు నిర్వహిస్తున్నారు. □

మీరన్నట్టూ.. మొన్నటివరకూ ఖాళీగానే వున్నాయి! అదేమిటో!..
ఆ బోర్డు పెట్టేసేకా ఫ్లాట్స్ అన్నీ టకటకా అమ్ముడు అయిపోయాయి!

ఫ్లాట్స్ అమ్మబడును
ఈ ఫ్లాట్స్ ప్రియా సిమెంట్ తో కట్టబడును.
CONTACT:

# This is not just another reference book




THE PATRIKA YEAR BOOK is of course full of Facts and Figures!

It gives plenty of them.

Important and up-to-date information about the countries of the world.

* Populations
* Natural Resources
* Industrial Production
* Per Capita Income
* Life Expectancy
* Brief Histories
* Flags of the Nations

There are simple and clear maps.

All this information makes it a useful reference book.

But the PATRIKA YEAR BOOK OF FACTS AND FIGURES 1987 AND STUDENTS' GUIDE gives much more!

Candidates preparing for examinations – IAS Preliminary, Bank Services, Service Commissions etc., will find in it concise but informative essays on a variety of topics.

Social Sciences
* Economics
* History
* Geography
* Political Science

Also on
* Computers
* Pollution
* Nobel Prizes
* Labour & Industrial Law
* Rural Development
* Sports and Games

Physical Sciences
* Chemistry
* Physics

Natural Sciences
* Botany
* Forestry
* Zoology

A useful section on General Knowledge is also included.

This is not all!

There are representative Model Question Papers which candidates appearing for various examinations will find quite helpful.

It is priced moderately at Rs. 25

All you have to do is to fill up the coupon in this advertisement and send it with your remittance.

307

**Andhra Patrika**
Gandhinagar
Vijayawada 520 003

The Patrika Year Book will be delivered by post or through our agents.

**RUSH YOUR ORDER NOW!**

I want the 1987 Patrika Year Book of Facts and Figures. Send me copies @ Rs. 25/- each. I enclose DD/IPO/MO for Rs.

Name ____________________

Address ____________________

____________________

Send this coupon to: Andhra Patrika, Gandhinagar, Vijayawada 520 003.



# శతచిత్ర నటి సుమలత సమాధానాలు!

**వై. చెన్నకేశవులు నాయుడు, కాళహస్తి**

ప్ర : శ్రీ అక్కినేని నాగేశ్వరరావు నటనపై మీ అభిప్రాయమేమిటి?

జ : మహోన్నతమైన శిఖరాలను అందుకున్న వారు అభిప్రాయాలకు అతీతులు.

**రేణుశ్రీ, చెన్నూరు**

ప్ర : చందనపు బొమ్మకు, చక్కని తారామణికి తేడా ఏమిటండోయ్?

జ : అందచందాలలో, రూపు రేఖల్లో ఒకదానికొకటి తీసిపోక పోయినా– ఎటొచ్చీ మొదటిది నిర్జీవమైనది, రెండవది సజీవమైనది..... కదండీ?

**వై. హైమావతి, పాకాల**

ప్ర : భగవంతుడు గులాబీలతో పాటు ముళ్ళను కూడా సృష్టించడం అన్యాయం కాదా?

జ : అలా కాక ముళ్ళతో పాటు గులాబీలను సృష్టించాడనుకొని మనం ఎందుకు సంతృప్తి చెందకూడదు?

**ప్రభల సంజీవయ్య, పాలకొల్లు**

ప్ర : ఇక్కడ ఒకతనికి మీరంటే ఎంతో పిచ్చి. దానికి మందేమిటి?

జ : అభిమానానికి మందెక్కడుంటుంది?

**షేక్ రహింతుల్లా, కాశీబుగ్గ**

ప్ర : సినిమాలో నటించాలనెడి అభిలాషగల సుందరమగు యువతీ యువకులు మన రాష్ట్రమున ఎందరో చీకట్లో ఉండగా - పాత నటీనటులే వెండి తెర మీద ఎందుకు రాణించుచున్నారు?

జ : నిధి నిక్షేపాలెప్పుడూ భూగర్భంలోనే మరుగు పడి ఉంటాయి, వాటి దురదృష్టం అది. చెలామణీ అయ్యే నాణేలే వెలుగును చూస్తుంటాయి. వీటి అదృష్టం ఇది.

**ఎన్. తులసీదాసు, భీమడోలు**

ప్ర : పాఠకుల ప్రశ్నలకు మీ జవాబులు ఎంతో చక్కగా ఉంటున్నాయి. ఆ జవాబులున్న పేజీలను చించి సేకరించడం నా హాబీ. మరి, మీ హాబీ ఏమిటి?

జ : మీ హాబీకి సహకరించడం.

## ఉత్తమ ప్రశ్న

**ఉరిటి కృష్ణవేణి, గుమ్మలక్ష్మిపురం**

ప్ర : ఆడది అర్ధరాత్రి నిర్భయంగా తిరిగే రోజు వస్తుందంటారా?

జ : వచ్చినా – అసలు ఆడది అర్ధరాత్రి ఎందుకు తిరగాలి?

**ఎల్. జి. రమణి, పూండీ**

ప్ర : అర్ధరాత్రి హఠాత్తుగా నిద్ర లేచి గుక్క తిప్పుకోకుండా ఏడుస్తున్న పసిపాపను చూసినప్పుడు మాతృహృదయం ఎలాంటి అనుభూతిని పొందుతుంది?

జ : పక్కన మొద్దు నిద్ర పోతున్న భర్తకు మెలకువ వస్తే, ఎలాటి కేకలు వినవలసివస్తుందోనని గిజగిజలాడుతూంటుంది.

**ఎం. ఎస్. రావు, జమ్మికుంట**

ప్ర : నా అభిమాన తారామణీ! విమర్శకులనగా నెవరు?

జ : ప్రతి వారూ ప్రతి విషయాన్నీ విమర్శిస్తున్న ఈ రోజుల్లో విమర్శకులు కాని వారెవరు?

**గాజుల చిన కామేశ్వరరావు, ధర్మవరం**

ప్ర : హీరోయిన్ లేకుండా సినిమా తీస్తే.... ?

జ : మీరూ, మీ మిత్రులూ చూస్తారా?

**బి. డేవిడ్, మార్కాపురం**

ప్ర : సుమగారూ! 'కల' అనగానేమి?

జ : ఆకృతి దాల్చని తీరని కోరిక.

**నీరుమంచి ఆంజనేయులు, పాలకొల్లు**

ప్ర : మేడమ్! ఈ కలియుగం ఎప్పుడు అంతమవుతుందంటారు?

జ : ఆ గొడవేదో భగవంతుడే చూసుకుంటాడు. అంతవరకు మన ముండముగా! అంచేత, మనకెందుకులెండి.

**ఆచంట కృష్ణవేణి, సీతాఫల్‌మండి**

ప్ర : లతగారూ! అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్య ఇంట ఉండగా కొందరు ప్రబుద్ధులు అన్యస్త్రీల వెనుక తిరగడానికి కారణము సినిమాలు చూసి చెడిపోవుట వలననే అని నేనందును. మీరేమందురు?

జ : సినిమాలు రాక పూర్వం అలాంటి ప్రబుద్ధులు ఉండే వారు కారంటారా, సోదరీ? □

కూపన్

### ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## సుమలత సమాధానాలు

ప్రశ్న.............................................................

.............................................................

.............................................................

పంపినవారి పేరు.............................................................

పూర్తి చిరునామా.............................................................

# అభిమాన తారలపై అభిప్రాయం

**నే**డు ఆరు కోట్ల తెలుగు ప్రజలచే అయిదుసార్లు సూపర్‌స్టార్ గా ఎన్నుకోబడిన సూపర్ స్టార్ కృష్ణ నా అభిమాని తెలుగు చిత్ర సీమలో నటశేఖరుడైన కృష్ణగారికి ఓ ప్రత్యేక స్థానము ఉంది ఆయన ధైర్యానికి సాహసానికి మరో పేరు అందుకే కృష్ణగారు అంటే నాకు ఎక్కువ అభిమానము ఒక



మనిషి మహామనిషి కావాలంటే దాని వెనుక కృషి పట్టుదల నిరంతర శ్రమ అవసరం వాటి రూపకల్పనే సూపర్ స్టార్ కృష్ణ మొట్టమొదటి సారిగా చూసిన అల్లూరి సీతారామరాజు సినిమా నాకు ఎంతో నచ్చింది ఆ సినిమాలో ఆయన అద్భుత నటన ఇప్పటికీ మరచిపోలేక పోతున్నాను గతంలో ఎన్నో చిత్రాలలో అద్భుతంగా నటించి తనకు తానే సాటి అనిపించుకున్న కృష్ణ ఇకమీదట కూడ మంచి కథాబలం గల చిత్రాలలో నటించి అభిమానులను ప్రేక్షకులను ఆనందపరచ వలసిందిగా ఈ అభిమాని చిన్న కోరిక

**– దంట్ల దాసు, పిఠాపురం**

* * *

**చ**క్కని ముఖ వర్చస్సు దానికి తగిన శరీర సౌష్ఠవము కలిగి తన శృంగార నృత్యాలతో ప్రేక్షకుల హృదయాలను గిలిగింతలు పెట్టే జయమాలిని నా అభిమాన తార ఒకప్పుడు జయమాలిని డాన్స్ లేని సినిమా లేదు అంటే అతిశయోక్తి కాదు ఆమె డాన్స్ సినిమాకి ఒక ఎస్సెట్‌గా నిర్మాత దర్శకులు భావించేవారు ఆమె డాన్సు ఉంటే ప్రేక్షకులు కూడ విరగబడి చూసేవారు నేను కూడ ఆమె డాన్సు ఉన్న సినిమాను తప్పక చూస్తాను కేవలం శృంగార నృత్యాలకే కాక జగన్మోహిని కన్యాకుమారి ఇంకా



కొన్ని జానపద చిత్రాలలో నటించి అవకాశం ఇస్తే తాను నటిగా కూడ రాణించగలనని ఆమె నిరూపించింది

ప్రస్తుతం ఆమె ఇది వరకు లాగా నృత్య సన్నివేశాలలో ఎక్కువగా కనిపించక పోయినా అప్పుడప్పుడు నటించి నా వంటి అభిమానులను ఆనందపరుస్తోంది

ఆమె తన శరీర సౌష్ఠవాన్ని కాపాడుకుంటూ డాన్సులతో పాటు తగిన పాత్రలను కూడ పోషించి, నా వంటి అభిమానులను సాధ్యమయినంత కాలం సంతోషపరుస్తారని ఆశిస్తున్నాను

**–జె ఆత్మారామ్, హైదరాబాద్**

* * *

**సు**ప్రీమ్ హీరో చిరంజీవి నా అభిమాన కథానాయకుడు మనవూరి పాండవులు చిత్రంలో చిన్న పాత్రలో కనిపించి కోతల రాయుడు మొగుడు కావాలి చిత్రాలతో హీరోగా మారి చట్టానికి కళ్ళు లేవు పున్నమినాగు చిత్రాలతో ప్రేక్షకులకు దగ్గరయి ఇంట్లో రామయ్య – వీదిలో కృష్ణయ్య శుభలేఖ చిత్రాలతో అన్నిరకాల పాత్రలు పోషించగలనని నిరూపించుకుని ఖైదీ చిత్రంతో ప్రజల హృదయాలను తన స్వంతం చేసుకున్న చిరంజీవి బాక్సాఫీస్ రికార్డులను బద్దలు కొట్టే చిత్రాల నాయకుడిగా కొత్త ట్రెండ్‌ను క్రియేట్ చేసి ఈ రోజున అగ్రకథానాయకుడిగా వెలుగొందు తున్నాడు ఆయన ఈ మధ్య తీసుకుంటున్న



నిర్ణయాలు అభిమానులను ఎంతో ఆకట్టుకుంటు న్నాయి కోటి రూపాయల వ్యయంతో చారిటబుల్ ట్రస్ట్ తెరవడం, పిల్లల కోసం చిత్రం నిర్మించటం మొ నవి ఈ మధ్య ఒకే రకమైన మూస పాత్రలలో నటించకుండా చంటబ్బాయ్ దొంగ మొగుడు ఆరాధన, చక్రవర్తి స్వయంకృషి మొ న చిత్రాలలో వివిధ తరహా పాత్రలను పోషించి ఆంధ్రుల ఆదరాభిమానాలను పొందున్న ఘనత ఒక్క చిరంజీవికే దక్కుతుంది

**ఎ శ్రీనివాసరావు, ద్రాక్షారామ**

* * *

**నా** అభిమాన నటి అభినేత్రి భానుప్రియ ఆమె మొదటి చిత్రం సితార" చూసి ఆమె నటనకు ముగ్ధుడనయి ఆమె అభిమానిగా మారాను నాటి సితార నుండి నేటి శంఖారావం వరకు అనేక 'విభిన్నమయిన పాత్రలు పోషించి నటనలో ఉన్నత శిఖరాలను అధిరోహించి ప్రేక్షకుల హృదయాలలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్న భానుప్రియ అంటే నాకు ఎంతో ఇష్టం సితార జేమ్స్‌బాండ్ 999 అమెరికా అల్లుడు ఆలాపన, అన్వేషణ శ్రావణ మేఘాలు గృహలక్ష్మి చక్రవర్తి "కార్తీక పౌర్ణమి" శంఖారావం చిత్రాలు భానుప్రియ నటనకు తార్కాణం ఎటువంటి భావాన్నయినా తన కళ్ళతో చెప్పగల ఏకైక నటి భానుప్రియ ఎక్కువగా కథాబలం గల చిత్రాలలో నటించాలని భానుప్రియకు ఒక అభిమానిగా నా సలహా



కమలహాసన్‌తో జంటగా నటిస్తే చూడాలని నా కోరిక

**– టి జగన్ మోహన్, హిల్ కాలనీ**

* * *

**చి**రంజీవి గారంటే నాకెంతో అభిమానం ఆయన దాదాపు ఇప్పటి వరకు 90 చిత్రాలలో నటిస్తే నేను ఇంతవరకు 65 చిత్రాలు చూశాను

1978సం లో ప్రాణం ఖరీదు తో చలన చిత్ర పరిశ్రమలో ప్రవేశించి పార్వతి పరమేశ్వర్లు తో శ్రీరస్తు శుభమస్తు అని దీవెనలను అందుకొని తాయారమ్మ బంగారయ్య లతో బంధాలు అనుబంధాలు పెంచుకొని అందమైన అమ్మాయిలతో ప్రేమ నాటకం ఆడి ఆడవాళ్ళు మీకు జోహార్లు అంటు వాళ్ళని ప్రేమ పిచ్చోళ్ళు చేసి ఇంట్లో రామయ్య వీదిలో కృష్ణయ్య లా ప్రియ చండిప్రియ అంటు పట్నం వచ్చిన ప్రతివ్రతలు తో మంచు పల్లకి నెక్కి 47 రోజులు లో ఆలయ శిఖరం చేరి అందరిచే శివుడు శివుడు శివుడు అనిపించుకొని తిరుగు లేని మనిషి లా పేరు పొంది ఊరికిచ్చిన మాట కోసం పల్లెటూరి మొనగాడు గా మారి రాణీ కాసుల రంగమ్మ తో ప్రేమ తరంగాలు సాగించి తోడు దొంగలు గా చట్టంతో పోరాటం చేసి చట్టానికి కళ్ళు లేవు అని నిరూపించి తాతయ్య ప్రేమ



లీలలు పొంది విజేత గా అభిమానుల ఆరాధన తో తిరుగులేని హీరో అయ్యాడు చిరంజీవి

తన స్వయం కృషి తో ప్రాణానికి ప్రాణం ఇస్తూ చక్రవర్తి లా చిత్ర పరిశ్రమకు రథ సారధి మా మంచి దొంగ

**–టి క్రాంతికుమార్, వనపర్తి** □

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా, ఆరోగ్యంగా ఉంటాయి కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే, వారికది యివ్వడం అందుకే

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారీ, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన,దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్నీ, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది



క్రమం తప్పకుండా కోల్గేట్‌తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోపాటే దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను

భోజనం చేసిన తర్వాత ప్రతిసారీ మీ కుటుంబంలో వారంతా కోల్గేట్‌తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి దంతక్షయాన్ని ఎదుర్కోండి వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




B84 55 Tel

**దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!**




"ఎక్స్క్యూజ్ మి

బుచ్చిబాబు 'చివరికి మిగిలేది' పుస్తకం చదువుతున్నవాణ్ని, పిలుపు వినిపించిన వైపు చూశాను గుమ్మంలో నిలబడి ఉన్నదామె రండి కూర్చోండి అంటూ లోనికి ఆహ్వానించాను

ఆమె పేరు మాధవి సుమారు ముప్ఫై ఐదు సంవత్సరాల వయసుఉంటుంది ఎర్రటి రంగుతో, చాలా నాజూకుగా ఉంది. చూసేవారిని ఎంతో ఆకర్షింప జేస్తూ, అందగత్తెల జాబితాలో చేర్చతగినది ఏదో ప్రయివేటు కంపెనీలో పని చేస్తూ, ఐదారు వందలు సంపాదించుకుంటోంది తన ఇద్దరు కొడుకులతో మా ప్రక్క వాటాలో అద్దెకుంటుంది ఆమెకు పుస్తకాలు ఎక్కువగా చదివే అలవాటుందని తెలిసి, నేను వ్రాసిన కొన్ని కథలు ఇచ్చి, అభిప్రాయం చెప్పమన్నాను

చదివారా? ఎలా ఉన్నాయి? ఆమె అందించిన కథలు తిరిగి తీసుకుంటూ అడిగాను

. మీరు మరోలా అనుకోనంటే నా అభిప్రాయం చెప్తాను అందులో నాకే కథా నచ్చలేదు నిర్మొహమాటంగా చెప్పింది

నా మనస్సు చివుక్కు మన్నది సహజంగా ఏ రచయిత అయినా పాఠకుల నుండి తన కథకు ఖచ్చితమైన అభిప్రాయాన్నే కోరతాడు కథ ఏమీ బాగోలేదనే అభిప్రాయాన్ని నిండు మనసుతో స్వీకరించలేడు నేనూ అలాగే ఫీలయ్యాను

అందులో మీకు నచ్చనివి ఏమిటో చెప్పండి సబబు అనిపిస్తే మరోసారి తప్పక జాగ్రత్త పడతాను సిన్సియర్‌గానే అన్నానేను

నాకు మొహమాటం లేకుండా మాట్లాడటం అలవాటు దయచేసి మీరేమీ అనుకోవద్దు మీ కథ నడిపే తీరు పాత్రల ఔచిత్యం ఎందుకో మరినాకు నచ్చలేదు నిజం చెప్పాలంటే నాకు సుదీర్‌గారి రచనలు తప్ప మరేవీ నచ్చవు అంది

ఆయన దంతా బి సి నాటి పద్ధతి మారే కాలంతో పాటు మనమూ మారాలి అలాగే రచనలలో కూడ ఇన్ని రకాల మార్పులొస్తుండగా ఆయన తన పాత పద్ధతిలోనే వ్రాస్తారు మీరూ ఆ చెత్త రచనలు ఇష్టపడతారంటే ఆశ్చర్యంగా ఉంది అన్నాను అవకాశం దొరికింది కదా అని ఆమె అబిమానం మీద దెబ్బ తీశాను

దయచేసి నాముందు ఆయన్ను గాని ఆయన రచనలను గానీ ఏమీ అనకండి నేను భరించలేను అనేసి విసవిసా వెళ్ళి పోయింది

నాకూ సుధీర్ గారి రచనలపట్ల మంచి అభిప్రాయమే ఉంది కేవలం ఆమె అబిమానాన్ని దెబ్బతీయాలని అలా మాట్లాడాను ఆమె సుదీర్ అబిమాని కాదు దుంభిమాని తెండిగడవటం కష్టంగా ఉన్నా ఆయన పుస్తకాలు కొని మరీ చదువుతుంది ఆమె ఒక విచిత్రమైన మనిషి ఆమెతో పరిచయం కాక ముందు, ఒక రోజు బోర్ కొడుతుంటే ప్రొద్దున్నే మా ఫ్రెండ్ పుస్తకాల షాపు కెళ్ళి కూర్చున్నాను అక్కడకు వచ్చిందామె

సుధీర్ గారి సుడి గుండాలు నవల వచ్చిందాండీ అని అడిగింది

లేదండీ ఇంకారాలేదు

ఈరోజు వస్తుందన్నారుగా అన్నది

అవునండీ ఈరోజు రిలీజ్ చేస్తామన్నారు బహుశా సాయంత్రం వరకు రావచ్చు వస్తే ఇస్తాను సాయంత్రం రండి అన్నాడు

ఒక వేళ వస్తే ఒక కాపీ తీసి ఉంచండి అంటూ డబ్బుకట్టి వెళ్ళింది

మాషాపుకు ఎంతో మంది వస్తుంటారు కదా ఈమెలాగా పుస్తకాల పిచ్చి ఉన్న వాళ్ళను నేనెవరినీ చూడలేదురా సుదీర్ గారి పుస్తకం వస్తోందంటే ఇలా డబ్బుముందే కట్టి వెళుతూ ఉంటుంది అన్నాడు నాతో మావాడు నవ్వుతూ

మనిషి కొక పిచ్చి మహిలో సుమతీ అని ఊరికే అనలేదు సినిమా హీరోలకీ క్రికెట్ ఆటగాళ్ళకు అబిమానులున్నట్లే రచయితలకు కూడ ఇలాంటి వాళ్ళు ఉంటారు అన్నాన్నేను కొంతసేపు కూర్చుని వచ్చేశాను

ఆరోజు రాత్రి భోంచేసి అరుగు మీద సిగరెట్ కాల్చుకుంటూ కూర్చున్నాను వాళ్ళ వాటాలో నుండి మాటలు వినబడుతున్నాయి తల్లీ కొడుకులు మాట్లాడు కొంటున్నట్లున్నారు

అమ్మా, స్కూలు పీజు కట్టటానికి రేపే లాస్ట్ డేట్

ఇప్పుడు డబ్బుల్లేవురా లేట్ పీజుతో కడుదువు గానిలే

లేట్ పీజుతోనే రేపు లాస్ట్ డేటమ్మా ఇంతకుముందు అడిగినప్పుడూ ఇలాగే అన్నావు మా హెడ్మాష్టరు పిలిచి మరీ చెప్పారు పీజు కట్టకుండా రేపు స్కూలుకు రావద్దని అన్నాడు

అబ్బ' నన్ను విసిగించకు చదువుకుంటుంటే మద్య నీదోగోల అంతగా స్కూలుకు రానియ్యక పోతే మానేసెయ్ పో అవతలికి వెళ్ళు అని కసిరింది

ఇప్పుడా బోడి పుస్తకం కొనుక్కు రాక పోతే ఏం పోయేది? ఆడబ్బుల్తో నాకు ఫీజు కట్టవచ్చుగా నేనెప్పుడు పుస్తకాలకడిగినా, ఫీజుల కడిగినా లేవంటావు కానీ నీకు నవలలు కొనుక్కోవ టానికి మాత్రం ఉంటాయి ఏడుస్తూనే అడిగాడు

నోర్ముయ్ వెధవా' వేలెడు లేవు నువ్వు నన్ను అడిగే వాడివా? పైగా సుధీర్ గారి పుస్తకాన్ని బోడిపుస్తకం అంటావా? అంటూ ఒక్కటి పీకింది ఇంకా ఎక్కువగా వాగావంటే వీపు చిట్లుతుంది నా అలవాట్లను ప్రశ్నించ వద్దని లోగడ నీకు చాలా సార్లు చెప్పాను అయినా ఫీజు కోసం నేను చాలా చోట్ల అప్పు అడిగాను ఎక్కడా దొరకలేదు రేపు నేను వచ్చి మాట్లాడతాను అంతగా స్కూలుకు రానియ్యక పోతే వచ్చే సంవత్సరం చదువుదువు గాని పోయి పడుకో అని కోప్పడింది

ఆ సంబాషణ విని నేను అవాక్కయ్యాను పిల్లల ఫీజు కట్టటానికి లేకపోయినా అడ్వాన్సు డబ్బిచ్చి మరీ పుస్తకాలు కొనుక్కొనే ఆమె దురబిమానానికి నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు మర్నాడు వాళ్ళబ్బాయిని పిలిచి అడిగాను

రవీ, రాత్రి మీ అమ్మగారెందుకు కేకలేస్తున్నారు?

స్కూలు పీజుకు డబ్బడిగితే లేవంది అన్నాడు నెమ్మదిగా తలవంచుకొని

ఇంటి విషయాలు నాలాంటి పరాయి వాళ్ళకు చెప్పటానికి ఇష్టపడని అతని మనస్తత్వం వినయం, పొందిక చూసి నాకు ముచ్చటేసింది

రవీ, నీకు అభ్యంతరం లేకపోతే, నీ ఫీజుకు నేను డబ్బులిస్తాను అన్నాను

థాంక్సంకుల్ అమ్మ నడిగి వస్తాను అంటూ లోనికి పరుగెత్తి కెళ్ళి వచ్చాడు అతని వెనకాలే ఆమె కూడ వచ్చింది

మిమ్మల్ని ఎవరడిగారని సహాయం చేస్తున్నారట? అన్నది కొంచెం కోపంగానే

క్షమించండి రాత్రి అరుగు మీద కూర్చుంటే మీ సంబాషణ విన్పించింది పిల్లవాడి కెరియర్ దెబ్బతింటుందని నేను ఇస్తానన్నాను ఊరికే సహాయం చేసే స్తోమత నాకూలేదు మీకు డబ్బురాగానే ఇచ్చేయండి ఆ తర్వాత మీ యిష్టం కొంత నిష్ఠూరం ధ్వనించే టట్లుగా అన్నాను

చాల థాంక్సండీ పరిచయం లేని వాళ్ళ వద్ద అప్పు తీసుకోవటం నాకిష్టముండదు అందుకే అలా కటువుగా మాట్లాడాను ఏమీ అనుకోవద్దు రేపు పస్టుకు తిరిగి ఇచ్చేస్తాను' అన్నది

అలాగే మీ ఇష్టం అంటూ పర్సుతీసి డబ్బు ఇచ్చాను తీసుకొని వెళ్ళబోతూ తిరిగి అన్నది

రాత్రి మా అబ్బాయి మీద చెయ్యి చేసుకోవటం తెలిసి బహుశ మీరు నన్ను రాక్షసి అనుకోవచ్చు నాకు సుదీర్ గారంటే ఆరాదనాబావం ఆయనను గాని ఆయన పుస్తకాలను గాని, ఏమైనా అంటే భరించలేను అందుకే అలా ప్రవర్తించాను అని వెళ్ళి పోయింది

అలా మా మధ్య పరిచయం ఏర్పడి క్రమంగా పెరిగింది ఆమె పరిచయంలో, ఎన్నో ఎదురు దెబ్బలు తిన్న మనిషి అనిపించింది తన సంసారాన్ని చాల గుట్టుగా నడుపుకుంటుంది. ఆమె కాళీ చిక్కినప్పుడల్లా ఏవో పుస్తకాలు చదువుతుంటుంది. అందుకే నా కథలు ఇచ్చి అభిప్రాయం చెప్పమన్నాను అలా సూటిగా చెబుతుందని ఊహించలేదు

నా పాత ఆలోచనల నుండి వర్తమానంలోకి వచ్చి, మిగిలిపోయిన "చివరకు మిగిలేది" పూర్తి చేసి నిద్ర పోయాను

★ ★ ★ ★ ★

ఒకరోజు కూర్చొని సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నాము నేనూ, ఆవిడ

"మాధవి గారూ, నేనొక థీమ్ చెబుతాను దాని ఎండింగ్ ఎలా ఉంటే బాగుంటుందో చెప్తారా?" అన్నాను

ఆమె నిరాసక్తంగా నవ్వి 'ఏదైనా క్రొత్త కథా? చెప్పండి" అన్నది

"ఒక పెళ్ళయిన నిరుద్యోగి ఉద్యోగం కోసం చాలా పాట్లు పడి, చివరకు తన మామ గారి సహాయంతో, విదేశంలో ఒక ఉద్యోగం సంపాదిస్తాడు అక్కడ అనుకోని, తప్పనిసరి, పరిస్థితులలో మరొకామెను పెళ్ళి చేసుకోవాల్సివస్తుంది ఇద్దరు భార్యల మధ్య చాలా అవస్థలు పడుతుంటాడు అలా కొంత కాలం గడుస్తుంది చివరకు ఇద్దరు భార్యల్లో ఒకరిని చంపేసి కథ ముగించాలి". ఎవరిని తొలగిస్తే బాగుంటుందో చెప్పండి" అన్నాను

నాకు అసలు ఆ ప్లాటే నచ్చలేదు" అన్నది రవీమని తడుముకోకుండా

నేను కథ చెప్పినంత సేపు పట్టలేదు ఆమె అభిప్రాయం వినేందుకు అవున్లెండి మీ దృష్టిలో కేవలం సుధీర్ గారే రచయిత మిగిలిన వాళ్ళెవరూ రచనలు చేసేందుకు అర్హులు కారు' అన్నాను నిష్టూరంగా

ఇందులో ఆయన ప్రస్తావన అనవసరం అయినా వచ్చింది కాబట్టి చెబుతున్నాను ఇలాంటి అర్థం లేని ఆలోచనలతో ఆయనెప్పుడూ వ్రాయరు'అన్నది

మీరు ఆయన అభిమానులు, గనుక అలా అంటున్నారు కానీ ఆయన నవలల్లో కథల్లో, పేజీకొక తలనెప్పి మాత్ర ఖర్చు అయ్యేవి చాలా ఉన్నాయి అన్నాను

వెంటనే ఆమె ముఖంలో రంగులు మారిపోయాయి చాలాచిన్న బుచ్చుకున్నది ముఖమంతా ఎర్రగా మారిపోయి, ముక్కు పుటాలు అదురు తుండగా అన్నది "జీవితం అనే ఆటలో మగవాడు ఆడదాని మనసుతో ఆడుకుంటూనే ఉన్నాడు ఆమె బ్రతుకు చివరకు హత్య, ఆత్మహత్యలతో నే ముగుస్తుంది స్త్రీని ఉన్నతంగా చూసె సమాజం కుళ్ళి పోయి చాలా కాలమైంది అట్లాంటి సమాజంలో స్త్రీకి అంతకన్నా విలువెక్కడుంది లెండి? అందులో మీలాంటి వాళ్ళవల్ల మరీనూ'

"అయామ్ ఎక్స్ట్రీమ్లీ సారీ. నేను మిమ్మల్నేమి అన్నానండీ?" గాబరాగా అడిగాను ఆమె ఆవేశం చూసి ఆమెకు కోపమొచ్చిందేమో నని భయంగా నేనేమి తప్పుగా మాట్లాడానో నాకే అర్థం కాలేదు

"నేను మాట్లాడేది మీరు చెప్పిన కథ గురించి అందులో మగవాణ్ణి నమ్ముకున్న ఇద్దరు స్త్రీలను సృష్టించి, చివరకు ఒక పాత్రను చంపి ఆనందిస్తారు. అలాంటి స్థితి కల్పించిన మగవాడికి బానిసగా మీరు రచనలలో కూడ స్త్రీని రచ్చకీడ్చి హింసించి ఆనందిస్తారు రచయితగా" అని కొంత సేపు ఆగి ఆవేశం కొంత తగ్గించుకొని "సారీ నాకు మీ పై ప్రత్యేక మైన కోపం లేదు. నాకోపమంతా మీ జాతిపైన. మీరు నా అభిప్రాయం అడిగారు కదా కథలో హీరో పాత్రను చంపెయ్యండి పీడా పోతుంది" అనేసి గబగబా లోనికి వెళ్ళి పోయింది

ఆమె ఆవేశం వెనుకగల కారణాలేమిటా అని ఆమె



గురించే ఆలోచిస్తూ కూర్చున్నాను నాకథలు, ఆలోచనలు చాలా మందికి నచ్చుతాయి కేవలం ఈమె ఒక్కతే చెప్పుచ్చుకు కొట్టినట్లు నచ్చలేదని చెబుతూ ఉంటుంది. ఇలాంటి సంఘటనలు మామధ్య నాలుగైదు సార్లు జరిగాయి ప్రతిసారీ ఇలాగే సమాధానం చెబుతుంది నాకు వళ్ళు మండి సుధీర్‌ను ఒక మాట అంటాను సీరియస్‌గా కోపమొచ్చి వెళ్ళిపోతూ ఉంటుంది ఇలా హద్దులేని దురభిమానం అనర్థదాయకమని ఆమె తెలుసుకుంటే బాగుంటుందని పించింది

★ ★ ★ ★ ★

ఆరోజు త్యాగరాయ 'గానసభలో సుధీర్ గారికి సన్మానం ఆమెకోసం నెనొక పాస్ తెచ్చాను ఆమె బలవంతాన నేను కూడ వెళ్ళటం జరిగింది

'నమస్కారమండీ, బాగున్నారా? అంటూ నన్ను పలకరించారు శాంతగారు

ఆఁ, నమస్కారమండీ, మీరెలా ఉన్నారు?' అన్నాన్నేను

అలా కుశల ప్రశ్నలు ముగిశాక, దూరంగా ఉన్న మాధవి గారిని పిలిచి 'వీరెవరో తెలుసా మీ అభిమాన రచయిత సుధీర్ గారి భార్య , అంటూ ఆమెకూ ఈమె మీ వారి అత్యంత అభిమాని" అంటూ శాంత గారికి పరిచయం చేశాను కాశ్మీర్ జరీ

చీరకట్టి, తలనిండా పూలతో నిండుగా, గాంభీర్యంగా, కన్పించే ఆమె వంక ఒకనిముషం అలాగే రెప్ప వాల్చకుండా చూస్తూ నిల పోయింది మాధవి. ప్రోగ్రాం మొదలవటానికి ఇంకా టైమ్ ఉండటంతో మేం ముగ్గురం ఒక ప్రక్క కూర్చొని మాటల్లో పడ్డాం. కొంతసేపు పిచ్చాపాటీ ముగిశాక, వాళ్ళిద్దరూ నన్ను వెలివేసి వాళ్ళే మాట్లాడుకుంటున్నారు.

"మీ వారి రచనలు మీరూ చదువుతారా?" అని అడిగింది మాధవి.

"చదవటమా, భలేవారేనే ఆ కథలన్నీ ఫెయిర్ వ్రాసేదేనేను. ప్రతి ప్లాటూ నాతో చర్చించకుండా మావారు వ్రాయనే వ్రాయరు" అన్నది.

"మరి మిగిలిన టైములో ఏం చేస్తుంటారు" అన్నది మాధవి.

"ఇంటి పని అయిన తర్వాత మా వారి కథలు ఫెయిర్ కాపీ వ్రాయటం, పత్రికలకుపంపటం, ఏయే కథలు ఏయే పత్రికల్లో ఉన్నాయో చూసుకోవటం, వాటి రికార్డు, అంతా నేనే చూస్తాను. ఈ పనులు చేయటానికి నాకు రోజుకు ఇరవై నాల్గు గంటలూ చాలక మరో నాల్గు గంటలుంటే బావుణ్ణని పిస్తుంది".

"అంతసేపూ పుస్తకాల్లో గడపటానికి బోర్ ఫీలవ్వరా?" అన్నది. మాధవి ప్రతి ప్రశ్నలోనూ ఏదో ఆతృత ఆమెను గురించి పూర్తిగా తెలుసుకోవాలన్న తపన సులువుగా గ్రహించింది సుధీర్ భార్య. నా ఆవిడ ఆతృత లేని ఉత్సాహాన్ని రేకెత్తించింది.

"నాకేం బోర్ వెయ్యలేదండీ. పైగా చాలా ఆనందంగా కూడ ఉంటుంది. నేను ఆయన్ని కావాలని పెళ్ళి చేసుకొన్నదే అందు కోసం. ఆయన వ్రాసే ప్రతి కథ తొలి కాపీ నేనే చదువుతున్నందుకు గొప్ప థ్రిల్ ఫీలవుతాను. భర్త ప్రతి విజయం వెనుక తనుంది. అతనికి ప్రతి పనిలోనూ సాయంపడటంకన్నా ఏ ఆడదైనా ఏం కోరుకుంటుంది చెప్పండి. రోజంతా ఎండలో ఉండి చెప్పులు కుట్టుకునేవాడి భార్య, తాను. కూడ ఎండలో ఉండి ఆ చెప్పులకు మేకులు కొట్టటం వంటి సహాయం చెయ్యటంలేదా?, టైలర్ భార్య అతను కుట్టిన బట్టలకు గుండీలు కుట్టి తోడ్పడటంలేదా? అలాగే రచయిత భార్యగా నేనూ ఈ పనులన్నీ చెయ్యటానికి బోర్ ఎలా కలుగుతుంది. ఆనందంతో అది నా విధిగా భావిస్తాను". గొప్ప రచయిత భార్యగా ఆ దర్పం, ప్రతి మాటలోనూ ప్రస్ఫుటమవుతూంది.

ఇంతలో కార్యక్రమం ప్రారంభం కావటంతో మా వద్ద శెలవు తీసుకుని హుందాగానడుచుకుంటూ వెళ్ళిపోయింది సుధీర్ భార్య.

మాధవి ఉన్నట్టుండి "నేను వెళతాను. కొంచెం పనుంది. మీరుప్రోగ్రాం చూసి రండి" అన్నది నాతో సుధీర్ భార్యతో మాట్లాడుతున్నంత సేపు ఆమె ముఖంలో మార్పులు నేను గ్రహించకపోలేదు. అయినా అడిగాను.

"అదేమిటండీ. మీరుండరా? సుధీర్‌గార్ని ఒక మాట పడనీయరు. ఆయన వ్రాసిన రచనలను భగవద్గీత కన్న ఎక్కువగా పూజిస్తారు. పట్టు బట్టి మరీ నన్ను లాక్కొచ్చారు. అట్లాంటి మీరే ఆయన సన్మానం చూడకుండా వెళతా నంటున్నారు, నమ్మశక్యం కాకుండా ఉంది. ఏమయింది మీకు" అన్నాను. నిజంగానే ఎంతో ఆశ్చర్యంగా.

"అబ్బే, ఏమీ లేదండి. కొంచెం అర్జెంటు పనుంది అంతే. అయామ్ సారీ" అనేసి మరో మాట మాట్లాడే అవకాశం ఇవ్వకుండానే గబగబా వెళ్ళిపోయింది.

ఆమె అలా ప్రవర్తించటానికి గల కారణం తెలుసుకోవాలనే కుతూహలం నన్నక్కడ నిలువనీయలేదు. నేను కూడ ఆమె వెనకే బయలుదేరాను.

ఆమె పరుగులాంటి నడకతో ఇంటికి చేరి, మంచంమీద బోర్లాపడి, దిండులో ముఖం దాచి, వెక్కి, వెక్కి ఏడుస్తోంది. "మాధవిగారూ" అంటూ మూడు నాలుగుసార్లు పిలిచాను. పలకలేదు. ప్రతి మనిషి జీవితంలోనూ కొన్ని చేదు అనుభవాలు ఎన్నాళ్ళయినా వెంబడిస్తూనే ఉంటాయి. కొన్నాళ్ళ కొరకైనా వాటిని దూరం చేసుకోవాలంటే కొంత కన్నీరు వృధా కాక తప్పదు. అందులోనూ ఆడవాళ్ళకు మరీను. అలాంటి సంఘటన ఏదో గుర్తుకు వచ్చి ఉంటుందనిపించింది. కొంతసేపు ఆమెను కదల్చదలచుకోలేదు. అక్కడే ఏదో పుస్తకం చదువుతూ కూర్చున్నాను.

ఒక గంట తర్వాత ఆమె కొంచెం తెప్పరిల్లి, లేచి వచ్చింది. ఏడ్చి, ఏడ్చి ముఖం బాగా ఉబ్బి ఉన్నది. కళ్ళు ఎర్రబడ్డాయి. మా రూంలోకి వెళ్ళి, టీ పట్టుకొచ్చి, బలవంతాన ఆమె చేత ఒక కప్పు త్రాగించాను.

"ఏమైంది? అలా ఉన్న పళాన వచ్చేశారు?" అని అడిగాను.

ఒక్క నిముషం మౌనంగా ఉండి, తల దించుకుని చెప్పింది. "ఏమీ లేదు. మనసు బాగుండక అక్కడ ఉండలేక పోయాను". ఆమెను గురించి తెలుసుకోవటానికి అదే సమయమనిపించింది.

"మాధవిగారూ, కష్టాలూ, బాధలూ ప్రతి జీవితంలోనూ ఉంటాయి. కాకపోతే కొంచెం హెచ్చు, తగ్గులు తప్ప. వాటిని ఇతరులకు పంచక పోయినా, కనీసం చెప్పుకోవటం వల్లనైనా మనసుకు కొంత స్వాంతన చిక్కుతుంది. మీ జీవితంలో ఏదో విషాద ముందని తెలుసు గానీ, సందర్భం రాక ఇన్నాళ్ళూ అదేమిటో తెలుసుకోలేక పోయాను. ఇన్నాళ్ళ మన పరిచయంలో నన్ను మీరు ఆత్మీయుడుగా భావిస్తే, మీకు సంతోషాన్ని దూరం చేసిన ఆ గతాన్ని నాకు చెప్పండి" అంటూ అనునయించాను.

నా మాటలను ఆమె కళ్ళలో మళ్ళీ నీళ్ళు తిరిగాయి. "సరే చెప్తాను. నా గత చరిత్ర తెలిస్తే మీరు నన్ను అసహ్యించుకుంటారని తెలిసినా, చెప్పుకోవటానికి సిగ్గుగా వున్నా, మనసుకు కొంత ఊరట కల్గుతుందేమోనన్న ఆశతో చెప్తాను" అంటూ ప్రారంభించింది.

"నేనొక సాంప్రదాయకమయిన సామాన్య కుటుంబంలో పుట్టాను. అందరి ఆడపిల్లల్లాగానే రకరకాల రంగుల కలలు కన్నాను. నాకు చిన్నప్పటి నుంచీ హై క్లాస్ జీవితం అంటే మక్కువ ఎక్కువ. పెళ్ళయినాక భర్త ఆఫీసు నుండి రాగానే, నన్ను షికార్లకు, సినిమాలకు తీసుకెళ్ళాలనీ, ఆఫీసు టైం తప్ప మిగిలిన టైం అంతా నాతోనే గడపాలనీ, రకరకాల ఊహల్లో విహరించేదాన్ని. కలలూ, వాస్తవాలూ రైలు పట్టాల్లాంటివని, గ్రహించలేని వయసది. సాంప్రదాయకంగానే, కట్న కానులతో నా పెళ్ళి జరిగింది. మా వారు విజయవాడలో ఎలక్ట్రిసిటీ ఆఫీసులో యల్. డి. సి. పైపెచ్చు మావారికి రచనలు చెయ్యాలనే కోరిక విపరీతంగా ఉండేది. రచయితగా స్థిరపడటం ఆయన జీవిత

లక్ష్యం అనేవారు. పగలంతా ఆఫీసులో పని. సాయంత్రం కాగానే కాగితాల దొంతరలు ముందేసుకుని ఏవేవో వ్రాస్తూ ఉండేవారు. ఆదివారం వచ్చిందంటే ఈ కార్యక్రమం ఉదయం నుంచే ప్రారంభమయ్యేది. ఆయన వ్రాసిన ఏ కథా ప్రింటయ్యేది కాదు. రోజూ యింటినిండా బుట్టెడు చెత్త మాత్రం పోగయ్యేది. నన్నెక్కడికీ బయటకు తీసుకెళ్లేవారు కారు. నగలూ, నట్రా లేకపోయినా, రోజూ ప్రేమతో మూరెడు పూలైనా భర్త తెస్తే, ఏ భార్య అయినా ఎంతో సంతోషిస్తుంది. రచయిత అయినా ఆయన ఆమాత్రం గ్రహించలేక పోయేవారు. నా కలల సౌధాలన్నీ కూలిపోవటానికి ఎంతో కాలం పట్టలేదు".

"ఆయనకు నచ్చజెప్పి చూడకపోయారా?" మధ్యలో నే ప్రశ్నించాను.

"ఎన్నోరకాలుగా ప్రయత్నం చేశాను. ముందుగా నేనసలు ఆయన బడ్జెట్ జీవితంలో సర్దుబాటు కాలేకపోయాను. ఆయన జీతమంతా నా చేతికిచ్చేవారు. ఎలా ఖర్చు పెట్టినా, నొప్పించేటట్లు ఒక్క మాట కూడా అనేవారు కారు. ఆయన కథలు చదివి అభిప్రాయం చెప్పమనేవారు. నన్నెక్కడికీ తీసుకెళ్లరన్న కసితో అన్ని కథలూ బాగోలేదనే చెప్పేదాన్ని. ఆయన్ని ఎంతో డిస్కరేజ్ చేసేదాన్ని. సరిగ్గా శాంతగారు తన భర్త పట్ల ప్రవర్తించే తీరుకు భిన్నంగా ప్రవర్తించేదాన్ని. నా కోరికల విషయంలో నే గాక, శారీరక వాంఛలలో కూడ నేనాయనతో సర్దుబాటు కాలేకపోయాను".

"అలాంటి పరిస్థితులలో నా దురదృష్టవశాత్తూ, ఆయన స్నేహితునితో పరిచయం అయింది. అతను రోజూ మా యింటికి వచ్చి, రోజల్లా అక్కడే గడిపేవాడు. మావారుఏదైనా వ్రాసుకుంటూంటే మేం ఇద్దరం చెస్ ఆడుకునేవాళ్లం. మేం ముగ్గురం ఆదివారాలు అమరావతి, కొండపల్లి వెళుతూ ఉండేవాళ్లం. నా బలవంతం మీద వచ్చినా మావారు ఏదో ఆలోచిస్తూ కూర్చునేవారే గాని మాతో సరదాగా గడిపేవారు కారు. మా భార్యాభర్తల మధ్యనున్న మానసిక దూరాన్ని, వారి స్నేహితుడు పసికట్టటానికి ఎక్కువ కాలం పట్టలేదు. క్రమంగా అతను నాలోని బలహీనతల్ని గుర్తించి, ఎక్స్‌ప్లాయిట్ చేశాడు. రకరకాల ఫారిన్ సెంట్లూ, పౌడర్లూ, నాకు బహుమతులుగా ఇచ్చేవాడు. వీలైనప్పుడల్లా నా అందాన్ని రకరకాల ఉపమానాలతో, పొగిడేవాడు. మొదట్లో అతని మాటలూ, చేష్టలూ నాకు వెగటనిపించినా నాలో క్రమంగా నిద్రాణమయిపోతూన్న కోరికల మీద బాణాలుగా పనిచేశాయి. కోరికలు మరల పురివిప్పటంతో నా మనసు అటువేపే మళ్లింది. మావారు ఉండీ వంటరిగా ఫీలవుతున్న నేను అతనికి దగ్గరయ్యాను. జీవితాన్ని పూల పాన్పుగా మలచుకోవాలనీ, సుఖప్రదం చేసుకోవాలనీ, మనసుకు నచ్చినట్లు ప్రవర్తిస్తే తప్పు కాదనీ, రకరకాల మాటలతో నా మనసు నింపేశాడు"

నాలో కోరికలూ, మనసూ, బంధాలూ, కట్టుబాట్ల మధ్య విపరీతమయిన సంఘర్షణ ప్రారంభమైంది. నా మనసే తప్పు అని మందలిస్తోంది. అదే మనసు తప్పు చెయ్యమని ప్రబోధిస్తోంది" అంటూ కొద్దిసేపు ఆపి ధారాళంగా కారుతున్న కన్నీరు తుడుచుకుంది.

"తర్వాత ఏమైంది?" ఎంతో ఆతృత్తో అడిగాను.

"ఏమవుతుంది? మితిమీరిన కోరికలు అన్నింటినీ జయించాయి. అమాయకుడైన, దేముడులాంటి భర్తకు ద్రోహం చెయ్యమనే ప్రేరేపించాయి. ఆ సమయంలో శని దేవత పూనిందో అజ్ఞానంలో, చక్కటి సంసారాన్ని నాశనం చేసుకుని, నా వాళ్లందరినీ అపకీర్తిపాలు చేసి, అతనితో బొంబాయి వెళ్లిపోయాను. కాదు కాదు, లేచిపోయాను. కొన్నాళ్లకు మా మోజుల ప్రతిబింబాలుగా ఇద్దరు పిల్లలు పుట్టారు. రకరకాల తేనెలు త్రాగి జీవితం వెళ్లబుచ్చే తుమ్మెద ఒకే పువ్వును అంటిపెట్టుకుని ఎందుకుంటుంది? అది గ్రహించలేని పువ్వు అమాయకంగాతమ బంధం శాశ్వతమనుకొంటుంది. అతనికి నేను వాసనలు కోల్పోయి, వాడిపోయిన పువ్వులాగా కన్పించటంతో అకారణంగా గొడవ పెట్టుకొని నన్నొదిలి వెళ్లిపోయాడు మరొక పువ్వుకోసం. అతడు నాకు చేసిన మేలల్లా నన్ను ఏ వ్యభిచార గృహానికో అమ్మకుండా వదిలివేయటం. సినిమాల్లో చూపించే, దెబ్బతిన్న ప్రతి ఆడపిల్లలాగానే ఆత్మహత్య చేసుకుందామనుకుని, ఈ పిల్లల కోసం జీవచ్ఛవంలా బ్రతుకుతున్నాను. వయసు తొందరలో అంతులేని మితిమీరిన వాంఛల కోసం, జీవితాన్ని నాశనం చేసుకున్న నాలాంటి వాళ్ళు చావకుండా బ్రతికి ఉండటమే పెద్ద శిక్ష. ఉన్నంత కాలం చేసిన తప్పు వేటాడి వేధిస్తూనే ఉంటుంది. అలా పశ్చాత్తాపంతో బ్రతుకుతూ నా మూలంగా అప్రతిష్టపాలైన మావారిపై ఆరాధనతో, ఆయన కిష్టమైన ప్రతిదీ, నా యిష్టంగా మలచుకుంటూ, బ్రతుకుతున్నాను. అదీ నా వెనుక కథ" అని ముగించి, కళ్లు తుడుకుంది.

"ఇంతకీ మీ భర్త తర్వాత అయినా పేరుప్రఖ్యాతులు సాధించారా? ఎవరాయన?" అని అడిగాను అనుమాన నివృత్తి కోసం.

"ఎంత అమాయకులండీ! రచయిత అయి కూడా గ్రహించ లేకపోయారు. సుధీర్‌గారిని మోసంచేసిన మొదటి భార్యను నేనే" అంటూ లేచి ఏడుస్తూ, పరుగెత్తుకుంటూ గదిలోకి వెళ్లిపోయింది.

"మీ కథ తెలుసుకుని ఏ ఆడపిల్ల అయినా కోరికల ఊబిలో పడకుండా ఉండేటట్లు చెయ్యగలిగితే చాలు" అనుకున్నాను. నాలోని రచయిత అందుకు రంగమంతా సిద్ధం చేసుకున్నాడు. □

# ఫ్రిజ్‌లో కూరలు ఎలా నిలవ ఉంచాలి?

ఈ రోజుల్లో ఫ్రిజ్ లగ్జరీ ఐటమ్ కానేకాదు. గృహిణికి చాలా ఉపయోగకరమైన వస్తువు. ఈ బిజీ యుగంలో అన్ని పనులు ఒకేసారి చేసుకోవాలంటే చాలా కష్టం. తీరికవేళలో చేసుకుంటే తప్ప ఉదయానికి అమరవు. అందుకే వారానికి సరిపడా కూరలు ఒకేసారి తెచ్చుకుని చక్కగా శుభ్రపరిచి ఫ్రిజ్‌లో ఉంచితే వారమంతా నిశ్చింతగా వుండొచ్చు.

పచ్చి కూరలు ఫ్రిజ్‌లో వుంచేముందు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. లేకపోతే కూరలు పాడవటంకానీ, కుళ్ళిపోవటంకానీ జరగవచ్చు. కూరగాయలు వారమంతా తాజాగా వుండాలంటే తెచ్చిన వెంటనే శుభ్రంగా కడిగి నీళ్ళు కారిపోయే వరకు బయటవుంచి తర్వాత వెజిటబుల్ ట్రేలో వుంచాలి. లేకపోతే ట్రేలో నీళ్ళు చేరి కూరలు క్రమంగా కుళ్ళిపోతాయి.

ఆకుకూరల కోసం కూరలు తరుక్కుని వేరువేరు పాలిథిన్ కవర్సులో పెట్టి రబ్బరు బేండ్సుతో సంచి మూసెయ్యాలి. ఇలాచేస్తే వారం రోజులైనా కూరలు పాడుకావు. ఇలానే ఆకు కూరలు ఉంచవచ్చు. అయితే ఆకు కూరలోని అనవసరమైన చెత్తను తీసెయ్యాలి. కూర ఆకారం పెద్దదిగా వుంటే ముక్కలు చెయ్యొచ్చు. శుభ్రంచేసిన తర్వాత నీళ్ళులేకుండా చూసి ప్లాస్టిక్ కవర్లో పెట్టి రబ్బరు బేండ్ వెయ్యాలి. ఏమాత్రం నీరు వున్నా ఆకు కూరలు కుళ్ళటం ఖాయం.

చేపలు వుంచాలనుకుంటే ముక్కలుచేసి బాగా కడగాలి. చేప పొట్టలోని, తల భాగంలోని రక్తంకానీ, మెత్తని అంశంకానీ ఉండకూడదు. శుభ్రంగా తీసేయ్యాలి. ఉప్పులో బాగా కలపాలి. ఉప్పు తగిలిన చేప తొందరగా పాడుకాదు. తింటానికి బాగుంటుంది. అవసరాన్నిబట్టి వేరువేరు ప్యాకెట్లలో వుంచాలి. అంతా ఒకే ప్యాకెట్లో వుంచి రోజూ తీస్తూంటే రుచి తగ్గిపోతుంది. చిన్నచిన్న ప్యాకెట్లలో వుంచి డీప్ ఫ్రిజ్‌లో పెడితే వారమంతా నిశ్చింతగా వుండొచ్చు.

మాంసం కూడా ఫ్రిజ్‌లో వుంచుకోవచ్చు. ముందు మాంసం శుభ్రంగా కడగాలి. తర్వాత అల్లం, వెల్లుల్లి, పచ్చిమిర్చి నూరి కొంచెం ఆవ నూనె మాంసంలో కలపాలి. ప్రెషర్‌కుక్కర్‌లో వుంచి వేడిచేయాలి. స్టీమ్ బాగాపట్టిన తరువాత దింపి చల్లార్చాల. మూతవున్న గిన్నెలోనో డబ్బాలోనో పెట్టి డీప్‌ఫ్రిజ్‌లో వుంచాలి. వారం రోజుల తర్వాత వండినా మాంసం పాడుకాదు. పైగా మసాలతో వుండటంవల్ల రుచిగావుంటుంది. వండటానికి టైం తక్కువపడుతుంది.

చివరిగా మరో విషయం- టెంపరేచర్ కంట్రోల్ నాబ్ 5 కంటే ఎక్కువలో ఉండాలి- వేసవికాలంలో తప్పకుండా ఉండాలి.

–అపరాజిత

## ఎమ్. ఎస్. మండపేట

★ ఈర్ష్య అసూయ మానవునిలో ప్రకృతి సహజం అనుకుంటా. ఇవి ఆ భగవంతుడు ఎందుకు సృష్టించాడు?

● భగవంతుడినెందుకు ఆడిపోసుకోపడం– అవి మనిషి సృష్టించుకున్న దివ్య గుణాలు!

## ఆర్. సి., కాశిబుగ్గ

★ అక్కా ఆడదానికి అసూయ ఎక్కువ ఉంటుంది అంటారు. మీరేమంటారు?

● మీరొక పక్కే చూస్తున్నారు. మీ మగవాళ్ళేం తక్కువ కాదని తెలియదా?!

★ పిసినారి ఆడవారిపై మీ అభిప్రాయం?

● జాగ్రత్తగా ప్రవర్తించడం, చూసి ఖర్చు చేయడం రేపెలా అని ఆలోచించడం పిసినారితనం కాదు.

★ చదువుకున్న కోడలు అత్తని సుఖపెట్టకలదా?

● తప్పకుండాను. కనీసం అర్థం చేసుకుందుకైనా ప్రయత్నిస్తుంది. చదువుకోని స్త్రీకి మూర్ఖత్వమే తప్ప బుద్ధి సూక్ష్మత తక్కువ వుంటుంది.

## ఎం. ఎస్. ఎన్., అన్నవరం

★ ఎక్కడ ఉద్యోగానికెళ్ళినా రికమెండేషన్, లంచం లేందే పని జరగడంలేదు. డబ్బున్న వారికైతే - ఏ గొడవాలేదు. కాని మెరిట్ వుండి ఆ రెండు లేని మధ్య తరగతి విద్యార్థుల మాటేమిటి? ఇదంతా చూస్తుంటే ఈ సమాజంపై అసహ్యం కల్గుతోంది. మీరేమంటారు?

● ఇంకా 'తమ' వారికి సహాయం చేయడం సులభతరం చేసుకుందుకు - డిగ్రీలని ఉద్యోగాల నుంచి వేరు చేయబోతారట. అప్పుడింకా మోసంగా వుంటుందేమో. దానికి భయపడడం ప్రారంభించండి ... సమాజం అంటూ ఓ చిరునామా లేదు. అది మనమే. మనం మారనిదే సమాజాన్ని తిట్టుకోవడం దేనికి? అసహ్యించుకోవడం దేనికి?!




★ 'దేవుడనేవాడున్నాడా? అయితే చూపెట్టండి' అంటూ కొంతమంది ప్రశ్నిస్తారు కదా? వారికెలా సమాధానం చెప్పాలంటారు?

● లేదనడానికి వాళ్ళ ఆధారాలు చూపెట్టాలి కదా! అదే అడగాలి.

★ నరకం అనేది ఎక్కడో లేదు - ఇక్కడే వుంది. కాదంటారా?

● కలియుగంలో భూమ్మీదే నరకం. తెలుస్తూనే వుంది కద!

★ మీ నవలలని విమర్శించే వారిపై మీ అభిప్రాయం ఏమిటి?

● దీనికో అభిప్రాయం ఎందుకు? విమర్శిస్తే ఉడుక్కోను. అలా అని 'ఇలా ముగించి వుంటే బాగుండేది' 'అలా రాసి వుంటే బాగుండేది' అనే విమర్శలని నేను అనుకోను. బాగుంటే బాగుందనో లేకుంటే లేదనో నిర్మొహమాటంగా చెప్పాలి. కర్ర విరక్కుండా పాము చావకుండా విమర్శించడం - అర్థంలేని పని ... నిష్ప్రయోజనం కూడా.

## వి. వి. ఆర్. కుంచనపల్లి

★ మీ జవాబులంటే చాలా యిష్టం పత్రిక వచ్చేవరకు చాలా టెన్షన్‌గా ఫీలవుతున్నాం.

● ఇదేం థ్రిల్లర్ సీరియ లా అలా చెమట్లు పోసుకుంటూ ఎదురు చూడడానికి ఇంద్రాణీ! పొరపాటున ఈ కార్డు నాకు వచ్చిందనుకుంటున్నా?!

★ సినిమాలు చూసి యువత చెడిపోతోంది కదూ?

● చెడిపోవడానికి కారణాలకేం అనేకం! అందులో సినిమాలొకటి. అంతే.

## ఎన్. కె. వి. ఆర్. పర్లాకిమిడి

★ కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారిపై మీ అభిప్రాయం?

● కవిగా వ్యక్తిగా అంత ఛాందసులైనా ఆడదానిపై చాలా గౌరవం కల వ్యక్తిగా అనిపించారాయన నాకు.

## ఎం. డి. ఆర్. ప్రొద్దుటూరు

★ కలసి వుంటే కలదు సుఖం అనే మాట ఒకప్పుడు. కాని ఇప్పుడు కలసి వుంటే లేదు సుఖం అంటాను ...

● అంతేలే – నువ్వు పప్పు తే, నేను ఉప్పు తెస్తాను అనే వాళ్ళు కలసి వుంటే సుఖంగా వుండదు మరి!

## ఎస్. బి. మండపేట

★ అక్కయ్యా నేను పుస్తకాలు చదవకూడదు., ఉత్తరాలు రాయకూడదు, పత్రికలలో శీర్షికలలో పాల్గొనకూడదు – అని ఆంక్షలు పెట్టారు. ఇది తప్పా?

● మీరే శీర్షికలను రాస్తున్నారో తెలియందే – తప్పొప్పులెలా చెప్పడం – ఆడపిల్లవైతే – తొలి ప్రేమలూ, కలుసుకోడాలూ– విరహం, వేదన – యివన్నీ బొమ్మతో సహా వేసుకుంటారా?! అబ్బాయి అయితే – ఏం రాసినా తప్పు లేదని ... ఒకసారి నేనేం చేశానంటే అనో – నా ప్రియురాలు ఫలానా ప్రేయసీ నీ మొగుడితో పిల్లలతో హాయిగా వున్నావా? అంటూ కొంపలు కూల్చే రచనలు పంపవచ్చా?! పార్టిసిపేషన్ తప్పుకాదు – కాని అవి ఎలాంటి శీర్షికలని చూడాలి – ఇవన్నీ అచ్చులో చూసుకోగానే బాగానే ఉంటాయి. ఇంట్లో వాతావరణం కాస్త బిగుసుకున్నప్పు డిలాంటివి ఎటువంటి పరిణామాలకి దారితీస్తాయో కాస్త ఆలోచించాలి కదా. అయినా పత్రికలూ మరీ బరితెగించి ఒకరిని మించి ఒకరు శీర్షికలు ప్రకటించేస్తున్నాయి ... చూస్తుంటే – యింకేం వస్తాయోనని భయంగా కూడా వుంటుంది. మనని మనం ఇరుకున పెట్టుకొనేవి, మన చుట్టూ వున్న వారిని ఇబ్బంది పెట్టేవీ, సిగ్గుపడేలా చేసేవీ రాయకూడదని నేను అనుకొంటాను. అలా రాయడమే థ్రిల్లు అనుకుంటే మీకో నమస్కారం!

## పి. ఎస్. కె. బరంపురం

★ వ్యభిచారం కూటి ధర్మంగా కొందరు యువతులు పాటించడానికి కారణం ఏమిటి?

● కుల ధర్మంగా జోగినులని తయారు చేయడానికి తహ తహలాడే యీ పాడు సమాజంలో కూటికోసం, గుడ్డ కోసం ఆడది వ్యభిచరిస్తే తప్పేముంది? కూడూ గుడ్డా యిచ్చి పోషించ వలసిన భర్తలే భార్యలని ప్రోత్సహించి లేకుంటే హింసించి యీ వృత్తిలోకి దించేస్తున్నారని కూడా వింటున్నాము. □






# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## ఘనపదార్థాలను తొలిసారిగా రుచి చూపిస్తూ

సుమారు4 నెలలనుంచి మీ పాపాయికి పాలతోపాటు ఘనపదార్థాలు కావాలి. దీన్ని సెరిలాక్ లాభంతో ప్రారంభించేందుకు ఇదే సరైన సమయం.

**పోషకాహార లాభం.**

సెరిలాక్ ప్రతి మోతాదులోను (ప్రతిసారి మీ పాపకు తినిపించే సెరిలాక్‌లోను) మీ పాపాయికి కావలసిన పోషకపదార్థాలు, ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, క్రొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలు అన్నీ ఉన్నాయి. మీ పాపాయి ప్రత్యేక అవసరాలకు తగినట్టుగా, సరైన పాళ్ళల్లో అన్నీ సమతూకంలో ఉన్నాయి.

**రుచి లాభం.**

సెరిలాక్ మంచి పోషకపదార్థాలకు మంచి రుచిని కలిపింది. పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం.

**సమయం ఆదా లాభం.**

సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలు పంచదార ఉన్నాయి. దానిని వెచ్చటి నీటిలో కలిపితే చాలు. క్షణంలో ఆహారం తయారు.

**ఎంపిక లాభం.**

పాపాయికి ఆహారం తినిపించడం మరింత ఆహ్లాదకరంగా చేసేందుకు, యిప్పుడు ఎంచుకునేందుకు రెండు రకాల సెరిలాక్ దొరుకుతోంది. 4 నెలల నుంచి సెరిలాక్ వీట్. 6 నెలల తరువాత కొత్త సెరిలాక్ ఆపిల్.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు తయారు చేయడంలో పరిశుభ్రతను పాటించేందుకు డబ్బా మీద సూచనలను జాగ్రత్తగా పాటించండి.

> **ఉచితం**
> పాపాయి ఆరోగ్య రికార్డు పుస్తకం కోసం వ్రాయండి.
> సెరిలాక్ పోస్ట్ బాక్స్ నం. 3
> న్యూ ఢిల్లీ-110 008.









Nestlé

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంలో పరిపూర్ణం-ఎంతో రుచికరం

సీరియల్



ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

"నేను పాకలో పండుకుంటానయ్యా. ఏవన్నా కావాలంటే పిలవండి" అని చెప్పి పాకలో కెళ్ళి పడుకున్నాడు రాముడు... రాత్రి ఊరంతా సద్దుమణిగే వరకూ వేచి ఉన్నాడు విజయ్. గోగినేని పల్లె గాఢ నిద్రలో మునిగి పోయింది. ఏడుగంటలకు పోయిన కరెంటు ఇంకా రాలేదు. నక్షత్రాల గుడ్డి వెలుతురు మసక మసగ్గా ఉంది....

నెమ్మదిగా మంచం మీద నుంచి లేచాడు విజయ్. దిండ్లు రెండూ ఒకదాని కొకటి వరసగా జతచేసి దుప్పటి కప్పాడు. ఆ చిరు చీకట్లో ఎవరైనా చూస్తే అక్కడ మనిషే ఉన్న భ్రమను కలిగిస్తోంది. లాంతరు వత్తిని బాగా తగ్గించేసి, చప్పుడు కాకుండా వెనక వేపు తలుపు తీసుకుని బయట కొచ్చాడు. అటువేపు గొడ్లపాక ఉంది.

అందులో నే పడుకున్నాడు రాముడు.

రెండు కాళ్ళూ మడిచి, మోకాళ్ళు పైకెత్తి గురకలు పెడుతూ నిద్రపోతున్న రాముణ్ణి ఒకసారి చూశాడు విజయ్.

ఆ పక్కనే కొన్ని పశువులు మెడ చాపి నిద్రపోతున్నాయి. కొన్ని కళ్ళు తెరుచుకుని చూస్తూ తీరికగా నెమరు వేస్తున్నాయి.

తలుపు దగ్గరగా లాగి, పక్కనే ఉన్న గడ బొంగు సందులోంచి చెయ్యి లోపలికి పోనిచ్చి, గొళ్ళానికి కట్టిన తాడును మేకుకు తగిలించాడు. ఇప్పుడిహ ఎవరూ తను బయట కెళ్ళినట్లనుమానించరు హఠాత్తుగా చూసినా.

పాకదాటి బయట కొచ్చి గడీవేపు అడుగు లేశాడు విజయ్. అవసరమైనప్పుడు పెన్ టార్చి వెలిగించి, ఆ వెలుతురులో కొంత దారి గుర్తుంచుకుని తిరిగి ఆర్పేస్తూ జాగ్రత్తగా గడీ చేరుకున్నాడు.

జరిగిన కథ –6 : చంద్రరావు, రాజ్యలక్ష్మిలకు సుధను విజయ్‌కిచ్చి పెళ్ళి చేయాలనే ఆలోచన ఉంటుంది. విజయ్ మీద హత్యాప్రయత్నం జరుగుతుంది. దాని నుంచి తప్పించుకోవడంలో సాయపడిన వింధ్య అనే యువతి పరిచయ మవుతుంది. సుధ పట్ల తనకటువంటి ఉద్దేశ్యం లేదని విజయ్ చెప్పేస్తాడు. విజయ్ మారువేషంలో గోగినేని పల్లెకు వెళ్ళి రంగారావు గురించి సమాచారం సేకరిస్తుంటాడు.

అప్పటిదాకా అక్కడ వెలిగిన పెట్రో మాక్స్ లైట్లు కూడా ఆరిపోయాయి.....

చేతిలో నుంచి జారిపడ్డ బీడీ కోసం ముందుకు ఒంగిన వాచ్‌మన్ ఇహ లేవలేదు.... అటునుంచే లోపలి కొచ్చి పాడుబడ్డ తోటలోకి ప్రవేశించాడు విజయ్.

చవితి చంద్రుడు పైపైకి వచ్చి కురిపిస్తున్న పల్చని వెన్నెల తోటలో మసక మసకగా పడుతోంది....

ప్రతి చోటునూ పరిశీలనగా చూస్తూ వెనక వేపు కొచ్చాడు. ఇంతలో ఏదో అలికిడి కావటంతో గబుక్కున ఒక పొద చాటుకు తప్పుకున్నాడు. సాధారణంగా.... వెనక వేపు అతి విశాలంగా ఉన్న ఆపాడుబడ్డ తోటలో ఎవరూ తిరగరు.

ఊపిరి బిగబట్టి చూస్తున్నాడు విజయ్....

ఎవరు వచ్చేది?

రెండు తొండలు ఒకదాన్నొకటి తరుముకుంటూ ఎండుటాకుల మీద పరుగెత్తాయి....

ఇవతలి కొచ్చి, లోపలికి దిగటాని కేమయినా ఆధారం దొరుకుతుందేమో నని తలపైకెత్తి చూశాడతను. చాలా ఎత్తుగా ఉన్నాయి గోడలు. పట్టుకుని పాకటానికి ఏ ఆధారమూ లేదు.

నిశితంగా పరిశీలిస్తూ దక్షిణం వేపు కొచ్చిన అతని కళ్ళు మెరిశాయి.

అక్కడ ఎత్తుగా ఉన్న పెద్ద వృక్షాలున్నాయి. ఒక చెట్టు కొమ్మ బాల్కనీ మీదకు కొద్దిగా ఒంగి ఉంది.

చెట్టు మీదకు ఎగబాకి ఆ కొమ్మ మీదకు వెళ్ళాడు విజయ్. పిట్ట గోడకీ కొమ్మకీ మధ్య కొంచం దూరముంది. కిందనుంచి చూస్తే... గాలి వీచినప్పుడు కాస్త సమీపంగా కనపడుతోందంతే.

ఒక చేత్తో కొమ్మను పట్టుకుని రెండో చెయ్యి చాపి బాల్కనీ గోడను అందుకోటానికి ప్రయత్నించాడు. అందలేదు...

మరోసారి, మరోసారి ప్రయత్నించాడు.....

చేతికీ గోడకీ మధ్యదూరం తగ్గినట్టే తగ్గి మళ్ళీ పెరుగుతోంది.....

రిస్క్ తీసుకోక తప్పదు.

బాలెన్స్ తప్పినా..... శరీరంలో కొన్ని భాగాల మీద ఆశలు ఒదులుకోవాల్సిందే.

కానీ.... వేరే మార్గం లేదు. ఒక్కసారి జంప్ చెయ్యాలి. ఆ చిన్న శబ్దాన్ని కెవరయినా ఇటువస్తే తన పని ఆఖరు.

శత్రువు దయాదాక్షిణ్యాలు లేనివాడు.

వైజయంతి నోసారి మనసులోకి తెచ్చుకున్నాడు విజయ్.

ఒక్కసారి గుండెల నిండా ఊపిరి పీల్చుకుని పిట్ట గోడ మీదినుంచి బాల్కనీలోకి దూకాడు.

"ఎవరు?" ఎక్కడ నుంచో వినిపించిందో స్వరం అస్పష్టంగా.

ఊపిరి బిగబట్టి మెల్లిగా వెళ్ళి అక్కడున్న స్తంభం వెనకాల నిలబడ్డాడు. ఆ స్తంభం తనను దాచలేదని తెలుసు. అయినా.... ప్రస్తుతానికదే ఆధారం....

కళ్ళు చిట్లించి చూస్తూ లాంతరుతో వస్తున్న వ్యక్తి మేనేజర్.

ఇంకా నిద్రపోకుండా ఎందుకంత జాగ్రత్తగా తనే స్వయంగా పహరా కాస్తున్నాడు?!

స్తంభం చాటు నున్న విజయ్ మేనేజర్ కంట బడ్డాడు.

అతని చేతిలో పిస్టల్ విజయ్ వేపు గురిపెట్ట బడి ఉంది.

"చేతులెత్తి బయటకురా. లేకుంటే ఛస్తావ్." అన్నాడతను కర్కశంగా.

అతన్నే చూస్తూ బయట కొచ్చాడు విజయ్. బాల్కనీలో చివరి వేపున్న గది దగ్గరున్నారు వాళ్ళు. మిగతావాళ్ళు కింద ఉన్నట్టున్నారు. "ఇతనొక్కడే ప్రత్యేకంగా తెల్లవార్లూ ఈ పక్కన కాపలా కాయట మెందుకో. బహుశా.... ఇక్కడే ఏదో క్లూ ఉండి ఉంటుంది." అనుకుంటున్నాడతను.

విజయ్ వేపు ఎగాదిగా చూస్తూ ట్రిగ్గర్ నొక్కబోతున్నాడు మానేజర్.



## మంజీరనాదం

తెగించినట్టుగా ఎగిరి అతని మోకాళ్ళ మీద తన్ని పక్కకు దొర్లాడు విజయ్.

నాటుగా ఉన్న ఆ మనిషి నుంచి అలాంటి దెబ్బ ఊహించని మేనేజర్ తుళ్ళిపడ్డాడు. పిస్టల్ ఎగిరవతల పడింది.....

దాన్ని అందుకోటానికి మేనేజర్, విజయ్ పెనుగులాడుతున్నారు. మేనేజర్‌కు పైకి కనిపించేంత వయసు, బలహీనం లేవు. దృఢంగా .... ఉక్కులా ఉన్న అతను అలా మేకప్ చేసుకుంటున్నాడంతే.....

విజయ్ అనుమానం బలపడసాగింది.....

కొద్ది సేపట్లోనే మేనేజర్ స్పృహతప్పి పడిపోయాడు. అతన్ని బుజాన వేసుకుని చాటుగా పడేసి అతని బొడ్లో ఉన్న తాళాలు అందుకున్నాడు విజయ్.

కనీసం రెండు గంటల సేపటి వరకూ స్పృహరాదు మేనేజర్‌కి.

అక్కడ వరసగా నాలుగు గదులున్నాయి. తాళాలతో ప్రయత్నిస్తే ఒక్క గది తాళం వచ్చింది. లోపలికి ప్రవేశించి తలుపు వేశాడు విజయ్. గది బయట తాళం లేక పోవటంతో ఎవరికయినా అనుమానం రావచ్చు. ద్వారం పక్కనున్న కిటికీలో నుంచి చెయ్యి బయటకు చాపి తాళం లోపల్నుంచే వెయ్యాలని ప్రయత్నించాడతను.

కిటికీకి ద్వారానికి ఉన్న మధ్య దూరం కన్నా చెయ్యి పొడవు తక్కువ ఉండటంతో వీలవలేదు.

ఇలాంటి పిచ్చి పనుల్తో టైం వేస్టు చేస్తే లాభం లేదు. ఎలాంటి రిస్క్ తీసుకోటానికయినా వెనుకాడ కూడదు. ఇంకోసారిలాంటి అవకాశం దొరక్క పోవచ్చు.

తలుపు లోపల గడియ వేశాడు విజయ్.

గది విశాలంగా ఉంది: వాడకం లేనట్టు దుమ్ము పేరుకుని ఉంది. కానీ..... జాగ్రత్తగా చూస్తే కాలి ముద్రలు కనిపిస్తున్నాయి. గజిబిజిగా ఉన్నాయవి. అయినా అవి చాలా వరకూ అక్కడున్న పాతకాలం నాటి బీరువా వరకూ వచ్చి ఆగి పోవటం గమనించాడతను.

ఏముందా బీరువాలో?

దగ్గరకెళ్ళి హేండిల్ పట్టుకుని కదిపి చూశాడు..... తన దగ్గరున్న ప్రతి తాళం చెవీ ఉపయోగించాడు తెరవటానికి. ఏదీ సరిపోలేదు.

ఆలోచిస్తూ చుట్టూ చూస్తుంటే.... బీరువాకీ గోడకీ మధ్య మనిషి వెళ్ళేంత సందు కనిపించింది.

సాధారణంగా బీరువాని గోడకానించి పెడతారు. ఇది ఇంత ఎడంగా ఎందుకుంది?

అనుమానంగా బీరువా వెనక్కు వెళ్ళాడు విజయ్. గోడమీద చేత్తో రాశాడు. వేళ్ళు మడిచి వెనక్కి తిప్పి కొట్టాడు. శబ్దంలో ఏదో తేడా. ఇంకోసారలా చేసి అనుమానం నివృత్తి చేసుకున్నాడు.

గోడ బీటువారింది అనుకునేంత సహజంగా నిలువుగా.....

గోడ మీద సన్నటి బీట కనిపించింది. దాన్ని పక్కకు జరపాలి. అక్కడొక చిన్న స్విచ్ బోర్డుంది. దానికి అయిదు స్విచ్‌లున్నాయి.

గోడ ద్వారం తెరిచే స్విచ్ తప్పకుండా ఇందులో ఒకటయి ఉంటుంది.

ఏది?

ఇక్కడో అండర్ గ్రౌండుందన్నమాట. బహుశా.... అక్కడ వైజయంతి బంధింప బడిఉండొచ్చేమో.

ఉద్వేగాన్నణుచుకుంటూ మళ్ళీ స్విచ్‌ల వేపు చూశాడతను.

ఇందులో ఏది మిత్రువు.... ఏది శత్రువు?

మనసులో దైవాన్ని స్మరించుకుని కళ్ళు తెరిచాడు.

ఉహూఁ! ఖచ్చితంగా ఏదో తెలియలేదు.

ఇదే పురాణాల్లో అయితే.....

"నేనే కర్తవ్య నిష్ఠాపరాయణుడనయితే...... వృత్తికి అంకితమయిన



## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

వాడినయితే..... కావలసిన స్విచ్ ఒకటే ఉంది, మిగతావి మాయమగుగాక." అని కళ్ళు తెరవగానే మిగిలినవి టక్కున మాయమయేవి.

ఇప్పుడేవి తల్లీ ఆలనాటి సత్యాలు .... మహిమలూ!?"

ఇలా అనుకోగానే విజయ్‌కి నవ్వొచ్చింది. కాస్త టెన్షన్ కూడా తగ్గినట్లనిపించింది.

చెయ్యెత్తి ఒక స్విచ్ నొక్కాడు.

ద్వారం తెరుచుకోలేదు.

ఎక్కడో గుడిగంటలు మోగినట్లు మోగాయి.

తను సరైన దాన్ని నొక్కలేదు!

ఈ సంకేతం ఎవరికి?

ప్రమాద సూచనా?

ఈ సూచన గోడలోపలున్న వాళ్ళకా..., కింద పోర్షన్‌లో ఉన్న వాళ్ళకా?

కొద్ది క్షణాలు గోడ వేపు చూశాడతను. అది మామూలుగానే ఉంది.....

బయట అడుగుల చప్పుడు వినిపిస్తోంది.....

చప్పున వెళ్ళి తలుపు చాటున నిలబడ్డాడు విజయ్.....

తలుపుకున్న గుండ్రని చిన్న కన్నంలో నుంచి ఒక సాధనంలోపలికొచ్చి గడియ తీసింది.

తను ఆ రంధ్రం చూడనే లేధు!....

లోపలికి రాబోయే వ్యక్తి ముందుగా చూసేది తలుపు చాటు నున్న వాడి పని.

నేరుగా వచ్చేసి ఆ చాటునున్న వాడి చేత మాడు పగల గొట్టించుకుని బోర్లా పడే బఫూన్ లెవరూ ఉండరు. ఈ విషయం ఊహించిన విజయ్ జాగ్రత్తగానే ఉన్నాడు.

లోపలి కొచ్చి విస్సురుగా మీద పడబోయిన మనిషి విజయ్ మెరుపులా తప్పుకోటంతో కొద్దిగా బెసికాడు.

అది చాలు విజయ్‌కి.

కానీ.... వచ్చిన వ్యక్తి హఠాత్తుగా తన నొదిలేసి బీరువా వెనక్కు పరుగెత్తటంతో విజయ్ మనస్సు కీడును శంకించింది. అతని మీదకు ఉరికి వెనక్కి లాగబోయాడు.

అప్పటికే ఆలస్యమయింది. అవ్యక్తి చెయ్యి స్విచ్ బోర్డును తాకటం, అదే వేగంతో విజయ్‌ని ఆ సందులోకి నెట్టటం ఒకేసారి జరిగినట్లయింది.....

గోడవేపు నుంచి ఒక వస్తువు నిప్పులు కక్కుతున్నట్లున్న ఒక గుండ్రని వస్తువు ముందుకొచ్చి తాకీ తాకనట్లు తాకింది. చటుక్కున ఇవతలికి జరిగాడు విజయ్.

ఆ కాస్త సామీప్యానికే అతని శరీరం నిప్పులో పెట్టినట్లు కంపించి పోయింది....

ఎలక్ట్రిక్ షాక్!

ఆ వ్యక్తి విజయ్‌ని తిరిగి అటు నెడుతున్నాడు. ఆ వస్తువు గోడకున్న బీటను కాపలా కాస్తున్నట్లు తిరుగుతోంది. ముందు దాన్ని ఆపాలి.

ఇంకోసారి తను ఆ వస్తువు మీద పడితే మాడి మసి కావలసిందే. అప్పటికే ఒంట్లో ఉన్న శక్తి సగం క్షీణించినట్లయింది. అవతలి మనిషి తన ఉక్కులాంటి చేతులడ్డం పెట్టి విజయ్‌ని ఇవతలికి రానివ్వడం లేదు.

చావుబలంతో కూడిన ఆఖరి తెగింపుతో సర్వశక్తులూ కూడదీసుకుని ఆ మనిషి ఇవతలికి గెంటి అతని మీద పడ్డాడు విజయ్. చేతిని కత్తిలా ఛెక్‌మనిపించి అతని బుజం మీద మెడమీద కొట్టాడు వరసగా....

అతనిహ నోరెత్తలేదు....

అధికార పూర్వకంగా వస్తే ఇక్కడ తనకేం దొరకదు. ఈసారి మిస్సయి మరోసారి ప్రయత్నించినా ఏ ఆధారమూ దొరకదు. ఇదే తనకి ఆఖరు ఛాన్సు....

ఈ హడావుడిలో ఇంకో పావు గంటలో మేనేజర్‌కి స్పృహ రావొచ్చనే విషయం మర్చిపోయాడు విజయ్.

అదే అతను చేసిన పొరపాటు.

తల ఎత్తి ఆవస్తువుకేసి తదేకంగా చూశాడు విజయ్.

భూతంలా కాపలా కాస్తోందా గోడ ద్వారాన్నది.

లోపలికీ బయటకీ ఊగుతోందా వస్తువు. అది లోపలికెళ్ళినప్పుడు తను స్విచ్ నొక్కాలి. తను నొక్కిన స్విచ్ కాక ఇంకో నాలుగున్నాయి. అందులో ఒకటి ఇందాకటి వ్యక్తి నొక్కాడు. అది కిందకే ఉంది. ఇహ మిగిలినవి మూడు. ఆలోచిస్తూ రెండు వేళ్ళతో గబుక్కున రెండు స్విచ్‌లు నొక్కాడతను.

ఆవస్తువు మాయమవటం..... గోడ పక్కకు జరిగి దారివ్వటం ఒకేసారి జరిగాయి.

థాంగ్గాడ్!

లోపలికి మెట్లున్నాయి. ఎక్కడి నుంచో లోపలికి గాలీ, వెలుతురూ ప్రసరిస్తున్నాయి. లోపల ఏ అలికిడీ లేదు.....

గబగబా అన్ని గదులూ వెతికాడు విజయ్.

రంగారావు ఇక్కడ నుంచి తన స్థావరాన్ని మార్చేశాడు. బహుశా.... నాగూ పట్టుబడ్డాక ఈపని చేసి ఉంటాడు. భరించ లేనంత నిరాశగా అనిపించింది విజయ్‌కి.

మరి..... ఇక్కడీ కాపలా దేనికి?

మరోసారి అన్ని గదులూ జాగ్రత్తగా శోధించాడు....

ఎక్కడా ఏ ఆధారమూ లేదు.

తన శ్రమంతా వృధా.

వైజయంతి నేం చేశారు?

చంపేశారా!?




మనసంతా విషాదంగా మారిపోయింది విజయ్‌కి.

ఆ నిశ్శబ్దం..... ఏకాంతం లాలనగా పిలుస్తున్నట్లనిపించింది.

అంతా వెతికి వచ్చి నిస్పృహగా ఆఖరు మెట్టు మీద కూర్చుని మోకాళ్ళ మీదికి తల ఒంచుకున్నాడు.....

రెండు అశ్రు బిందువులు జారి అతని మోకాళ్ళను తాకాయి.....

అంతగా కదిలి పోయాడతనా ఊహకి.....

ఎంత పోలీసాఫీసరైనా .... అతనూ మనిషే. అతనిలోనూ చీమూ నెత్తురే ప్రవహిస్తోంది. అతనికీ కోరికలు, అనుభూతులూ ఉంటాయి.

మానసిక, శారీరక శిక్షణ కూడా..... అది ఎంత కఠినమైన దయినా మనిషి మీద తన ప్రభావాన్ని ఒక దశవరకే చూపగలదు. ఆ దశ దాటకుండా చూసుకోవాలి. కానీ... మనిషన్న వాడికి ఎప్పుడో ఒక్కసారయినా అది అసాధ్యమవుతుంది.

ఇప్పుడు విజయ్ ఆ పరిస్థితిలోనే ఉన్నాడు. అతని మనసంతా అతి భారంగా ఉంది.....

అయిదు నిమిషాలు ..... అయిదే అయిదు నిమిషాలు ఇలాంటి ఏకాంతంలో తన గాంభీర్యాన్నీ .... హోదాని... మగాడిననే అహాన్నీ వదిలేసి తనివితీరా ఏడవాలనిపిస్తోంది....

ఈ స్థితిలో అతనున్నది చాలా కొద్దిసేపు మాత్రమే.

అతను మళ్ళీ మామూలుగా..... డి. ఎస్. పి. విజయ్‌గా మారిపోయాడు. ఆ

## డి. ఎస్. పి. విజయ్

నిశ్చలత..... డ్యూటీమైండ్.... గాంభీర్యం వచ్చి అతన్ని చేరాయి,

లేచి నిలబడ్డాడతను. నాలుగడుగులేసి ఆగిపోయాడు అనుమానంగా.

ఎక్కడ నుంచో సన్నని రోదన వినిపిస్తోంది. చెవి ఒగ్గి శ్రద్ధగా విన్నాడు. రోదన ఆగి పోయింది.

అతని కళ్ళు చురుగ్గా అయ్యాయి....

హాల్లో ఎడా పెడా ఉన్న గదులు కాక ఎదురుగా గోడపైన ఒక వెంటిలేటరుంది. కిందద్వారం లేదు గనక తను అటువేపు రూముండొచ్చని ఊహించలేదు....

అక్కడున్న పిల్లర్ పట్టుకుని పైకి పాకి వెంటి లేటర్ కమ్మి అందుకుని, అంచు మీద కాలు ఆనించి అవతలికి చూశాడు విజయ్. అట్టు ఒక చిన్న గది ఉంది. ఇటు వేపు నుంచి అందులో కెళ్ళటానికి దారిలేదు.

లోపల ఏడేళ్ళ కుర్రాడు ఒక స్తంభానికి ఛాతీ వరకూ కట్టబడి ఉన్నాడు. ఎదురుగా బల్లమీద ఉన్న ఆహారాన్ని తినటానికి చేతులు మాత్రం ఏ బంధనం లేకుండా ఉన్నాయి.

ఎదురుగా ఉన్న బల్లమీద బిస్కట్లు, పళ్ళెంలో అన్నం పప్పు, ఒక చెంబులో మంచినీళ్ళూ ఉన్నాయి.

వాడు వాటిని ముట్టుకోకుండా బిక్క మొహ మేసుకుని చూస్తూ ఉండీ ఉండీ ఏడుస్తున్నాడు.

ఎవరీ కుర్రాడు? ఎందుకిక్కడ బంధించారు?

రంగారావుకు ఆ పిల్లాడిని చంపే ఉద్దేశ్యం లేదు. అది స్పష్టంగా తెలిసి పోతూనే ఉంది. ఆ కుర్రాడి నిక్కడికి తెచ్చి ఎన్ని రోజులో అవలేదు. అయి ఉంటే వాడంత ఫ్రెష్‌గా ఉండడు. బహుశా.... త్వరలో వీడినిక్కడి నుంచి తరలించొచ్చు.

ఏదో పర్పస్‌కు కాకపోతే రంగారావీ పని చెయ్యడు. వీడెవడో వెరీ ఇంపార్టెంట్ పర్సన్ అయి ఉంటాడు.

తెల్లార వస్తోంది. ముందీ కుర్రాడితో సహా ఇక్కడ నుంచి బయటపడాలి. తెల్లారి పోతే.... గదిలో అంతా మేల్కొన్నారంటే తనిందులో సజీవ సమాధి అయిపోతాడు.

వెంటి లేటర్ సందులో తను పట్టడు గానీ.... వాడు తేలిగ్గా పడతాడు.

ఒక్క అరసెకను ఆలోచించాడు విజయ్......

"బాబూ." అన్నాడతను లోపలికి చూస్తూ.

రెండో పిలుపుకు వాడు తల ఎత్తి భయంగా చూశాడు.

"ఆ తాళ్ళు విప్పుకుని, ఒక కొస పైకి .... నాకు అందేలా విసురు. పై కొద్దుగాని. ఇక్కడ నుంచి వెళ్ళిపోదాం". అన్నాడు విజయ్.

వాడి కళ్ళలో చెప్పలేనంత ఆశ్చర్యం. విజయ్ వేపు అనుమానంగా చూశాడు.

"త్వరగా విసురు. టైం లేదు." లాలనగా అన్నాడు విజయ్.

వాడు కట్లు విప్పుకోటానికి ప్రయత్నించి "రావటం లేదంకుల్." అన్నాడు నిస్సహాయంగా. వాడి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఇంకోసారి ప్రయత్నించు. వచ్చేస్తుంది. అది వస్తే నువ్వుపైకి రావొచ్చు. రాక పోవటమేమిటి? షేమ్! గట్టిగా ప్రయత్నించు. మరి నువ్వు పైకిరావద్దూ?"

పట్టుదలగా ప్రయత్నించి మొత్తాని కాతాళ్ళు విప్పుకోగలిగాడు వాడు. దాన్ని విజయ్ వేపు విసిరాడు.

ఒకటి రెండు సార్లు ఫెయిలయినా ఆ తాడును అందుకోగలిగాడు విజయ్. కానీ అది ఆ కుర్రాడి బరువును ఆపుతుందా?

దాన్ని రెండు వరసలు వేసి, తను తెచ్చిన బెడ్డింగ్ రోప్‌కు ముడివేసి ఒక కొస ఇనప కమ్మికు కట్టి రెండోది లోపలికి విసిరాడతను.

"జాగ్రత్త. గట్టిగా పట్టుకో. తాడు కొంత నడుముకు ముడి వేసుకుని మిగతాది పట్టుకో. నేను పైకి లాగుతాను." అన్నాడు విజయ్....

అలా ఒంటి కాలి మీద నిలబడి వాడిని లాగటం కష్టంగా ఉంది. బలవంతంగా బాలన్స్ నిలుపు కుంటూ లాగిన కొసను చేతికింద నొక్కి పెడుతూ ఎలాగో ఆ కుర్రాడిని అతికష్టం మీద పైకి లాగాడు విజయ్.

ఆకుర్రాడు కమ్మీ పట్టుకుని దూరి విజయ్ చెప్పినట్లు, అతని మెడను గట్టిగా వాటేసుకున్నాడు.

నెమ్మదిగా కిందికిదిగి ఊపిరి తీసుకున్నాడతను.

"నీ పేరు?" అన్నాడు విజయ్ వాడినడుముకు తాడు విప్పిన చోట ఎర్రగా కందిన భాగాన్ని వేలితో రాస్తూ.

"నానీ," అన్నాడు వాడు.

"అంకుల్. మనం నిజంగా బయట కెళ్ళి పోతామా?" అన్నాడు ఆశగా.

"ఊఁ" అంటూ మెట్లెక్కబోతున్న విజయ్ అదిరిపడ్డాడు.

"ఓ ..... గాడ్!" అనే కేక అతని కంఠంలో నుంచి నిస్సహాయంగా బయట కొచ్చింది.

మూసుకుంటున్న గోడ సందులో నుంచి మేనేజర్ మొహం మీద క్రౌర్యం స్పష్టంగా కనిపించింది.

వెంటనే గోడ ఒకటిగా కలిసి పోయింది.

మేనేజర్ కీ పాటికి తెలివి ఒస్తుందనే విషయం తనెలా మర్చి పోగలిగాడు?

అతిచిన్న పొరపాటుకు కూడా ఎంత పెద్ద మూల్యం చెల్లించాల్సి వస్తుందో ఇప్పుడర్థ మవుతోంది..

నానీతో సహా తను ఇందులో బందీ. తప్పించుకునే మార్గం లేదు. ఇలాంటి గోల్డెన్ అపర్ట్యూనిటీని రంగారావు చచ్చినా వదులు కోడు.

తనను ఇందులో మర్డర్ చేసి పారేస్తే ఎవరూ తెలుసుకోలేరు. తమ డిపార్ట్ మెంటు వాళ్ళకి కూడా తనిలా వస్తున్నట్లు తెలీదు.

ఉన్నట్లుండి నానీ గట్టిగా ఏడవటం మొదలెట్టాడు.

"ఎందుకెందుకు?" అన్నాడు విజయ్ ఆందోళనగా.

"మనం బయట కెళ్ళలేంగా ఇంక? నాకు భయమేస్తోందంకుల్. ఆ రంగారావు మంచోడు కాదు....."

"రంగారావు నీకు తెలుసా?"

"వాడే అన్నాడు. నేను అన్నం తినకపోతే ...." ఈ రంగారావు తడాఖా ఏమిటో ఇంకా నీకు తెలీదురా కుర్ర వెధవా. మర్యాదగా అన్నంతిను. లేక పోతే చంపేస్తాను." అంటూ "నేను చెప్పే వరకూ వీడిని జాగ్రత్తగా కాపలా కాయండి. ఈ వెధవని గుప్పెట్లో పెట్టుకుంటే గానీ వీడమ్మ దిగిరాదు. ఆ ముండని లొంగ దియ్యాలంటే వీడు మన చేతిలో ఉండాలి." అని మేనేజర్‌కు చెప్పి వెళ్ళాడు. వెళ్ళేటప్పుడు నన్ను కొట్టి "ఇది శాంపిల్ మాత్రమే. పిచ్చి వేషాలేస్తే అసలు సరుకెలా ఉంటుందో చూస్తావు." అన్నాడు. అంకుల్ ... ఎలాగోలా మనం వెళ్ళిపోదాం." వెక్కిళ్ళ మధ్య అన్నాడు నానీ.

"మీ అమ్మ పేరేమిటి?"

"వైజయంతి."

నిశ్శబ్దంగా ఉన్న ఆ హాల్లో నానీ నోటి నుంచి వెలువడ్డ నాలుగక్షరాలూ బాంబుల్లా పేలాయి.

విజయ్ చేతులు అప్రయత్నంగా నానీ వీపు మీద బిగుసుకున్నాయి. అవి నెమ్మదిగా .... ఆర్తిగా వాడిని గుండెలకదుము కున్నాయి.

"నా.... నీ!" విజయ్ పెదవులు ప్రేమగా ఉచ్చరించాయా పేరును.

(ఇంకా ఉంది)



# కోటయ్య అనుభవం- తన నోటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ల రైతులు.
ఎన్నాళ్లనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు...




























SAA/NIA/2802/TL

పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి.
లేదా ఏజెంటును కలవండి.




న్యూ ఇండియా ఎష్యురెన్స్

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

# చిత్రవిచిత్రాలు

## దెందుకూరి దుర్గాప్రసాద్

'చిత్రా ఆర్ట్స్ పిక్చర్స్' అనే చలన చిత్ర నిర్మాణ సంస్థ నిర్మించే నూతన చిత్రానికి, అందం, నాటకానుభవం కల నూతన నటీనటులు కావలెను. బస్ట్, ప్రొఫైల్, ఫుల్‌సైజ్ ఫొటోలతో యీ క్రింది చిరునామాకు తమ ఫొటోలను యీ నెలాఖర్లోగా పంపాలి.'

ఆ పెద్దక్షరాల ప్రకటన చూసి చక్కని కలర్ ఫొటోలు తీయించి, సకాలంలో పంపించాడు కృష్ణమోహన్.

లోగడ కొన్ని చిత్ర నిర్మాణ సంస్థలకు ఫొటోలు పంపినా ఎటువంటి కాల్ రాలేదు. ఏడెనిమిది రోజులు ఎక్‌నాలెడ్జ్‌మెంట్ కోసం ఎదురు చూడ్డం, ఇంటర్వ్యూ వస్తుందా? రాదా? వస్తే ఏ డైలాగులు చెప్పాలి? నాటకానుభవాన్ని గురించి వివరించే పద్ధతులు... ఇలా అనుభూతులు నెమరు వేసికుంటున్న కృష్ణమోహన్‌కు ఇంటర్వ్యూ రానే వచ్చింది. పరీక్షలు పాసవడం, ఉద్యోగం పొందడం కంటే కూడ ఎక్కువ ఆనందంగా ఫీలయ్యాడు కృష్ణమోహన్.

తన నాటకానుభవ వివరాలు, యోగ్యతా పత్రాలు, ఫొటో ఆల్బం తీసికుని విజయవాడలోని ఒక పెద్ద హోటల్‌కు ఆ రోజు పది గంటలకే చేరాడు కృష్ణమోహన్.

'చిత్రా ఆర్ట్స్ పిక్చర్స్ ఇంటర్వ్యూలు! సెకండ్ ఫ్లోర్ రూమ్ నంబర్ 237' అనే ఇన్ఫర్మేషన్ బోర్డ్ కన్పించింది.

ఒళ్ళంతా జలదరింపు. మనసంతా ఒక పులకింత. అప్పుడే తను చలనచిత్ర నటుడై పోతున్నట్లు ఒక వింత అనుభూతి. వీటన్నిటినీ మనసులో అదుము కుంటూ ఒక స్ట్రాంగ్ కాఫీ తాగి లిఫ్ట్‌లో సెకండ్ ఫ్లోర్ చేరాడు.

237 వ నంబర్ గది ముందు సుమారో ముప్పై నలభై మంది యువకులు గుమికూడి ఉన్నారు.

ఎందుకో వళ్ళంతా చెమట. కర్చీఫ్‌తో మెడ, ముఖం తుడుచుకొని గట్టిగా గాలి పీల్చి వదిలాడు కృష్ణమోహన్.

రూమ్ముందుకి వెళ్ళాడు మనుషుల్లో చోటు చేసికుంటూ. ఎదురుగా దర్శకుడు కాబోలు ఆర్టిస్టుల ఫొటోలు చూస్తూ అనుభవం, వివరాలు తెలుసుకుంటున్నాడు. ఆయనకు అసిస్టెంట్ ఫొటోలందివ్వడం వగైరా చేస్తూ పేర్లు పిలుస్తున్నాడు.

పక్కన రెండు కుర్చీల్లో ఇద్దరు పెద్ద మనుషులు మల్లెపూల లాటి బట్టలు వేసికొని స్థిమితంగా ఏ వ్యాపకం లేకుండా కూర్చున్నారు. నిర్మాత లయ్యుంటారు. కాస్తంత దూరంగా ఇద్దరు ముగ్గురు నాజూకైన ఆడవాళ్ళు నిల్చున్నారు. బహుశా నటీమణులు కావచ్చు.

కొంతమంది చేత ఏవో డైలాగ్స్ చెప్పిస్తున్నారు. మరి కొందర్ని ప్రశ్నలు మాత్రమే వేస్తున్నారు. స్పష్టంగా వినబడ్డం లేదు. అరగంట తర్వాత ఆఫీస్ బోయ్ 'కృష్ణమోహన్' అని పిల్చాడు.

నాటకానుభవమున్నా నటనంటే భయం లేకపోయినా వళ్ళు ఝల్లు మన్నది ఏమడుగుతారోనని.

నమస్కారమండీ! లోపలి కడుగు పెడుతుండగానే 'కూర్చోండి' అన్నాడు డైరెక్టర్ నవ్వు ముఖంతో. "మీ అనుభవమేమిటో చెప్పండి?"

"కాలేజీ రోజుల్నుంచి నాటకాలు వేస్తున్నాను. సాంఘికాలే ఎక్కువ. రేడియో నాటికల్లో గూడ పాల్గొన్నాను. మీరవకాశం యిస్తే ఏ పాత్రలోనైనా రాణించగలననే నమ్మకముంది" అన్నాడు కృష్ణమోహన్ గొంతు సవరించుకొని పెదాల మీద నవ్వుతూ.

'మీరేం చేస్తున్నారు?'

"ఎలక్ట్రిసిటీ రెవిన్యూ ఆఫీసులో గుమాస్తా!"

"చూడండి కృష్ణమోహన్‌గారూ! ఇది మా సంస్థ నిర్మాణం చేస్తున్న మొదటి చిత్రం. టెక్నీషియన్లను మంచి వాళ్ళను పెడుతున్నాం. కేవలం ఆర్టిస్టులను మాత్రమే కొత్త వాళ్ళను తీసికుంటున్నాము. మీరు మాకు నచ్చారు. ఒక కేరెక్టర్ యిస్తాం. ఎన్నో రకాల రిస్క్ తీసుకొని యీ చిత్రం తలపెడుతున్నాం. అందుచేత మీరొక ఐదు వేలివ్వగలిగితే మీ వేషం గ్యారంటీ" అన్నాడు దర్శకుడు సాభినయంగా. కృష్ణమోహన్ ఆలోచనలో పడ్డాడు. ఎలాగో ఐదు వేలు కట్టలేకపోడు. తనకు చిత్రాల్లో నటించాలనే గాఢాసక్తి ఉన్నది. తన నటన మీద తనకు నమ్మకముంది. కాని డబ్బు ఎదురిచ్చి వేషం కొనుక్కోవాలనే దాహం మాత్రం లేదు. పైగా ఇలా ఆర్టిస్ట్‌ల దగ్గర డబ్బు డిమాండ్ చేసే సంస్థలను నమ్మరాదని కొంత మంది చెప్పారు. పూర్తిగా తిరస్కరించడం కాకుండా ఆలోచించి డెలికేట్‌గా యిలా చెప్పాడు జవాబు.

'కొత్త వాళ్ళతో చిత్రం తీయడం చాలా రిస్కనే మాట నిజం. మీ కభ్యంతరం లేకపోతే నా ఖర్చులు నేను పెట్టుకొని, మీరెక్కడికి రమ్మంటే అక్కడికి వచ్చి, నా వేషం పూర్తి చేస్తాను. అంతే తప్ప ఒక్కసారిగా ఎమౌంట్ చెల్లించలేను". సాభిప్రాయంగా దర్శకుడి కళ్ళలోకి చూశాడు కృష్ణమోహన్.

అతని ఎత్తుగడకు ఆ బోగస్ నిర్మాణ సంస్థ తాలూకు డైరెక్టర్ చిత్తయ్యాడని చెప్పాలి.

"సరే! మీ ఫొటోలు చిరునామా యిచ్చి వెళ్ళండి. ఏ సంగతీ వ్రాస్తాము" అనడంతో కృష్ణమోహన్ నిష్క్రమించాడు.

★ ★ ★ ★

ఇలాంటి అనుభవాలు ఐదారు గడిచిన తరువాత నూతన నటీనటులు కావాలనే ప్రకటన చూచి, ఉబ్బితబ్బిబ్బవడం మానుకున్నాడు కృష్ణమోహన్. మంచి దర్శకుడు, పేరున్న నిర్మాణ సంస్థ ఏదైనా పిలిస్తే తప్ప ఇంటర్వ్యూలకు వెళ్ళి, డబ్బు వ్యర్థం చేయదలచలేదు.

ఇంతలో ఐదారు చిత్రాలు తీసి ప్రస్తుతం అగ్రశ్రేణి దర్శకుడుగా తారాపథంలో ఉన్న రమాకాంత్ క్రొత్త నటీనటుల నాహ్వానిస్తూ, ఇంటర్వ్యూలకు పిల్చాడు.

రీసెంట్‌గా తీయించిన ఫొటోలతో యీ మాటు మద్రాసు వెళ్ళాడు కృష్ణమోహన్. పరిచయాలు, నాటకానుభవాల వివరాలు, ఫొటో ఆల్బమ్స్ చూడడం, ప్రశ్నోత్తరాలు ముగిసిన తరువాత వచ్చిన రెండొందల నటీనటులను వడబోయగా మిగిలిన పదహారు మందిలో ఒకడయ్యాడు కృష్ణమోహన్. డైరెక్టర్‌గా రొక్కరొక్కర్నీ పిల్చి మాట్లాడుతున్నారు.

ఏదో వాడుగా పిలుపొచ్చింది కృష్ణమోహన్‌కే.

ఒకసారి నమస్కారం పెట్టడం జరిగినా మళ్ళీ ఫార్మాలిటీకి విష్ చేసి నిలబడ్డాడు కృష్ణమోహన్.

'రండి కూర్చోండి' తాపిగా అన్నాడు రమాకాంత్. కొన్ని సెకన్ల తరువాత "కృష్ణమోహన్ గారూ! ఇవాళ దర్శకుడుగా, ఇండస్ట్రీలో గాని, దేశంలో గాని నాకున్న యిమేజ్ మీకు తెలియనిది గాదు. సినిమా సక్సెసవడమనేది సమష్టి కృషి మీద ఆధారపడి ఉంటుంది. ఏ ఒక్కరి లోపమున్నా దర్శకుడిగా ఆ బాధ్యత నా మీద పడుతుంది. అందులో కొత్త ఆర్టిస్టుల్ని మొదటిసారిగా మేకప్ చేయించి నటనలో మీకొక స్థాయిని కల్పించాలంటే మాటలు కాదు. అందువల్ల ప్రొడ్యూసర్ మీకిచ్చే పారితోషికంలో సగం మాత్రం నా కివ్వాల్సి ఉంటుంది" అన్నాడు ముక్తసరిగా సిగరెట్ ముట్టించుకుంటూ.

కృష్ణమోహన్‌కు షాక్ ట్రీట్‌మెంట్ ఇచ్చినట్లయింది. వరకట్నాల నిర్మూలనకు, కులాంతర వివాహాల ప్రోత్సాహానికి, సామాజిక సమస్యల పరిష్కారానికి, చిత్రాలు నిర్మించి అవార్డులు పొందే దర్శకుని మనస్తత్వం యింత నిష్ఠ దరిద్రంగా ఉంటుందని అతడూహించలేదు.

"ఏమిటాలోచిస్తున్నారు?" రమాకాంత్ ప్రశ్న.

"ఆ! ఏమీ లేదు. అసలు పారితోషికంగా నాకెంతొస్తుందంటారు?" కృష్ణమోహన్ ఎదురు ప్రశ్న.

"పది వేలకు పైనే!"

తీవ్రంగా ఆలోచన మొదలైంద తనిలో. ఖర్చులు పెట్టుకుని మద్రాసొచ్చి, అభినయం, కంఠస్వరం, సంభాషణా రీతి అన్ని పరీక్షల్లో ఉత్తీర్ణుడై కూడ దర్శకుడికి సగమివ్వాలంటే ఎందుకో అతని కర్థం కాలేదు.

ఆత్మాభిమానం అతణ్ణా పని చేయవద్దంటోంది. కాని అవకాశం వదులుకుంటే మళ్ళీ వస్తుందో రాదో అని దుగ్ధ! ఇంత సేపాలోచిస్తున్నారేమిటి? అన్నట్టుగా చూశాడు దర్శకుడు.

అంతర్మథనంలో చివరకు కృష్ణమోహన్ ఆత్మాభిమానమే నెగ్గింది. ఇంటికి వెళ్ళి వెంటనే ఉత్తరం వ్రాస్తానంటూ వెనుదిరిగాడు. అక్కడున్న నలుగురైదుగురు సువర్ణావకాశం పోగొట్టుకున్న 'అమాయక చక్రవర్తి రా' అని ముసి ముసిగా నవ్వుకున్నారు.

* * * *

కొన్ని నాటకాలు, ఏకపాత్రాభినయాలు వేస్తూ చిత్రరంగంపై ఆశతో కాలం గడుపుతున్నాడు కృష్ణమోహన్. ఆ రోజు పేపర్లో సెక్స్, క్రైం చిత్రాల డైరెక్టర్ రామాయణరావు నూతన నటీనటులు కావాలంటూ చేసిన ప్రకటన కనపడింది.

ఛాయాచిత్రాలు, యోగ్యతా పత్రాలు తీసికుని ఇంటర్వ్యూ డేట్‌కి హైదరాబాద్ చేరాడు. టెస్టులన్నిటిలో ఫస్టున వచ్చాడు. దర్శకుడు రామాయణరావు కృష్ణమోహన్‌కు ఉపనాయక పాత్ర నిచ్చినట్టు చెప్పి సాయంత్రం హోటల్‌లో కల్సుకోమన్నాడు.

మళ్ళీ కథ మామూలే!

రమాకాంత్ సగమడిగితే, రామాయణరావు మొత్తం పారితోషికం తనకే కావాలన్నాడు. తను ఎంత రిస్కు తీసికోవాలో కొత్త ఆర్టిస్టులతో సవివరంగా వివరిస్తూ, నటనతో డైలాగులు చెప్తూ....

అసలిలాటి దర్శకుల మనస్తత్వ మేమిటో కృష్ణమోహన్ కర్థం కాలేదు. ఆదర్శాలు, అభ్యుదయాలు, సంస్కరణోపన్యాసాలు తెర మీద చూపడం! అంతులేని స్వార్థం, కుళ్ళు, అర్థంలేని షరతులు, అమాయకులను మోసం చేసే తంతులు తెరవెనుక. ఈ ద్వంద్వ బుద్ధులు చూస్తే అసహ్యం కలుగుతోంది.

సామర్థ్యం, నటనానుభవమున్న కళాకారుడు తను. ఎదురు పారితోషిక మిచ్చి ఎలాగైనా నటించాలనే తపన లేదు. గత అనుభవాలు నెమరు వేసికుంటూ "ఇప్పుడు సెలక్ట్ చేసిన వారందరి దగ్గర యింతేనా సార్?!" అన్నాడు ప్రశాంత గంభీరంగా కృష్ణమోహన్.

"నా దగ్గర మొదటిసారిగా యాక్ట్ చేసే ఏ ఆర్టిస్టైనా యింతే!" గర్వంగా చెప్పాడు రామాయణరావు.




ఇలా అంగీకరించేటట్టైతే మూడేండ్ల నాడే రమాకాంత్ పిక్చర్లో నటించే వాడినని చెప్తూ రామాయణరావుతో ఘర్షణ పడి బయటికొచ్చేశాడు కృష్ణమోహన్. □

## పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## బాల్యం శాపం కాకూడదు

కవుల కావ్యాలలో ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకున్న బాల్యం నేడు పేదరికానికి అమ్ముడుపోయి, బస్టాండులలో, రైల్వే ప్లాట్‌ఫారాలలో నివసిస్తుంది.

దైవానికి ప్రతీకలుగా కీర్తించబడ్డ బాలలు కొందరికి అసహ్యం కలిగిస్తూ, మరి కొందరి చేత జాలి పొందుతున్నారు.

ఈనాడు దేశంలో బాలల దీన స్థితిని నిశితంగా పరిశీలిస్తే కళ్ళు చెమర్చక మానవు.' బాల్యం— ఓ మధురమయిన కావ్యం! అది జీవితాంతం మనిషిని వెంటాడే తీయని అనుభూతి. కాని నేడు బాల్యం ఒక శాపం అయింది.

రోజు రోజుకీ వారిమీద అత్యాచారాలు, నేరాలు అధికం అవుతున్నాయి. కారణం ఏమిటని ప్రశ్నించుకుంటే ఎన్నో సమాధానాలు.

బాధ్యతతో క్రమశిక్షణగా పిల్లల భవిష్యత్తును తీర్చి దిద్ద వలసిన తల్లిదండ్రుల నిర్లక్ష్యం వారికి స్వేచ్ఛనిచ్చి, వారి పతనానికి దారి తీయిస్తుంటే, కొన్ని చోట్ల సంసార జీవితంలో కలతలు, మనస్పర్థలు భార్యాభర్తల మధ్య విడాకుల్ని సృష్టిస్తుంటే, సుందరమయిన బాలల బంగారు భవిష్యత్తు వూహించరాని మలుపు తిరుగుతుంది.

మరికొన్ని చోట్ల సవతి తల్లుల అనాదరణ, ఆత్మీయతను, అనురాగాన్ని దూరం చేసి హింసిస్తుంటే, ఆ కుటుంబంలో ఇమడలేక పిల్లలు పారిపోవడం జీవితాల్ని కుక్కలు చింపిన విస్తరిలా చేసుకోవడం జరుగుతుంది.

ఇంకా పేదరికం, చెడు అలవాట్లు, చెడు సహవాసాలు, స్వార్థం, వీరి జీవితాల నెంతగానో నష్టపరుస్తున్నాయి. ఆదరణ, ఓదార్పు కరువై బస్టాండులలో, రైల్వే ప్లాట్‌ఫారాలలో రోడ్ల ప్రక్కన కాగితాలు, ఇనుప



ముక్కలు, ప్లాస్టిక్ సామాన్లు ఏరుకుంటున్న వీరి జీవితాలను చూస్తుంటే హృదయంలో బాధ సుడులు తిరుగుతుంది. వీరిపై జరిగే అత్యాచారాలు, నేరాలు వింటుంటే వెర్రి తలలు వేస్తున్న నాగరికత మీద అసహ్యం కలుగుతుంది. వయఃపరిమితి మరిచిన కామాంధుల కామదాహానికి ఎందరో మైనర్ బాలికలు ఆహుతి అవుతున్నారు.

ప్రభుత్వం చట్టాలు చేసినంత మాత్రాన సరిపోదు. వారి జీవితాల్లో వెలుగు నింపడానికి నైతికంగా మన బాధ్యత ఎంతయినా వుంది. వారి అభివృద్ధి, నడవడిక మీద మన రేపటి భవిష్యత్తు చాలా ఆధారపడి వుంది. అన్న విషయం మనం గుర్తించాలి!

— యం.డి. సర్దార్ పాష,
పుల్లూరు (ఖమ్మం)




## ప్రేమానురాగాలు కావాలి!

ఈ ప్రపంచంలో నూటికి తొంభైశాతం మంది 'ప్రేమ, అనురాగం, ఆప్యాయత' లాంటి భావాత్మక భావనలకు దూరమై వాటి కోసం అర్రులు చాస్తూ, వ్యధతో జీవిస్తున్నారని ఒక సర్వేలో వెల్లడైంది. స్వతంత్ర వ్యక్తిత్వం ఆలోచనా పరిజ్ఞానం కల పెద్దలే ఇబ్బందుల పాలవుతున్నారు. మరి ఏ వికాసం లేని చిరుప్రాయపు పాల బుగ్గల దీన గాథలు ఈ ధరిత్రిలో కోకొల్లలు.

చాలామంది మానసిక దౌర్బల్యానికి లోనై వ్యసనపరులై పశువులుగా మారి తమ బాధ్యతలను, కర్తవ్యాలను మరచి పోతున్నారు. ఆ వ్యసనాలు— వ్యభిచారం, త్రాగుడు, జూదము మొదలైన వాటి వల్ల పతనమైన మనిషి తన్నుతానే పోషించుకో లేక తనను నమ్ముకున్న వారిని, తన సంతతిని రోడ్ల మీదికి వదులు తున్నాడు. రోడ్ల మీద పడిన చిన్నారుల భవిష్యత్తు గురించి ఆలోచించి శ్రద్ధ చూపే దిక్కెవ్వరు?



ప్రతి ఒక్కరూ "మదర్ థెరిస్సా"లై ఈ అవని గడ్డపైన ఉన్న బాలలను తీర్చిదిద్ది వారిలో విజ్ఞాన వీచికల్ని నింపి, చదువు సంధ్యలు నేర్పితే రాబోయే తరంలో 'చిన్నారి బాలల దీనగాథలు' మటుమాయమై కొత్త విజ్ఞాన మూర్తుల ప్రపంచ మేర్పడుతుంది.

విద్య, వివేకం లోపించడం వల్లనే చాలామంది తమ బిడ్డల భవిష్యత్తును నాశనం చేస్తున్నారు. అందుకే నిర్బంధ విద్యను ప్రవేశపెట్టాలి. నేటి చిన్నారి బాలలే రేపటి చిన్నారులకు తండ్రులవుతారు. వారు వారి పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పగల్గుతారు. పిల్లల మనసు గమ్యం తెలియని గాలిపటం లాంటిది. ఆ లేత మనసుకు ఆ మనసు గూర్చి తెలియ జేయాలి. అంటే చిన్నారి బాలలకు చిన్నతనం నుండే మనస్తత్వ శాస్త్రం (సైకాలజీ) గూర్చి తెలియ జేస్తే వారిలో మానసిక వికాసం కల్గి




పెడత్రోవను విడిచి సరియైన పంథాలో పెరగగల్గుతారు.

తల్లిదండ్రులు మరణిస్తే చాలా మంది అనాథలవుతారు. కాని చాల మంది తల్లితండ్రి ఉండి కూడ వారెవరో తెలియక అనాథలుగా బ్రతుకుతున్నారు. అలా అనాథలైనవారు, దొంగలుగా, దోపిడీ దారులుగా, శాడిస్టులుగా మారి సభ్య సమాజంలో కంటక ప్రాయులుగా మారుతున్నారు. ఇందుకు కారణం ఈ వ్యవస్థే, ఆ వ్యవస్థలో ఉన్న ప్రజలే. వారి మనసులో పరివర్తన రావాలి. వారి వల్ల జన్మించిన చిన్నారి బాలలను వారే పోషించాలి. అపుడే వారి భవిష్యత్తు బంగారుబాట అవుతుంది.

—కె. సురేంద్రనాథ్, గోరంట్ల,
అనంతపురం జిల్లా

# పరిస్థితి మారినప్పుడే వారి స్థితి బాగుపడుతుంది

సమాజంలో పేదరికం, దారిద్ర్యం, కులం, మతం ఎలా యుగ యుగాలుగా, తర తరాలుగా పాతుకు పోయి మనిషినీ, మనిషినీ ఎలా విడదీస్తున్నాయో, కలిమి, లేమి ఎలా పరస్పర విరుద్ధంగా కాపురం చేస్తున్నాయో, అలాగే ఈ బాలల పరిస్థితి కూడా ఉంది. పరిస్థితులు, సమాజ వాతావరణం, నిరక్షరాస్యత, ధనికుల ప్రాబల్యం, దౌర్జన్యం, నిరుపేదల నిస్సహాయత, పేదరికం, అనైక్యత, నిరక్షర అజ్ఞానం మొదలైన కారణాలు బాలల దీన, హీనస్థితికి కారణ మౌతున్నాయి. పేదవారు తమ పిల్లల్ని చదివించుకునే స్తోమత, ఆసక్తి లేక ముచ్చటగా

యిప్పుడు నువ్వెళ్ళాల్సింది ఆటలక్కాదురా వెధవ...
కూలికెళ్ళి నాలుగు డబ్బులు సంపాయించుకురా పో..!!

ఆడుకునే వయసులోనే ఏదో ఒక పనిలో, కూలి లేక నాలికి పంపించి వారు తెచ్చే నాలుగు రూకలు తమ సంసారానికి అండగా వుంటాయనే భావంతో ఆటలాడుకో వలసిన వయసులో వారిని కాయకష్టం చేయవలసిన స్థితి కల్పిస్తారు. లక్షలాది మంది బాలబాలికలు ఎండనక, వాననక, పగలు, రేయీ తేడా లేక తమ సంపాదన తాము సంపాదించు కుంటున్నారు. తల్లిదండ్రులకి చేదోడు వాదోడుగా వుంటున్నారు. తిని, హాయిగా ఆడుతూ, ఎండ కన్నెరుగకుండా, వేల రూపాయల దొనేషన్లు కేవలం ప్రాథమిక విద్య కోసమే తల్లిదండ్రులు కట్టి, ఆంగ్ల విద్యతో సరదాగా, హాయిగా, దాబుగా తిరిగే దొరబాబుల వర్గం ఒక వైపు, చదువు- సంధ్యలూ ఆట పాటలూ మృగ్యమై, లేత పాదాలతో, చేతులతో బండెడు చాకిరి చేస్తూ మనసూ, శరీరం కూడా బండబారిపోయే దరిద్రబాలలు మరో వైపూ మన సమాజంలో వెలుగు- చీకట్లలా, తెలుపు- నలుపుల్లా, పౌర్ణమి- అమావాస్యల్లా, దొర- దొంగల్లా, తీపి- చేదుల్లా వ్యతిరేక పరిస్థితుల్లో, ఉత్తర దక్షిణ ధృవాల్లా భిన్న వర్గాలుగా ఉండటం సమాజంలో ఎంతో గర్హనీయం, లజ్జాకరం. బాలలు పెద్దవారితో సమానంగా పనిచేస్తున్నా వారికి చెల్లించబడే వేతనాలు స్వల్పం, సౌకర్యాలు శూన్యం. బాల కార్మికుల కుద్దేశించిన చట్టాలేవీ అమలు జరగడం లేదు. వారి శ్రమశక్తి దారుణమైన దోపిడీకి గురౌతున్నది. ప్రభుత్వం వారికి అమలు చేయవలసిన వేవీ ఆచరణలోకి రావడం లేదు. వారి పని గంటలకి పరిమితిలేదు. అన్ని చట్టాల్లాగే బాల కార్మికుల చట్టం కూడా విఫలమైంది. సమాజంలో కలిమి లేముల తేడా, అధికారి- పనివాడు, రాజు -బానిస, ఆకలి, ఐశ్వర్యం, అక్షరాస్యత, నిరక్షరాస్యత, దౌర్జన్యం - దౌర్బల్యం, బలం- బలహీనత, శాసించేవాడు- తలదాల్చేవాడు, పరపీడనని ఎదిరించలేని నిరాసక్తత, అనైక్యత ఇలాగే కొనసాగినన్నాళ్ళు ఈ బాలల దీన, హైన్య పరిస్థితి మారబోదు. వారి ఆక్రందనలు అడవి పాలు కాక తప్పవు. వారి గొంతులు నొక్కబడటం ఆగదు. వారి హక్కులు హుళక్కి కాక మానవు. వారి చెమట రక్తంగా అమ్ముడు పోక గడవదు. వరకట్నం, లంచం, అవినీతి, 'రెడ్‌టేపిజం లాగే ఇది కూడా సంఘంలో పాతుకు పోయిన జాడ్యం. బాలల, చిన్నారుల దీనగాథలు ఎంతకాలం సాగుతాయో కాలమే చెప్పాలి.

ఎస్. వి. ఈశ్వర్, యూసఫ్‌గూడ,
హైదరాబాద్.

★ ★ ★

# ఆర్థిక అసమానతలే కారణం

నెహ్రూగారికి గులాబీల కన్న బాలలంటే యిష్టం. అందుకే ప్రతి సంవత్సరం ఆయన జన్మ దినము రోజైన నవంబరు 14వ తేదీన మన దేశంలో 'బాలల దినోత్సవం' జరుపుకుంటాము. కాని, ఆ బాలలు నేడు పువ్వుగా పరిమళించకుండానే మొగ్గగానే మోడు బారిపోతున్నారు. ఏ దినపత్రిక చూసినా ప్రతి రోజు 'పిల్లల్ని ఎత్తుకు పోయే ముఠా దొరికిందనో, పిల్లలపై అత్యాచారాలు' అనో చూస్తాము. ఇటీవల ఒక దిన పత్రికలో చూశాను. ఢిల్లీలో పింకి అనే ఆరేళ్ళ పాపను ఎవరో వ్యక్తి కాళ్ళేతులు కట్టి బజార్లో పడేశాడట. ఆ పిల్ల అడుక్కొచ్చే పైసలతో ఆ వ్యక్తి జీవిస్తున్నాడట. ఆకలి, దప్పికలతో ప్రాణాలు వదిలే పరిస్థితిలో పోలీసులు చూసి కాపాడారట. ఈ విధంగా చెప్పుకుంటూ

ఈ సంవత్సరం అత్యాచారాలు జరిపే వాళ్ళని పట్టుకున్న వారికిచ్చిన పారితోషికం ఇరవై కోట్లు సార్!!

కలిమిశ్రీ

పోతే ఎన్నో ఉదాహరణలు.

ఇటువంటి అత్యాచారాలు జర్గటానికి కారణాలు 1. మన దేశంలో నూటికి 48 మంది ప్రజలు దారిద్ర్యపు రేఖకు దిగువన నివసిస్తున్నారు. కాబట్టి పొట్ట నింపుకోవ డానికి, సంసారాలు సాఫీగా సాగటానికి చిన్న పిల్లల్ని దొంగతనంగా పట్టి తెచ్చి అమ్ముతున్నారు. 2. తల్లిదండ్రులపై కక్షలుఉంటే వారిపై తీర్చుకో లేక పిల్లల్ని కిడ్నాప్ చేస్తున్నారు. 3. కొందరు తమ కామదాహాన్ని తీర్చుకోవ డానికి పిల్లల్ని కని, ఏ చెత్తకుండీల లోనో, బజార్లలోనో పడేస్తే ఆ పిల్లలు ఏ కసాయి వానికో దొరికి బలైపోతున్నారు. 4. కొందరు సంఘ విద్రోహులు, పిల్లల్ని పట్టి తెప్పించి వారి చేత బలవంతంగా ఏ భయంకరమైన ఫ్యాక్టరీలలోనో పెట్టి చాకిరీ చేయిస్తున్నారు. 5. మరి కొందరు తల్లిదండ్రులు పిల్లల్ని పోషించలేక అభం శుభం తెలియని పసి వాళ్ళను అమ్ముకుంటారు.

ఈ అత్యాచారాలు అరి కట్టాలంటే 1. ప్రభుత్వము పిల్లల సంక్షేమం కోసం రూపొందించిన పథకాలు సక్రమంగా అమలు జరిగేలా చూడాలి. 2. పిల్లలపై అత్యాచారాలు జరిపిన వ్యక్తులపై కఠినంగా చర్యలు తీసుకోవాలి. 3. పిల్లల్ని నిరాదరణ చేసిన తల్లి దండ్రులపై తగిన చర్యలు తీసుకోవాలి. 4. ఆర్థిక అసమానతలు తొలగించడానికి ప్రభుత్వము వారు కృషి చెయ్యాలి. 5. బాలలపై అత్యాచారాలు జరిపినపుడు పట్టుకున్న వారిని ప్రభుత్వము ప్రోత్సహించి, తగిన పారితోషికం ఇవ్వాలి.

ఈ విధంగా ప్రభుత్వము, సంఘ సేవా తత్పరులు కృషి చేసి మానవ జాతిని ముందుకు నడపవలసిన బాలల పై అత్యాచారాలు అరి కట్టవచ్చును.

-యమ్. సీతారామయ్య,
అన్నవరం □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు : ........................................
పూర్తి చిరునామా : ........................................
........................................
........................................
పిన్ కోడ్ :

'ఉత్తరాలు' శీర్షికకి
రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా
తెలుగు లిపిలో రాయాలని
మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.

# వారఫలం

4-9-1987 శుక్రవారం మొదలు 10-9-1987 గురువారం వరకు

★ **మేషం :** వ్యాపారం సానుకూలమవుతుంది ఆదాయమున్నది. గనులందు, కార్ఖానాలందు పని చేసే వారికి అనుకూలం, రాజకీయంగా మేలు గాదు. స్త్రీలకు · ధన విషయమున, సాంఘిక వ్యవహారాలందు, వస్తు సేకరణ యందు అనుకూలం.

★ **వృషభం :** ఇటీపల చెడిన ఆరోగ్యం ఎలాగో కూడదీసికొంటారు. అనుకూల వర్గమున్నది. మిత్ర బాంధవులతో అభిప్రాయ భేదాలు రాకుండా చూచుకోండి, అంతే చాలు స్త్రీలకు · అభీష్టసిద్ధి, ఆరోగ్యసిద్ధి, అనుకూల మిత్రుల కలయిక.

★ **మిధునం :** నూతన యత్నాలు ఫలిస్తాయి. వృత్తి యందు పెంపున్నది. పలు తావుల నుండి బంధు మిత్రుల నుండి కఠిన వార్తాశ్రవణం కొందరకు, కొందరకు అనవసరంగా ఖర్చులు, విసుగుతో కాలం గడుస్తుంది. శాంతం అవసరం. స్త్రీలకు : అనవసరంగా గొడవలు, ఆరోగ్యభంగం.

★ **కర్కాటకం:** గుర్తుంచుకోండి. ప్రజా రంగాన ప్రసిద్ధి, సాంఘికంగా మేలున్నది రాజకీయంగా మేలు కనిపిస్తుంది. శుభ వర్తమానం. మాటకు విలువ పెరుగుతుంది హటాత్తుగా బంధు మిత్రుల రాక. స్త్రీలకు : ధన విషయంగా మాట పట్టింపులు, అనవసరపు గొడవలు.

★ **సింహం :** కొన్ని వ్యవహారాలలో బాగా పుంజుకొంటారు. ముద్రణ, రచన, పత్రికా ప్రచురణ యందు మీ మాటకు విలువ పెరుగుతుంది. మంచి ఆదాయం చెప్పవచ్చు. స్త్రీలకు : ఆరోగ్యాభివృద్ధి. ప్రయత్నసిద్ధి, రాజకీయాలందు విజయం

★ **కన్య :** వికాసవంతమైన వారం. ఉద్యోగయత్నం చేశారుగా! ఫలిస్తుంది. వ్యవహారం కొరకు బాధపడుతారుగా, అదీ నెరవేరుతుంది. నూతన మిత్రులు చేరుట గమనార్హం స్త్రీలకు : అంతో యింతో లాభదాయకం. ఆర్జించినది అధికంగా ఖర్చు చేయవలసి రావచ్చు.
రచన, నటన, నాట్యాది కళలయందు ప్రావీణ్యమున్న వారికి మేలే!

★ **తుల :** అసాధ్యమైన వ్యవహారాలుంటాయి, ఎలా సర్దుకుంటారో? ఆర్థికంగా చాల యిబ్బందిగా ఉంటుంది. ఎలా ఉంటారో? అధికార మందు పతనం కొందరి విషయంలో చెప్పవచ్చు. నూతన ప్రయత్నాలు సానుకూలమవుతాయి. స్త్రీలకు : సుఖశాంతులు, ఆదాయ వృద్ధి, శుభ ప్రస్తావనలు

★ **వృశ్చికం :** క్రమాభివృద్ధి కనిపించినట్లే కనిపించి మాయమవుతుంది. స్త్రీలతో వివాదాలు రావచ్చు. ఆర్థికంగా పుంజుకొనుటకు యింకా అనుకూలత లేదు. అవకాశవాదులను దాపునకు రానీయకండి. స్త్రీలకు. సమాన జనులతో యిబ్బంది రావచ్చు, గమనించి మెలగాలి ఉద్యోగ మందు పెంపు చేకూరుట నిశ్చయం

★ **ధనుస్సు :** విద్యా వంతులతో, ధనవంతులతో పరిచయం. ఆటపాటల యందు ప్రావీణ్యమున్న వారికి అనుకూలం చాల మందికి ప్రయాణం చేయుటకు అనుకూలం. రాజకీయాలందు శ్రమించి నిరుత్సాహతనందినారుగా! ఇక అలాంటి వాటి జోలి యిప్పట్లో అక్కరలేదు. స్త్రీలకు · వృత్తియందు వికాసం. యత్న కార్యానుకూలం, వివాదాలు పరిష్కరింపబడుటకు అనుకూలం.

★ **మకరం :** పూజ్యులు యింటికి రానున్నారు. ధనవంతుల సహవాసం అమరుతుంది. స్థిర చరాస్తులను గూర్చిన సమస్యలు తల ఎత్తనున్నవి. విద్యావంతుల సాంగత్యం, వ్యాపార విస్తరణ కార్యక్రమం అనుకూలం. స్త్రీలకు : నాటక, నాట్య, సంగీత, చిత్ర రంగావకాశాలు అనుకూలం. అధ్యాసకు అనుకూలం

★ **కుంభం :** ఇదా! అదా! ఏది. ఎలా చేయాలనే తాపత్రయం వారమంతా. ముందుకు వెళ్లాలను కోవటం, వెనక్కు వెళ్లటం. రాజకీయాలందు ప్రగతి సాధించారుగా! కృషితో పదవిని నిలబెట్టుకోండి ముద్రణా యంత్రాంగమందు కృషిగావించే వారికి అనుకూలం. స్త్రీలకు . విద్య, వ్యాపార, వృత్తి, కళా రంగములందు కొంత అనుకూలమే.

★ **మీనం :** 'శని' అనుకూలుడు, ఆశీస్సులున్నాయి. ఆరోగ్యం చెడిన వారికి అనుకూలం. 'శస్త్ర చికిత్స' నుండి కొందరు తప్పించుకొంటారు. లావాదేవీలందు విజయం, కార్యానుకూలం, కళా రంగానుకూలం. స్త్రీలకు : రాజకీయాలలో మెట్టు పైకెక్కవలెననే ఉబలాటం తీరుతుంది. ఆరోగ్య మందు కొంతైనా పెంపు గల వారం.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# దాహం-దాహం

— పవన్.


దేవా! వర్షాలు రావాలి!
దాహం...దాహం!


ఆహా వర్షం! ఓహో వర్షం!


రాష్ట్రంలో వర్షాలు వరదలు.....
ఛీ ఛీ వెధవ వర్షాలు!


భారీవర్షాలమూలంగా మంచినీటి కరువు...


దాహం దాహం
మంచినీళ్ళు కావాలి!

# ప్రేమసాగరమథనం

డాక్టర్ కొత్త రవీంద్రబాబు



సీరియల్

(గత సంచిక తరువాయి)

మద్రాసులోని సినిమా హాళ్ల దగ్గర బస్ డిపోల దగ్గర తిరిగి విసుగ్గా వచ్చి హోటల్ రూమ్‌లో పడుకున్నాడు టైగర్.

అతని అనుచరులలో కొందరు మద్రాస్‌లోని రైలు స్టేషన్ల దగ్గర మరికొందరు హోటళ్ళు లాడ్జింగులు వెతుకుతూ విలాసిని, ఉత్తరాది వాడి ఆచూకీ దొరుకుతుందేమోనని విశ్వప్రయత్నం చేస్తున్నారు.

అందరిలోకి మెరిక లాటి "పండు"తో మాత్రం కోటి ముఠా మీద నిగా వేసి వుంచమని చెప్పాడు టైగర్.

పావు సీసా వాట్ 69 ఖాళీ చేసి పడున్న టైగర్ గదిలో కొచ్చి

"గురూ!" అని పిలిచాడు పండు.

"ఏమిట్రా?"

"కోటి, నాగరాజు టాక్సీల్లో బయల్దేరి వెళ్ళారివాళ! నేనూ వాళ్ళ వెంట మరో టాక్సీలో వెళ్ళాను."

"ఊ! రాఘవరావు పెద్దమ్మాయి కనపడిందా?"

"చెబుతాను సార్! కోటి నాగరాజు స్నేక్‌పార్క్‌లోకి వెళ్ళారు! లోపల రాఘవరావు పెద్దమ్మాయి వుత్తరాది వాడూ వుంటే వాళ్ళను చంపబోయారు!"

"ఆ! చంపబోయారా?"

"అవును బాస్! కాని కోటిని కొండ చిలువ పట్టుకుంది! నాగరాజు పాము కాటుతో మరణించాడు.

"మరి ఆ అమ్మాయి, వుత్తరాది వాడూ?"

"కంచి వెళ్ళే బస్సెక్కి వెళ్ళారు బాస్!"

"అమ్మాయి కనపడితే పట్టుకు రమ్మన్నా గదా!"

"బాస్! ఆ వుత్తరాది వాడు ఒక్కడే కోటి అనుచరులందర్నీ మట్టి కరిపించాడు! అందుకనీ...."

"ఇంకా ఆలస్యం చేస్తావేం? మన వాళ్ళల్లో హోటల్‌కు వచ్చిన వాళ్ళందర్నీ రమ్మను. టాక్సీలు పిలు మిగిలిన వాళ్ళను వచ్చిన వాళ్ళను వచ్చినట్లుగా కంచికి రమ్మన్నామని హోటల్ కౌంటర్ దగ్గర చెప్పు!

ఊ! పద! బిక్విక్!"

పది నిముషాలలో టైగర్, పండు ఇతర అనుచరులతో నిండిన రెండు టాక్సీలు కంచి వైపుగా వెళ్ళాయి.

కంచిలో టాక్సీ దిగిన టైగర్‌కు ఏం చేయాలో పాలుపోలేదు! వూరి నిండా లెక్కలేనన్ని దేవాలయాలు! కోట గోడల్లాంటి ప్రహరీలతో విశాలమైన ఆవరణలున్న ఆ దేవాలయాలలో ఏ మూల ఎవరు దాక్కున్నారో కనుక్కోడం అంత సులభమైన విషయం అని అనిపించలేదతనికి.

ఒకో దేవాలయాన్ని పరిశీలనగా గాలించి చూడడం మినహా మరో మార్గం లేదనుకున్నాడతను.

బట్టల దుకాణంలోకి వెళ్ళి నల్ల లుంగీలు పైపంచలు కొన్నాడు టైగర్. పేవ్‌మెంట్ మీద రుద్రాక్ష మాలలు ఖరీదు చేసాడు. అయ్యప్ప భక్తులలా నల్లలుంగీ నల్ల పైపంచెలతో టైగర్ అనుచరులు ఒకో దేవాలయం ఆవరణా క్షుణ్ణంగా గాలించసాగారు.

'స్వామియే! శరణం అయ్యప్పా

స్వామి శరణం అయ్యప్ప శరణం' అంటూ భక్తి భావంతో తన్మయత్వం చెందిన పది మంది అయ్యప్ప భక్తులూ మెడలో రుద్రాక్షమాలలు అటు యిటూ కదలుతుంటే భజన చేస్తూ దేవాలయం ఆవరణ ప్రతి మూలకు ప్రతి గోడ వెనుకకు వెళ్ళి ప్రణామాలు చేస్తూ వచ్చారు.

హరిహర పుత్రుడైన అయ్యప్ప భక్తులు గనుక వారు శివాలయాలలోనికి విష్ణు ఆలయాలలోనికి కూడా చొచ్చుకు వెళ్ళిపోసాగారు.

నాలుగు దేవాలయాలు తిరిగేసరికి కాళ్ళు నొప్పి పుట్టి మంటపం అరుగు మీద కూర్చుండి పోయారు అయ్యప్ప భక్తులు ఉస్సురంటూ!

* * * *

శంభో శంకర సాంబశివా!

హరహర మహాదేవ!

ఓం హరా శంకరా!

శివ శివ శంకర!

హర హర శంకర!

చిడతలు పుచ్చుకుని భజన చేస్తూ నృత్యం చేయసాగాడు సాంబశివ ఆనంద పారవశ్యంలో. శంభో శంకర సాంబశివ బృందంలోని మిగిలిన సభ్యులు వంత పాడుతూ తామూ ఆనంద పారవశ్యంలో మునిగి పోసాగారు.

విదేశీ మద్యం, గంజాయి దమ్ము వాళ్ళ మనసులను గాలిలో తేలిపోయేట్లు చేసింది.

ఎన్నో దేశాల నుండి వచ్చి ఢిల్లీలోని శంభో శంకర సాంబశివా మఠంలో చేరారు వాళ్ళు మఠంలో చేరటానికి స్త్రీ పురుష వయో భేదం లేకపోయినా చేరే వాళ్ళల్లో ఎక్కువ మంది ముప్పై సంవత్సరాల లోపు వాళ్ళే!

జరిగిన కథ –14 : మూడు ముఠాల చేత వేటాడబడుతూ, మద్రాసు నుంచి కూడ కట్టుబట్టలతో బైటపడి మహాబలిపురం వైపు బయల్దేరుతారు సందీప్, విలాసిని. దారిలో వాళ్ళని చూసిన కోటి, నాగరాజు బృందంతో సహా వెంట బడి స్నేక్‌పార్క్‌లో కలుసుకుంటారు. అక్కడ సందీప్‌కు, నాగరాజు ముఠాకు మధ్య జరిగిన ఘర్షణలో కోటి కొండ చిలువ నోటికి చిక్కుతాడు. నాగరాజును తాచుపాము కాటు వేస్తుంది. సందీప్, విలాసిని మహాబలిపురం బయల్దేరారని తెలిసి విజయరాఘవన్ వెంబడిస్తాడు. వాచి, డబ్బులు పోగొట్టుకున్న సందీప్, విలాసినిలు కంచి చేరతారు. అక్కడ వాళ్ళకు సాంబశివ భక్త బృందంలో రాణి కనబడుతుంది.




ఆరు నెలల పాటు ఢిల్లీలోని కేంద్ర మఠంలో భజనలు, కీర్తనలు, పాటలు, తత్త్వ బోధలు నేర్చుకున్నాక పది పదిహేను మంది ఒక బృందంగా ఏర్పడి దేశం నలుమూలలూ పర్యటన చేస్తూ వుంటారు.

ఇందు గలడందు లేడని సందేహం లేని పరమశివుడు ఒక్క దేవాలయాల్లోనే గాక ఎక్కడ పడితే అక్కడే వుంటాడు గనుక ఆ సర్వాంతర్యామిని వెతుక్కుంటూ పట్టణాలు పల్లెలు కొండలు కోనలూ సర్వప్రదేశాలు తిరుగుతూ వుంటారు సంచార బృంద సభ్యులు.

ప్రతి సంచార బృందానికి ఒక నాయకుడుంటాడు. అతన్ని "సాంబశివ" అని పిలుస్తారు మిగిలిన వాళ్ళు! బృందంలోని సభ్యులందరూ అతని మాట వినాలి! విధిగా ప్రతి బృందంలోను కొంత మంది యువతులుంటారు!

స్వదేశం వదలి స్వజాతీయులను వదలి కేవలం భక్తి పారవశ్యంతో భూమి నాలుగు చెరగుల నుండి వచ్చిన శంభో శంకర సాంబశివా మిషన్ సభ్యులకు కొన్ని నియమాలున్నాయి.

తమ సంస్థకు సంబంధించిన కొన్ని విషయాలు ఎవరికీ ఆఖరుకు పోలీసులకు కూడా చెప్పరు – తమను చిత్రహింసల పాలు చేసినా కూడా చెప్పరు.

భారతదేశ యాత్రలో తమకు తెలిసిన లేదా తాము గ్రహించిన ప్రతి విషయం ఢిల్లీలోని కేంద్ర సంస్థకు తెలుపుతారు.

మదిర, మాంసం, మైథునం – మూడు మకారాల విషయంలో సభ్యులకు పూర్తి స్వేచ్ఛ వున్నది శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణేంద్రియము లైదు

## ప్రేమసాగర మథనం

పరిపూర్ణానందంతో తృప్తి పడినప్పుడు జీవుడు తన్ను దా తెలుసుకుని బ్రహ్మ పదార్థంతో మమైకం చెందే స్థితి వస్తుందనే బోధ ననుసరించి- కామిగాక మోక్షగామిగాడు అనే సూక్తి ననుసరించి- ఇంద్రియ వాంఛా తృప్తి విషయాల్లో కఠిన నియమాలనుసరించరు!

బృంద సంచారం, ఇంద్రియ వాంఛా తృప్తి, డబ్బు విషయాలు గాని మిగిలిన లౌకిక విషయాల గూర్చి ఏ మాత్రం బాధపడవలసిన అవసరం లేకపోవటం - దాంతో శంభో శంకర సాంబశివా సంస్థలో జేరే యువతీ యువకుల సంఖ్య దినదినాభివృద్ధి చెందుతున్నది!

సంచార బృందాధిపతి సాంబశివ నేతృత్వంలో మిగిలిన వాళ్ళు నడుచుకుంటారు. అతనా బృందానికి సర్వం సహాధికారి! తన బృందంలోని సభ్యుల బాగోగులు, ఆరోగ్యం మొదలగు విషయాలు చూడటమే గాకుండా సభ్యులను వెనుకకు పంపటం, కొత్త సభ్యులను జేర్చుకోవటం మొదలగు విషయాలలో అతనికి పూర్తి స్వేచ్ఛ వుంటుంది.

మద్రాసు అడయారులోని వటవృక్ష ఛాయలో శంభో శంకర సాంబశివా బృందం విశ్రమించి వుండగా సుడిగాలిలా వచ్చింది రాణి!

అప్పటికి రెండు రోజుల ముందు బృందంలోని ఫ్రెంచి యువతి అనారోగ్య కారణాల వలన ప్లేన్‌లో ఢిల్లీ వెళ్ళిపోయింది. బృందంలోని యువతీయువకుల సంఖ్యలో సమతూకం తప్పి పోయిందెలానా అని చింతిస్తున్న సాంబశివ ముఖం రాణిని చూడగానే ఆనందంతో నిండిపోయింది!

"ఈమె బృందంలో జేరితే బాగుండును!" అనుకుంటూ నెమ్మదిగా ఆమెను మాటలలో దింపాడు సాంబశివా!

"హలో బేబీ!"

"ఎవర్ని పిలిచారు?" అంది రాణి.

"నిన్నే బేబీ! పున్నమి చంద్రునిలా వెలిగిపోతున్న ముఖం నీకు తప్ప మరెవరికుంది!"

"నిజంగా?"

"హంస మెడ లాటి నీ మెడలో రుద్రాక్ష తావళాలుంటే ఎంత అందంగా వుంటుంది!"

"ఆ!"

"విశాలమైన నీ నెన్నుదురుపై విభూది రేకలు వింత అందాన్ని సమకూర్చుతాయి."

"రియల్లీ!"

"తారక మంత్రం ముద్రించిన చీరె ధరించి చిందులు వేస్తే నిన్ను చూడటానికి రెండు కనులు చాలవు" సాంబశివ ఎక్కువ శ్రమ పడకుండానే రాణి సంచార బృందంలో జేరిపోయింది!



పాల పొంగు లాంటి యవ్వనోత్సాహపు మిసమిసలో వున్న రాణి రాకతో బృంద సభ్యులలో కొత్త జీవం జవం తొణికిసలాడాయి.

ముందు నాయకుడు, తర్వాత మిగిలిన యువకులు వరుసగా రాణితో జత గూడి ఆనందలోకాలలో విహరించారు!

అంతా బాగానే వుంది - కాని రాణి ప్రవృత్తి ఎవరకూ అర్థం కాలేదు! ఇంద్రియ వాంఛా పరి పూర్తి చెందుతూ ఆనంద పారవశ్యంలో మునిగి వున్నప్పుడు హలీవుడ్ సినిమా తారల పేర్లు వల్లిస్తుంటుంది!

సిల్వెస్టర్ స్టాలోన్ పేరు సరేసరి! సర్వాంతర్యామి అయిన పరమశివుని నామం కన్న సిల్వెస్టర్ స్టాలోన్ నామం ఎక్కువ సార్లు జపిస్తుందామె!

ఆ వొక్క లోపం మినహా బృందంలో ఫ్రెంచి యువతి లేని కొరత తీరుస్తూ - అందర్నీ సంతోష పెడుతూ వున్నది రాణి!

మద్రాసు నుండి బయల్దేరిన డివైన్ గ్రూప్ తర్వాత మకాం కంచిలో ఆగారు!

వూరి బయట పురాతన శివాలయ మండపంలో విడిది చేసి కమండలాల్లో వున్న మద్యం కొద్దిగా సేవిస్తూ గంజాయి దమ్ము లాగసాగారు డివైన్ గ్రూప్ సభ్యులు.

రాణి మాత్రం పరధ్యానంగా మంటపం స్తంభాని కానుకుని వుండిపోయింది! మధ్యాన్నం ఏకాంబరేశ్వరాలయంలో విలూ అక్క, ఆమె మేనమామ కొడుకు కనపడ్డ దగ్గర్నుండి రాణి మనసు మనసులో లేదు!

అతను - దీప్ - ఎంత అందంగా - పరమశివునిపై బాణా లేసిన నవమన్మథునిలా వున్నాడు!

ఎంత మధురంగా వున్నా యతని మాటలు! ఒక్కసారి అతని బిగి కౌగిలిలో కరగి తేనెల సోనలూరే అతని పెదాలను ముద్దిడి......

"రాణీ!" సాంబశివ పిలుపుతో యీ లోకంలోకి వచ్చింది రాణి.

ఏమిటి? అన్నట్లు విసుగ్గా చూసింది అతని వంక!

"ఇలా రా బేబీ!"

రాణి పలుక లేదు!

"బేబీ! కమాన్!"

"తలనొప్పిగా వుంది!"

"రియల్లీ! చిలుం పీల్చావంటే తలనొప్పి పోతుంది."

"ఉహూ!"

రాణి మూడ్ బాగా లేదని వదిలేసి వూరుకున్నాడు సాంబశివ!

ఆకాశంలో నక్షత్రాలు మిలమిల మెరుస్తుంటే మంటపంలో డివైన్ గ్రూప్ సభ్యులు చిలుం పీల్చి స్కాచ్ విస్కీ గ్రోలి ఆనంద పారవశ్యంలో జంటలు కట్టి కాలగమనం మర్చిపోయారు.

"సాంబశివా!"

"ఉ!" మగత నిద్రలోంచి మేల్కొన్నాడు సాంబశివ.

"రాణి మన బృందం వదలి వెళ్ళిపోతుంటే పట్టుకొచ్చాం" నలుగురు శిష్యుల మధ్యన వున్నది రాణి.

"నిజమేనా బేబీ!"

"నిజమే! నేను విలూ అక్క దగ్గరకెళతా! నాకిక్కడ బాగా లేదు!"

"బేబీ! సంచార బృందంలో సభ్యులెవరూ బృందం వదలి వెళ్ళగూడదు!"

"అవన్నీ నాకనవసరం! విలూ అక్క దగ్గర కెళతా!"

"విలూ అక్క దగ్గరకా లేక విలూ అక్క పక్కన వున్న యువకుని దగ్గరకా?"

"ఎవరి దగ్గరం కెళితే నీకేం? దీప్ ఎంచక్కా సిల్వెస్టర్ స్టాలోన్‌లా వున్నాడు! గడ్డాలు మీసాలు రుద్రాక్షమాలలూ, విభూది రేఖలూ మిమ్మల్ని చూసి చూసి విసుగెత్తిపోయింది!

దీప్ హనీమూన్ సినిమాలో హీరోలా వున్నాడు!"

"రాణీ! నువ్విలా మాట్లాడగూడదు"

"ఏం? నా యిష్టం వచ్చినట్లు మాట్లాడుతా!" చప్పున లేచి రాణి చెంపలు వాయించాడు సాంబశివ.

క్షణాలలో రాణిని పెడరెక్కలు విరిచి కట్టారు.

కొరడాతో బాదాడు సాంబశివ.

వెలిగించిన సిగరెట్‌తో రాణి శరీరంలోని సున్నితమైన భాగాలను కాల్చాడు.

# రచయిత జవాబులు



నందూరు లీలాప్రసూనాదేవి, హైదరాబాద్

ప్ర : శృంగారం లేని నవల పత్రికలలో ప్రచురించటం లేదు.

జ : అరుదుగానైనా అలాటి నవలలు వస్తున్నాయి. కథను బట్టి రసం – సన్నివేశం వుంటాయి.

వి. రవీంద్రబాబు, గూటి

ప్ర : మీ రచనలన్నీ సూపర్ హిట్.

జ : థాంక్యూ.

ప్ర : షేక్స్‌పియర్ రచనలు నేటికీ ఆదరం పొందుతున్నవి కాని నేటి రచనలు దశాబ్దం కాలం నిలవడంలేదు.

జ : షేక్స్‌పియర్ లాంటి కాలాతీత వ్యక్తులు అరుదుగా జన్మిస్తుంటారు.

వి. శ్రీనివాసరావు, ఒంగోలు

ప్ర : అన్నదమ్ముల మధ్య ప్రేమ అభిమానం వయసు పెరిగినకొద్దీ తగ్గిపోతుందెందుకు?

జ : జీవితం కాంప్లికేట్ అయినకొద్దీ అభిమానం తగ్గిపోతుంటుంది.

భాస్కరుని వెంకట రమణమ్మ, నందివెలుగు

ప్ర : సాహిత్యం వలన మానసిక వికాసం జరుగుతుందా?

జ : తప్పకుండా జరుగుతుంది - స హి త హితంగా చెప్పేది సాహిత్యం!

ఎ. అన్నపూర్ణ, వీరారెడ్డి, కతెవరం

ప్ర : నవలలో నూటికి తొంభై స్త్రీలను కించపరుస్తున్నాయి.

జ : మీ అంచనా తప్పు అనుకుంటాను.

## ఉత్తమ ప్రశ్న

టి. వి. రమణ, పులివెందుల

ప్ర : మీరు ఎక్కువగా ఎవరిని అభిమానిస్తారు?

జ : స్వార్థరహితంగా నన్నభిమానించే వారిని!

కె. శాయిలీల, నందివెలుగు

ప్ర : అన్నార్తు లనేకులుండగా కోట్లు, దుర్వ్యయం చేస్తున్న ప్రభుత్వం ఏం సాధించ దలచింది?

జ : పేరుప్రతిష్ఠ కోసం కోట్లు ఖర్చు పెడుతున్నది!

నాగండ్ల వెంకటేశ్వరరావు, డోర్నకల్

ప్ర : పాఠకుల సలహాల ప్రకారం సీరియల్ మార్చుతారా?

జ : సలహా నచ్చినప్పుడు మార్చుతాను.

పి. రాజేంద్రప్రసాద్, నిట్టూరు

ప్ర : తెలుగు నవలలో ఇంగ్లీషు కొటేషన్స్ వాడతారెందుకు?

జ : తెలుగు భాషపై మొదట సంస్కృతం, తర్వాత పారశీకం, ఉర్దూ, ఇంగ్లీషు భాషల ప్రభావం వుంటూ వచ్చింది.

డి. రమణరావు, ఖర్గపూర్ (ప. బెంగాల్)

ప్ర : ఏ రసం రమ్యమైనది? మీరే రసాన్ని ఎక్కువగా అభిమానిస్తారు.

జ : సందర్భాన్ని బట్టి రసపుష్టి కల్గించాలి. నవరసాలను సమపాళ్ళలో పోషించగల్గినది మంచి రచన. మంచి నవలలను రచించాలన్నది నా ధ్యేయం.

కె. సీతాయమ్మ, లింగాల

ప్ర : స్త్రీ స్వేచ్ఛ స్వాతంత్ర్యముపై మీ అభిప్రాయం?

జ : ఆస్తి హక్కుతో పాటు అన్ని హక్కులు వచ్చిన తర్వాత స్వేచ్ఛ స్వాతంత్ర్యం గురించి ఎక్కువగా బాధ పడనవసరం లేదు. విద్య, సంస్కారం వుండి ఆర్థిక స్థాయి మెరుగుపడిన స్త్రీ స్థాయి పెరుగుతుంది- గుర్తింపు వస్తుంది. ☐

---

వాళ్ళంతా హూనం చేసి బాధతో గిలగిలలాడుతున్న రాణిని బలవంతంగా బృందంలోని మగవాళ్ళంతా అనుభవించారు.

నీరసంతో దాదాపు నిర్జీవంగా పడిపోయింది రాణి!

* * * *

స్వామి శరణం

అయ్యప్ప శరణం

ఎలుగెత్తి అరుస్తూ ఏకాంబరేశ్వరాలయంలో అయ్యప్ప భక్తులు ప్రదక్షిణ చేయసాగారు.

"స్వామీ! గురుస్వామీ!" పండు నెమ్మదిగా టైగర్ చెవిలో పిలిచాడు.

"ఏమిటి?" అన్నట్లు చూసాడు టైగర్.

"రాఘవరావు పెద్దమ్మా యదిగో?" దారుశిల్ప ఖండాలున్న మంటపంలోకి చూపించాడు పండు. నిర్మానుష్యంగా వున్న మంటపంలో విలాసినిని చూచిన టైగర్ కళ్ళు లేడికూనపై దుముకబో యే పులి కళ్ళలా మిలమిల మెరిసాయి.

క్షణాలలో అయ్యప్ప భక్తులు విలాసినిని చుట్టుముట్టారు.

"మర్యాదగా మా వెంటరా! లేదా కాళ్ళు చేతులు కట్టి నోట్లో గుడ్డలు కుక్కి మరీ తీసుకెళతా!"

"ఎవరు మీరు? మీ వెంట ఎందుకు రావాలి."

"అయ్యన్నీ అనవసరం! విజయవాడెళ్ళాక మా బాస్ సన్నీ నడుగు ఆ యిషయాలు!"

"దీప్!" ఎలుగెత్తి అరచింది విలా. మంటపంలో వో పక్కన నిద్రిస్తున్న దీప్ ఉలిక్కిపడి లేచాడు.

"విలా! ఏమయింది! ఎవర్రా మీరు?" అంటూ దగ్గరకు వస్తున్న దీప్ మీదకు విజృంభించారు టైగర్ అనుచరులు.

ఎగిరి మంటపం కప్పు నుండి వేలాడుతున్న గంటను అందుకుని ఆ వూపుతో టైగర్ అనుచరులను ఒక్కొక్కళ్ళనీ తలల మీద భుజాల మీద, వక్షస్థలం మీద తన్నుతూ గుంపును చిన్నాభిన్నం చేసాడు దీప్!

టైగర్ అనుచరులు తలో క దిక్కున కిందపడగానే తనూ కిందకు దూకి కరాటే బీట్స్‌తో వాళ్ళను బాధిస్తూ తరిమి కొట్టాడు దీప్.

దీప్ వదిలేయగానే మంటపం కప్పుకు వేలాడుతున్న గంట అటూ యిటూ వూగుతూ పెద్దగా శబ్దం చేయసాగింది.

ఆ శబ్దానికి దూరాన వున్న మంటపాలలో విశ్రాంతి తీసుకుంటున్న యాత్రికులు పరిగెత్తుకు రాసాగారు.

తన అనుచరులను చిన్నాభిన్నం చేసిన దీప్ వంక వురిమి చూస్తూ ముందుకు దూకాడు టైగర్!

"రేయ్! టైగర్ కడ్డొచ్చి బతికినోడులేడ్రా" అని గర్జిస్తూ ఎగిరి దీప్ మీదకు దూకాడు టైగర్.

ఒడుపుగా పక్కకు తప్పుకుని కిందపడిపోయిన టైగర్ ఛాతీపై తన్నాడు దీప్.

బాధతో అవమానంతో కోపం పెల్లుబికింది టైగర్‌లో.

"రేయ్! నీ అంతు చూస్తా!" అంటూ చప్పున లేచి మెరుపులా దీప్ మీదకు వచ్చాడు టైగర్.

మల్లయుద్ధ ప్రవీణుడు కరాటే నిపుణుడు అయిన టైగర్ మహాబల సమన్వితుడని గ్రహించిన దీప్ ఒడుపుగా అతని ముష్టి ఘాతాలను తప్పుకుంటూ, అతన్ని కవ్వించి కోపావేశం పెల్లుబికేలా చేయసాగాడు. కోపావేశం పెల్లుబికినప్పుడు విచక్షణా జ్ఞానం నశిస్తుందనీ, అప్పుడు శక్తియుక్తులు వ్యర్థం అవుతాయని దీప్‌కు తెలుసు.

మదించిన ఆంబోతులా ఘీంకరిస్తూ ముందుకు దూకుతున్న టైగర్ చేతి సత్తువ కొద్దీ దీప్ డొక్కలో పంచ్ ఇవ్వాలని బిగించిన పిడికిలిలో సర్వశక్తి కేంద్రీకరించి పంచ్ యివ్వబోయాడు.

ఆ సమయంలో దీప్ త్రిశూలం చేబూని నర్తిస్తున్న పరమశివుని దారుశిల్పం ముందున్నాడు. ఆ పంచ్ తగిలితే దీప్ క్షణాలలో ప్రాణాలు కోల్పోయేవాడే!

(ఇంకా ఉంది)

# కొంపకూలింది

శ్రీమతి కళ్యాణి సోమరాజు

బ్రతుకులో సుఖం పోయింది సీతాలుకి!

వెలుగు రాకుండానే లేస్తుంది. చీకటి పడేవరకు కాయకష్టంతోనే సరిపోతోంది. తమ రెండు పొట్టలు నిండటాని కింత ఆరాటమా' అనుకుంటుంది. కాని తప్పదని తెలుసు ఆమెకు కొడుక్కి తను- తనకి వాడు ఇద్దరే ఇప్పుడు వాడు కూడ రెండు రోజుల జ్వరంతో మంచం మీద వుండేసరికి సీతాలుకి ప్రపంచం మరింత శూన్యంగా వుంది. తను పని చేస్తున్న ఇళ్ళల్లో ముందుగా డబ్బు తీసుకుని డాక్టర్‌కి చూపించాలనుకుంది. కాని వాళ్ళిచ్చిన డబ్బులు డాక్టర్ ఫీజుకి, మందులకి సరిపోయేలా లేవు. వున్న డబ్బంతా రోగానికి ఖర్చు అయితే ఆ తరువాత తాము బతికే దెలా అన్న ప్రశ్న కూడా వుంది. అందుకే క్యూలో నుంచుని ధర్మాసుపత్రి వాళ్ళు పోసే రంగు నీళ్ళే గతి అయినాయి సీతాలుకి. ఇంచు మించు గంటసేపు క్యూలో నిలబడితే వచ్చాయి అవి.

ఇంటి దగ్గర కొడుకెలా వున్నాడో అన్న భావంతో ఓపిక లేకపోయినా చురుగ్గా అడుగేసింది సీతాలు. రాజ్యం వుంటే తనకీ బాధ వుండేది కాదు. ఏమైందో. రాజ్యం. తను ఒంటరి బ్రతుక్కి తోడు అయిందనుకొని సంతోషించే లోగా ఆమె వారం నుండి కన్పించటం లేదు. ఆమె బ్రతుక్కి అది సహజం అనుకుని సమాధాన పడలేక పోతోంది సీతాలు. నిజమే! తను పనిలోకి వెళ్ళిన సమయంలో కొడుకుని చూసుకునేది రాజ్యం. అయితే పగలంతా ఎంతో అందగా వుండే రాజ్యం సాయంకాలం కాగానే మొహాని కింత పౌడర్ పులుముకుని పెట్టెలోంచి పాత శిల్కు చీర తీసి కట్టుకుని "వస్తానక్కా" అంటూ జారుకుంటుంది.

సీతాలు చాలాసార్లు నిలదీసింది రాజ్యాన్ని. సమాధానం ఏన్న చిరునవ్వు! అంతే. పోన్లే ఆమె గొడవ తన కెందుకు తనతో వుంటే ఈ వసారాలో సగభాగాన్ని, సగం అద్దెని భరిస్తోంది. అందుకు బదులుగా తాను ఆమె జీవితాన్ని ఏలెయ్యాలని అనుకో కూడదు అనుకుంది సీతాలు. ఆమెకు నీడ కావాలి. తనకు తోడు కావాలి. అంతకంటే మించి ఒకరికొకరం ఇంకేమి కాము అని సమాధాన పడింది."

అయితే ఆ ఇంటి కామందు తన ఇంట్లో ఒక వాటా ఇవ్వటమే కాదు సీతాలుమీద అధికారం కూడా కావాలను కునేవాడు. సుబ్బయ్య నైజం తెలిసి సీతాలు తన జాగ్రత్తలో తానుండేది. రాజ్యం కూడ వుందన్న నిశ్చింత సీతాల్లో వుంటే- రాజ్యం లాంటి బజారు దాన్ని తన ఇంట్లో చేర్చినందుకు ఉక్రోషం సుబ్బయ్యలో పేరుకుంది. ఎప్పుడు సీతాలు ఒంటరిగా కన్పించినా ముందా పిల్లను ఖాళీ చేయించు. లేకపోతే నువ్వు కూడా ఖాళీ చెయ్యి అని బెదిరించే వాడు. సీతాలు విని విననట్లు వుండి పోయేది.

ఎవర్ని ఎదిరించి బ్రతకలేమని తెలుసు సీతాలుకి. సుబ్బయ్యకి ఎంత చెడ్డ మనసున్నా అతనికి కిరాణా షాపు కూడా వుంది. అందులో అప్పుడప్పుడు నీళ్ళు కలిపిన కిర్సనాయిల్, పురుగులు పట్టిన బియ్యం బజారు ధరకంటే ఓ పావలా తక్కువకే ఇస్తాడు సీతాలుకి. అదే మహోపకారం అనుకుంటుంది సీతాలు.

సీతాలు ఆతృతగా వచ్చి దగ్గరికి వేసివున్న తలుపు నెట్టింది.

మంచం మీద కొడుకు లేడు. పొద్దున తెచ్చుకున్న అన్నం కుక్క తినిపోయి నట్లుంది. ఇల్లంతా అన్నపు మెతుకులే!

నేలపాలైన అన్నం గురించి దిగులు పడలేదు సీతాలు. జ్వరంతో పడుకున్న కొడుకు ఏమైయ్యాడా అని ఖంగారు పడింది. తలుపులు గడియ వేసి వెతుక్కుంటు బయలుదేరింది. కొంచెం దూరం నడిచేసరికి ఆమె కాళ్ళు ఆగిపోయాయి.

నేలకి ఒరిగి పోయిన పాక దగ్గర కూర్చుని వున్నాడు సీతాలు కొడుకు. పడిపోయిన పాక క్రింద నాలుగైదు పందులు హాయిగా సంసారం చేస్తున్నాయి. సీతాలుకి ఆ దృశ్యం చూడగానే బాధతో కన్నీళ్ళు కారాయి. ఒకప్పుడు తానా ఇంట్లో దీపం పెట్టింది. తన మామ వీరయ్యతో సంసారం చేసింది. నీడపట్టున వుండి నిశ్చింతగా రోజులు గడిపింది. ఈనాడు పొట్ట చేత బట్టుకుని నడిబజార్లో నిలబడింది. కారణం....

* * * *

ఉప్పెనలా వచ్చిన గోదారి వూళ్ళని వూళ్ళని తనలో కలిపేసుకొంది. గోదావరి కోపానికి ఆహుతి అయిన ఎన్నో జీవితాల్లో సీతాలు బ్రతుకు ఒకటి. ఇల్లు పొగొట్టుకొని వరద శిబిరాల్లో జేరారు సీతాలు కుటుంబం. వాళ్ళు పెట్టినప్పుడు తింటూ లేనప్పుడు పస్తులుంటూ గడిపారు కొన్నాళ్ళు. ఎక్కువ రోజులు అలా వుండాలంటే విసుగేసింది వీరయ్యకి.

మూట ముల్లె కట్టుకుని కూలిపని కోసం ఏదైనా వూరు వెళతానంటూ బయలు దేరాడు వీరయ్య.

సీతాలు "నేను వస్తాను మామ." అంటూ తనూ బయలు దేరింది.

"నువ్వేడకే! కొత్త వూరు కొత్త మనుషులు. ముందు నేనెళ్ళి నాలుగు డబ్బులు సంపాదించనీ! అయినా ఈడ మన కొంప గోడు వదిలి నువ్వు నాతో ఎందుకు?"

"నేనొంటరిగా ఈడ వుండలేను మామ. నేను, పిల్లగాడు నీతోనే వత్తాం" అంటు మొండి కేసింది సీతాలు.

"నేను మాత్రం మిమ్మల్నొదిలి ఎన్నాళ్ళుంటానే. పని పాడు లేకుండా వూరికే కూర్చుంటే మన బతుకు లెళ్ళవు. అందుకు నాలుగు రాళ్ళు సంపాదించగానే బేగిరం వచ్చేత్తా. అంతవరకు మన గూడెం వాళ్ళంతా నీకు సాయంగా వుంటారు లేయ్యే. బయపడక." అంటూ ఓదార్చాడు వీరయ్య సీతాలు చేసేదిలేక అయిష్టంగానే భర్తను సాగనంపింది.

మెల్లగా వరద హడావిడి తగ్గింది. తమ గూడెం వారంతా ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళి పోయారు. ప్రభుత్వం చేసిన సహాయం తోను, అప్పో, సొప్పో చేసో పడిపోయిన ఇళ్ళు నిలబెట్టు కున్నారు. సీతాలుకి ఇవేవి లేకపోయాయి కొడుకుని తీసుకుని సుబ్బయ్య ఇంటి వసారాలో తల దాచుకుంది, కొడుకుతో! అద్దె ఒక్కతె భరించలేక రాజ్యాన్ని చేర్చుకుంది.

అమ్మా! అంటూ కొడుకు వచ్చి రెండు కాళ్ళు చుట్టేయటంతో.... ఉలిక్కి పడింది సీతాలు.

"ఏరా! ఇక్కడేం సేత్తున్నావురా ఇంత ఎండలో తిరిగితే జొరం ఎక్కువౌద్దిరా !" అంటూ కొడుకుని దగ్గరకు తీసుకుంది

"అమ్మా! మన గుడిసెలో పందు లున్నాయి...."

"ఔను బాబు. మన మెవ్వరం లేముగా అందుకని ఆటికి ధైర్యం."

"మన గుడిసె కట్టుకుని ఇక్కడకి వచ్చేద్దామే."

"అలాగేరా. ముందు మీ అయ్యని రాని".

"అయ్య ఎప్పుడొత్తాడు?"

'బోలెడు డబ్బులు సంపాదించాక వచ్చేత్తాడు. అప్పుడు ఈ పాకేంటి మంచి బంగ్లా పెంకుతోనే కట్టేసుకుందాం ఇల్లు.'

"బలె బలె పోలిగాడికి పాకే. మనకి అంతకంటే మంచి ఇల్లు కదమ్మా"

"ఔనురా" కొడుకుని వూరడించటానికి సీతాలు ఏవో మాటలు చెప్పినా మనసులో కొండంత దిగులు రోజు రోజుకి పెరిగి పోతూనే వుంది.

అప్పుడే తన మావ వెళ్ళి నెల రోజులు దాటి పోయాయి. ఓ కబురు లేదు. ఏమైయ్యాడో! కూలి పనులు దొరక్క ఎంత దూరం వెళ్ళాడో. ఎప్పటికి తనకి మంచి రోజులు వస్తాయో. తను ఇన్నాళ్ళు

పద్మ బాధలన్ని మావ కౌగిట్లో మర్చిపోవాలి. కష్టమొ సుకమొ ఇద్దరు ఒక చోట వుంటే అదో ఇదం. ఇలా జంట తెగిన పక్షుల్లా చెరో దారి అయితే అది నరకమే. ఆ రోజంతా సీతాలు అన్యమనస్కంగానే వుంది.

కొడుక్కి జ్వరం కొంచెం జారటంతో మనసు కొంచెం తేలిక పడింది. గంజి కాచి కొడుక్కి కొంచెం ఇచ్చి అదే తను కొంచెం త్రాగింది.

రాజ్యం సామాను ఆమె వదిలేసిన బట్టలు చూడగానే మళ్ళీ మనసు ఆమె మీదకు మళ్ళింది. ఏమైందో రాజ్యం.

"అప్పుడప్పుడు పొరుగూరు వెళ్తున్నానని రెండు మూడు రోజులు రాకుండా వుండి పోవటం జరిగింది. కాని ఏకంగా ఇన్ని రోజులు ఎప్పుడు వుండలేదు. రాజ్యం ఎక్కడున్నా క్షేమంగా వుండాలి" అనుకుంది మంచి మనసుతో సీతాలు.

ఇంతలో ఎవరో గొళ్ళెం చప్పుడు చేయటంతో ఉలిక్కిపడి లేచింది సీతాలు.

రాజ్యం వచ్చిందేమొ అనుకుని ఒక్క ఉదుటున వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా సుబ్బయ్య.

"తమరా! రాజ్యం అనుకున్నాను."

"అధా. అదేమొస్తుందే. దాన్నెప్పుడో జైల్లో తోసుంటారు."

"అలా అనకండి. పాపం."

"పాపమా. అదెలాటిదో నీకు తెలుసా. బజారు ము..."

"అవండి బాబు. ఆమెలాటిదైనా నాకు ఇంతవరకు హాని చేయలేదు."

"సర్లే. అయితే ఒక్కదానివే తొంగున్నావన్న మాట." అంటూ వెకిలిగా నవ్వాడు.

సుబ్బయ్య రాక, అతని మాటలు అర్థం చేసుకోలేనంత అమాయకురాలు కాదు సీతాలు. ఆమెకు అతన్ని చూసిన దగ్గర్నుంచి వెన్నులో ఒణుకు మొదలైంది.

"ఇంత రాత్రి ఏళ నా వాటా వైపు మీరు రావటం ఏమి బాగా లేదు బాబు."

"రాత్రి క్కాకపోతే పగలు రమ్మంటావా, నువ్వో పిచ్చి మాలోకంలా వున్నావ్!"

"బాబు. మీరేటి అనుకుంటున్నారో. ఈ సీతాలు అలాటిది కాదు. బతికినంత కాలం నిప్పులానే బతుకుతుంది. మీరు ఎళ్ళండి. నలుగురికి తెలిత్తే మీరే అల్లరి పాలౌతారు."

"ఓహోహో. ఏం చేస్తావే!"

"మీరేమన్న వెదవ పని చేత్తే అరిచి అల్లరి చేత్తా!"

"చాలా గడుసు దానివేనే సీతాలు!" సుబ్బయ్య కంఠం హఠాత్తుగా మృదువుగా మారింది.

"ఛీ! అందితే జుట్టు అందకపోతే కాళ్ళు. ఎదవబుద్ధి" అనుకుంది సీతాలు.

"అయినా యీ పాచిపనులు చేసుకునే ఖర్మ నీకేంటే సీతాలు. నా మాటవిని నాదానివైయ్యావంటే నిన్ను మహారాణిని చేస్తా. నీ గుడిసీ నేనే వేయిస్తా. నువ్వు కాయకష్టం చేసుకుంటూ బతకక్కర్లేదు."

"ఏం బాబు పరాయివాడి పెళ్ళామంటే పడుపుదానిలా కన్పిస్తుందా మీ కంటికి. నా మావ వచ్చాక మీ సంగతి చెప్పానంటే సోదిలోకి లేకుండా సేస్తాడు."

"ఆఁ ఆడు వత్తాడు. నిన్ను ఏలుకుంటాడు!"

"తమకంటే ఎక్కువ డబ్బే కూడబెట్టి వత్తాడు నా మావ. మీ కళ్ళతో మీరే చూత్తారు. ముందు వెళ్ళండి ఇక్కడ్నుంచి."

"ఏమిటే నీ పొగరు? నా కొంపలో వుంటూ నన్నే పొమ్మంటావా...... ఈపట్నున నిన్నేం చేసినా అడిగేదిక్కెవరే నీకు" అంటూ ముందుకు అడుగువేసాడు.

"ఓ రంగయ్య బాబాయి, లక్ష్మమ్మ పిన్నీ" అంటూ గట్టిగా అరిచింది సీతాలు. ఇంతలో దూరాన ఏదో రిక్షా చప్పుడు విన్పించి సుబ్బయ్య ఒక అడుగు



వెనక్కు వేసాడు.

"సరే ఎన్నాళ్ళు చేస్తావో ఈ మొండితనం చూస్తాను. నా యింట్లో వుండాలంటే నా మనిషిగా వుండాలి. లేకపోతే తెల్లవారే సరికి ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపో. ఇంకా వున్నావంటే నా మాట ఒప్పుకొని వున్నావనుకుంటాను. ఈ సుబ్బయ్య సంగతి నీ కర్థం అయ్యేలా చెబుతాను. ఏమనుకున్నావో నన్నెదిరించి నా యింట్లో ఒక్క నిముషం కూడా వుండలేవు" బయటకు నడిచాడు సుబ్బయ్య.

సీతాలు మతిలేని దానిలా చూస్తూ కూలబడింది. గుండెల్లోంచి సుళ్ళు తిరుగుతూ వచ్చిన దుఃఖాన్ని ఆపేవారు ఎవ్వరూ లేరు.

రేపటినుంచి ఈమాత్రం నీడ కూడా వుండదన్న బాధ కంటే తనిలా ఒంటరిగా ఈ జీవితాన్ని ఎన్నాళ్ళు ఎదురీదగలదు అన్న భయమే ఆమెకు ఎక్కువైంది.

"ఎక్కడున్నావు మావా? నిముషం ఆలేశం అయితే ఆకలి కుండలేవు. గంట నే కన్పించకపోతే ఇల్లంతా చిందులేసేవాడివి. ఈనాడు యిలా ఒంటరిదాన్ని చేసి ఎద కెళ్ళిపోనావు. నీ సీతాలుకి డబ్బు ముఖ్యం అనుకున్నావేమో. కాదు. మావా కాదు. నువ్వు దగ్గరుంటే గంజి అయినా పరమాణ్ణమే. మన కొంప నిలబెట్టుకోటానికి నువ్వింత వరకు సంపాదించింది చాలదా మావ. ఇంకా సంపాదించి ఏం చేత్తాం? నీ సీతాలు నీ కోసం ఎదురు చూసి ఎదురు చూసి కన్ను మూసాక నాకు గోరి కడతావా ఆ డబ్బుతో! వద్దు మావ. నువ్వు సంపాదించింది చాలు. వచ్చెయ్యి. నీ గుండెల్లో తల దాచుకోనీయు మావ........" సీతాలు అస్పష్టంగా గొణుక్కుంటూనే వుంది ఆ రాత్రంతా!

* * * * *

అయితే సీతాలుకి తెలియని విషయం ఒకటుంది. డబ్బు సంపాదన కోసం భార్యని, కొడుకుని వదిలివెళ్ళిన వీరయ్యకి, నాలుగు రాళ్ళు వెనకెయ్యగానే అతనిలో కోరికలు కూడా విజృంభించాయి.

అప్పుడే పరిచయం అయింది రాజ్యంతో! రాజ్యం ఈసారి వీరయ్యని కస్టమర్‌గా ధర కట్టి వదల్లేదు. తాళి కట్టించుకుని ఇల్లాలైంది. రాజ్యం మోజులో వున్న వీరయ్యకు తాను అంతకుముందే ఓ ఆడదాని మెళ్ళో తాళి కట్టానన్న విషయం గుర్తుకు రాలేదు.

అయితే రాజ్యానికి తెలియదు తన కిన్నాళ్ళు ఆశ్రయం యిచ్చిన ఇల్లాలి సంసారమే తనిప్పుడు పడగొట్టానని.

సీతాలుకి తెలియదు తమ కొంప కూలిపోయిందని. □

# హైదరాబాదు నోట్‌బుక్

## కవిభూషణ కల్లూరు అహోబలరావు గారు :

పూజ్యులు శ్రీ కల్లూరు అహోబలరావు గారిని దర్శించినప్పుడెల్లా నాకు ప్రాచీన కులపతులు జ్ఞాపకం వస్తారు. విద్యాదానమే తప్ప మరొక హవ్యాసమే లేని జీవితం, విద్యార్థులు బాగుపడి వృద్ధికి వస్తే చూచి ఆనందించే ఔదార్యం, విద్యార్థులను తీర్చి దిద్దాలనే తపన – ఇవి ఆనాటి కులపతుల ఏకైక వాంఛితం. విద్యార్థులకు బోధించడం కోసం తామూ పరిశ్రమ చేసేవారు ఆ కులపతులు. కులపతి నిరంతర విద్యార్థిగా వుంటేనే గాని తన విద్యార్థులకు కొంతయినా చెప్పలేడు. ఇది ముఖ్యం, ఇది పరీక్షకు వస్తుంది అనే ప్రశ్నలేదు ఆ కాలంలో. అంతా ముఖ్యమే, పుస్తకం మొదటి అట్ట నుంచి చివరి అట్ట వరకు అంతా పరీక్షకు రావచ్చు. – ఇలాటి వాతావరణంలో పెరిగి, ఉపాధ్యాయ వృత్తి చేపట్టిన వారిలో ఒకరు అహోబలరావు గారు. నిజానికి ఆ కాలం బతకలేక బడి పంతులు కాలం. అహోబలరావుగారు ఇతర వృత్తితో బ్రతకగల వారే. కాని, కోరి కోరి బడిపంతులయ్యారు దాని లోని ఆనందం, తృప్తి మరొకదానిలో వుండదనే నమ్మకంతో. ఆకాలపు పంతులంటే చిలక పలుకుల్లాగ ఏవో చెప్పడం కాదు, విద్యార్థుల జిజ్ఞాసను తీర్చగల వారయి వుండాలి దాని కోసం వివిధ విషయాలు తెలుసుకోవాలి విద్యార్థుల స్థాయికి దిగి బోధించాలి ఉపాధ్యాయుని పని అంతటితో తీరదు. గ్రామస్తులు తిథివార నక్షత్రాలు అడుగుతారు, ముహూర్తాలు పెట్ట మంటారు ఏవేవో సలహాలు అడుగుతారు. ఓపికతో వాటిని పూర్తి చేయాలి. అదొక అసిధారా వ్రతం. ఇంత చేసి జీవితంలో ఏమైనా వెనక్కు వేసుకోడం వుంటుందా? బొటా బొటి గొర్రెతోక. ఆ గొర్రెతోకను పట్టుకొన్న అహోబలరావు గారూ లౌకిక దృష్టితో ఎక్కడ వేసిన గొంగళి అక్కడే లాగ వున్నా సారస్వత మార్గంలో చాలదూరం పయనించారు రచనలు చేశారు, సభలు నిర్వహించారు, గ్రంథాలయాలు నెలకొల్పారు, గ్రంథమాలను నేటికీ నిర్వహిస్తున్నారు 86వ ఏటనూ. అహోబలరావు గారు అనంతపురం జిల్లా హిందూపురం తాలూకా కల్లూరు గ్రామంలో 1901 జూన్ నెలలో జన్మించారు రాయలసీమ రాజకీయ పితామహులు పద్మశ్రీ కల్లూరు సుబ్బరావుగారు అహోబలరావు గారికి మేనమామ, తల్లి శ్రీమతి అశ్వర్థమ్మ తండ్రి శ్రీ గూళూరు క్రిష్టప్పగార్లు. చిన్ననాటి చదువు గ్రాంటు వీథిబడిలో నాల్గవ తరగతి వరకు సాగింది. అప్పటి పద్ధతి ప్రకారం అమరం, ఆంధ్రనామ సంగ్రహం, దినం విడచి దినం సుమతి, కృష్ణ నరసింహ శతకాల పద్యాలు నేర్పేవారు. "కందుకూరు వీరేశలింగం పంతులుగారి తెలుగు వాచకాలు చదివేవాళ్లం. ఒక వాచకంలోని ఉత్తమ గుణములు ఉన్నె నీచునకు నెత్తిచ్చి కరగిన నిత్తడి పసిడె– అనే ద్విపదనాకిప్పటికీ జ్ఞాపకం వుంది. నాల్గవ తరగతిలో భారతంలోని ఆదిపర్వం చదవడం పంతులుగారు నేర్పారు.

పద్యాలు చదవడంలో నాకు అభిలాష జనించింది. నీతి కథాసంగ్రహం, వావిలి కొలను సుబ్బారావుగారి ఆర్యకథా నిధి అనే చిన్న పుస్తకాలు చదివే వాడిని. శకుంతల చరిత్ర నలచరిత్ర మొదలయిన పుస్తకాలు రాత్రిపూట చదివి మా మేనత్త మొదలైన స్త్రీలకు వినిపించేవాడిని" అన్నారు నాతో ఆయన. అహోబలరావు గారికి 12వ ఏటనే వివాహ మయింది. పెళ్లి ఏడురోజుల పాటు జరిగింది సతీమణి సీతమ్మ వయస్సు ఎనిమిదేండ్లు. మామగారు శ్రీ సీతారామ రావుగారు ధర్మవరంలో రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ కనుక



కవిభూషణ కల్లూరి అహోబలరావు

అహోబలరావుగారి తర్వాతి చదువు 7వ క్లాసు వరకు అక్కడి లండన్ మిషన్ స్కూలులో సాగింది. అక్కడ ఆదర్శాచార్యులు శ్రీ కూరత్తాళ్వార్ అయ్యంగార్ హెడ్ మాస్టర్. సాహిత్య సరస్వతి సీరిపి ఆంజనేయులు గారు క్లాస్ టీచరు. కూరత్తాళ్వారు తెల్లవారు జామున విద్యార్థుల ఇండ్లకు వెళ్లి విద్యార్థులను మేల్కొల్పి, తమ ఇంటికి పిలుచుకొని పోయి సంస్కృతం చెప్పేవారు. మామ గారి బదిలీ కారణంగా థర్డ్‌ఫారం హిందూపురంలోని ఎడ్వర్డ్ కారోనేషన్ మిడిల్ స్కూలులో చదివారు రావుగారు. అప్పుడు జిల్లాకొక హైస్కూలే వుండేది. కనుక విద్యార్థులు అనంతపురమో, బెంగుళూరో పోవలసి వచ్చేది. అహోబలరావుగారు బెంగుళూరులోని వెస్లియన్ మిషన్ హైస్కూలులో నాల్గవ ఫారంలో శ్రీ కల్లూరి సుబ్బరావు గారి ద్వారా చేరారు. ఆయన తమ్ములూ అక్కడే చేరారు. వారంతా తెలివి గల విద్యార్థులైనందున ఆ హైస్కూలు ప్రిన్సిపాలు శ్రీ ఫుల్లర్ కల్లూరు సుబ్బారావు గారితో 'మీ వూరి పిల్లలు బుద్ధి మంతులు ఎవరైనా హైస్కూలులో చేరితే ఫ్రీషిప్ ఇస్తాను" అని అన్నారట. అహోబలరావు గారికి మిడిల్ స్కూలులోను హైస్కూలులోను ఉపాధ్యాయుల నుంచి మంచి ప్రోత్సాహం లభించింది. ముఖ్యంగా కూరత్తాళ్వార్ అయ్యంగార్, సీరికి ఆంజనేయులు, వెంకట సుబ్బయ్య గార్లు బాగా ప్రోత్సహించారు. ఛందో రహస్యాలు కూడ తెలిపారు 1914 –15 ఆనందనామ సంవత్సరంలో శ్రీ కూరత్తాళ్వార్ ఉగాది పద్యాలు వ్రాశారు. అవి అహోబలరావు గారికి ప్రేరకాలై రౌద్రి ఉగాదికి (1920–21) పద్యాలు చెప్పేట్టు చేశాయి వాటిని తమ తెలుగు పండితులకు చూపగా ఆయన సెబాస్ అని మెచ్చుకొని అచ్చు వేయమన్నారు. అపుడు స్వాతంత్రోద్యమం కాలం గనుక ఆ పద్యాలు భారతాంబస్తవంతో ఇలా ప్రారంభమయ్యాయి.

శ్రీమత్పర్వతరాజు నైజమకుట శ్రేష్ఠంబుగా, వాహినీ
స్తోమంబుల్ మణితారహారములుగా, తోరంపు
వింధ్యాద్రి నీ
దౌ మధ్యంబు పసిండి డాబుగ, సము ద్రంబుల్
త్రిపార్శ్వంబులన్
భామారత్నములై చెలంగ భరతాం బా నిన్ను నే
గొల్చెదన్.

ఈ ఉగాది కానుకలు అప్పటి నుంచి నేటి వరకు అవిచ్ఛిన్నంగా వెలువడ్డాయి. 1922 నుంచి 1972 వరకు వెలువడిన ఉగాది కానుకలన్నీ ఉగాది స్వర్ణభారతి అనే పేరుతో పుస్తకరూపం దాల్చాయి. ఈ కానుకలలోని విశేషం సమకాలీన సాంఘిక రాజకీయాది సంఘటనల చర్చ. ఇవి ఒక విధంగా దేశ సాంఘిక రాజకీయ స్థితి సమీక్ష, ప్రబోధమూను.

దుందుభి సంవత్సరంలో వారి ఉగాది దుందుభి ఇలా మోగి మేల్కొల్పింది:–

దందుభిధ్వానమల్లదే దో చెదిశల
వినబడగలేదె భారత వీరులార,
మేల్కొనుడు! మేలుకొనుడయ్య! మేలు కొనుడు
లెండు లెండోయి నిదుర చాలించి వేగ.

అహోబలరావుగారు తమకు ఇష్టమైన ఉపాధ్యాయ వృత్తిలో పెనుగొండ తాలూకా బోర్డ్ ప్రెసిడెంట్. శ్రీ రొద్దం వెంకోబరావు (శ్రీ ఆర్. ప్రభాకరరావు, ఐ. పి. ఎస్. గారి పెద్ద తండ్రి)గారి ప్రోత్సాహంతో 1923లో చేరారు. అప్పుడు ఎలిమెంటరీ స్కూలు పంతులు జీతం పదిహేను రూపాయలు, ఇప్పటి ఆరు వందలకు సమానం. ఒక మారు తాలూకా బోర్డు ప్రెసిడెంట్ స్కూలు తనిఖీకి రాగా, అహోబలరావుగారు తమ దుఃస్థితిని వివరిస్తూ పద్యాలు చెప్పగా, ప్రెసిడెంట్ సంతోషించి, అందరి జీతం 20 రూపాయలు చేశారట అప్పటి పద్యాలలో ఒకటి.

పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
విచ్చుల విడివేయదగునె ప్రెసిడెంటులకున్?
మచ్చిక విద్యా గురువుల
కిచ్చెడి పదునైదు రూకలేమగునార్యా?

ఆకాలంలో నే కుమార శతకం అనే విద్యార్థి ప్రబోధక శతకం రచించి ప్రారంభవిద్య అనే మాస పత్రికలో వరుసగా ప్రచురించారు. రావుగారు బళ్ళారిలోని సెయింట్ జాన్స్ హైస్కూలు లోను, పిదప అనంతపురం జిల్లాబోర్డు హైస్కూళ్ళలోను, మరికొన్ని హైస్కూళ్ళ లోను పనిచేసి 1956 లో ఉద్యోగ విరమణ చేసి హిందూపురం చేరారు. 1931 లో శ్రీ ఘూళీ కృష్ణమూర్తి ఆచార్యులు, శ్రీ హనుమాన గుత్తి దేవదానము అనే ఇద్దరు మిత్రులతో కలిసి శ్రీకృష్ణ దేవరాయ గ్రంథమాల స్థాపించారు. ఈ గ్రంథమాల పక్షాన తమవి, ఇతరులవి పెక్కు గ్రంథాలు ప్రచురించారు. ఈ గ్రంథమాల 1982 లో స్వర్ణోత్సవమూ చేసుకొంది. రావుగారికి తమ మేనమామ కల్లూరు సుబ్బారావు గారి వలె గొప్ప దేశ భక్తుడు కావాలని, జెయిలుకు పోవాలని వుండేది. కాని సుబ్బారావుగారే ఒకమారు "నీవు ఉపాధ్యాయుడవై విద్యార్థులను జ్ఞాన వంతులుగా చేయుచున్నావు. ఇది గొప్ప దేశసేవ. నాతో బాటు చెరసాలకు రావద్దు. విద్యాబోధ అందరికబ్బదు. నీకు దైవికముగా కవిత అబ్బినది. దేశ మాతను నీ కవితతో ఆరాధింపుము" అన్నారు. ఆ పలుకులు వేదవాక్యాలై ఆచ్ఛోనద చుకొన్నారు ఆహోబలరావుగారు భావ తరంగాలు, పూదోట, రాయల సీమ రచయితల చరిత్ర నాల్గు సంపుటాలు రామకర్ణామృతం, కృష్ణ కర్ణామృతం, గృహలక్ష్మి, త్రిశతి మున్నగు నవి వీరి రమణీయ రచనలు వీరు చేసిన సేవకు 1956లో హిందూపురం శారదా పీఠం వారు కవి భూషణ బిరుదంతో సత్కరించారు 1959 లో శ్రీశ్రీ సచ్చిదానంద శ్రీ శంకర భారతీ స్వాముల వారు కవితిలక్ బిరుదంతో సన్మానించారు మరి పెక్కు సంఘాలు దుశ్శాలువలతో సన్మానించాయి 1982 లో గ్రంథమాల స్వర్ణోత్సవం వైభవోపేతంగా జరిగింది ఆ సమయంలో పలువురు పెక్కు సంఘాలవారు వీరిని సన్మానించారు రావుగారికి ప్రస్తుతం ఐదుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు సతీమణి సీతమ్మ గారు ఎనభై ఏళ్ళు నిండు ముత్తయిదువుగాను జీవించి 1986లో కీర్తిశేషు రాలయారు ఈయన కుమారుల్లో ఒకరు శ్రీ రాఘవేంద్రరావు గ్రంథమాల కార్యదర్శిగా వుంటూ తండ్రిగారికి చేదోడు వాదోడుగా వున్నారు రావుగారు సంభాషణ చతురులు, సరసులు గంగవరం అనే గ్రామంలో వున్నప్పుడు పోస్టుమాస్టరు పని కూడా చేసేవారు టపాలో ఆంధ్ర పత్రిక వచ్చేది ఒకరోజు టపా రావడం ఆలస్య మయింది అంతలో తోటప్ప అనే అతను వచ్చి అడిగాడు అతనికి టప్పా రాలేదటతో టప్పా అని పద్యం చెప్పారట అతడు కొంచెం భయంతో వడికాడట అంతలో రన్నర్ టప్పా తెచ్చాడు అతని పేరు కంపడు రావుగారు

కంపము పొందుటదేలా?
కంపడు తెచ్చెను టపాలు, కాంగ్రెస్ వార్తల్
పెంపుగ వచ్చెను, వినుమా
సొంపుగ తోటప్ప వార్త సొంపులు గనుమా!

అన్నారట ఆశువుగా అందరూ నవ్వక ఏం చేస్తారు? రావుగారు కన్నడంలోను కవిత చెప్పగలరు రావుగారు ఎలాగూ 86 సంవత్సరాలు ఆరోగ్యంగా ఉన్నారు ఇక 14 కూడా పూర్తి చేసి ఆ పైనా వుండాలని, కృష్ణ కర్ణామృతంలో

ఆడుకొనబోయివచ్చుచున్నాడు గల్లు
గల్లుమని కాలియందియల్ కదలియాడ
చిగురు పాదంబు లల్లాడ చిందు ద్రొక్కు
కొంచు, నా చిన్నికృష్ణుడు కొమరు మిగుల
నా దెసకు, వేణునాదంబు మోదమలర
సలుపుచున్నాడు, మంగళ స్వనములొలుక

అని వారు వర్ణించిన కృష్ణుడు వారికి 116 సంవత్సరాల ఆయుస్సు ప్రసాదించాలని కోరుతున్నాను

—తిరుమల రామచంద్ర



సమాచార, పౌర సంబంధాల శాఖ డిప్యూటీ మంత్రి శ్రీ దాడి వీరభద్రరావు ఆగస్టు 19న ఆంధ్రపత్రిక విజయవాడ కార్యాలయాన్ని సందర్శించి పి.టి.ఎస్. కీబోర్డుల విభాగాన్ని పరిశీలిస్తున్న చిత్రం

# తెలుగు సమాచారం ప్రతి కాపీ ఉత్పత్తి వ్యయం రు. 3-25

రాష్ట్ర ప్రభుత్వం ప్రచురిస్తున్న పక్ష పత్రిక 'తెలుగు సమాచారం' ప్రతి కాపీ ఉత్పత్తి వ్యయం రు 3 25లు అవుతున్నదని సమాచార, పౌర సంబంధాల శాఖ డిప్యూటీ మంత్రి శ్రీ దాడి వీరభద్రరావు వెల్లడించారు

పత్రిక ఆరు లక్షల సర్క్యులేషన్‌కు చేరిందని, 9వ సంచిక మార్కెట్‌కు విడుదల అయిందని ఆయన చెప్పారు

12 పేజీలతో వెలువడుతున్న పత్రిక వెల ప్రస్తుతం 25 పైసలుగా మాత్రం వుంది

ఆగస్టు 19న ఇక్కడ పత్రికల వారితో ఇష్టాగోష్ఠి జరుపుతూ, తెలుగు సమాచారం పత్రికను వారపత్రికగా మార్పుచేసే ప్రతిపాదన ఏదీ లేదని చెప్పారు

పత్రికా నిర్వహణకు రు 2 కోట్లు బడ్జెట్ కేటాయింపు ఉన్నదని, అడ్వర్టయిజ్‌మెంట్లపైవచ్చే ఆదాయాన్ని పెంచుకొనేందుకు చర్యలు తీసుకుంటున్నామని ఆయన చెప్పారు

పత్రిక పంపిణీకి ఏజన్సీలను ఏర్పాటు చేసేందుకు ప్రయత్నిస్తున్నట్లు ఆయన అన్నారు

సమాచార శాఖను మరింత పటిష్టంగా తీర్చి దిద్దేందుకు అవసరమయిన సూచనలు తీసు కొనేందుకు జిల్లాలో పర్యటిస్తున్నట్లు ఆయన వివరించారు □



# దూరదర్శనం

లత

## ఏక్ ఘట్‌కీ కహానీ

రవీంద్రుని కథకి నాటకానుసరణ. దర్శకుడు గౌతమ్‌ఘోష్.

నదీ తీరంలో ఆడుతూ పాడుతూ పెరిగిన పిల్ల కుసుమ్. చక్కని పాటలు పాడుతూ ఉండేది. ఆమెని అభిమానించిన గోసాయి తాత.... నీటిలో విన్యాసాలు చేసే మరో అతను ఉండేవాళ్ళు. చిన్న పిల్లగా అత్తవారింటికి వెళ్ళిన కుసుమ్ యవ్వనవతి అయి వస్తుంది. గోసాయి చనిపోయాడు- చిన్ననాటి స్నేహితుల్లో విధవ అయిన స్నేహితురాలు ఉంటుంది.- కాని కాలంలో పిల్లలు ఆడుతూనే ఉంటారు, తల్లులు పిలుస్తూనే ఉంటారు. నది ఇదంతా చూస్తునే ఉంటుంది. కుసుమ్ రెండవసారి విధవగా వస్తుంది- నౌక పగిలి అతను చనిపోతాడు. పిల్లలు ఆడుతునే ఉంటారు.

కొత్త గోసాయి వస్తాడు. అతను నౌకలో మునిగిపోయిన కుసుం భర్త. కాని ఈమె విధవ, అతను సన్యాసి. భర్త ఆమెకు ముక్తి గురించి చెప్పి వెళ్ళిపోతాడు. కుసుం నదిలో లీనమయి పోతుంది- రవీంద్రుడి ఒక ఘటం కథ. గొప్ప కథల్లో ఒకటి.

## రామాయణ్

భరతుడు పాదుకలు అడగటం నిజంగా చూస్తున్న వారికి దుఃఖం కలిగించింది. అయితే పాదుకలూ అగ్ని ప్రవేశాలూ, బౌద్ధులు రామాయణంలోకి ప్రవేశ పెట్టారని విమర్శకు లంటారు. కావచ్చును. బుద్ధుడి పాదుకలూ, దంతాలూ ఇంకా అనేక స్థూపాల కింద ఉన్నాయి. అదట్లా ఉంచి వాల్మీకంలో సీతా కల్యాణం తరువాత జనకుని రాక ఉండదు. అవి ఎవరో తీసేసి ఉంటారు. మురారి పండితుడు తన అనర్ఘ రాఘవంలో ఇది వ్రాసినట్లు గుర్తు. జనకుడు రావటం చాలా ఔచిత్యం. రామానంద సాగర్‌జీకి ధన్యవాదాలు. ఈ రామ కథా సుధా స్రవంతి మనకి చూపించి నందుకు. సీత ఏమిటో గా ఉంది.

* * * * * *

మాండలిన్ శ్రీనివాసన్ బాగా శృతిపక్వంగా మాండలిన్ మీద వీణా వాదన పలికించగలడు- పిల్లవాడు కాస్త పెద్దవాడయ్యాడు. సంగీతం అద్భుతంగా అతను సాధన చేసిన చిరంజీవి.

వ్యవసాయదారుల కార్యక్రమంలో- మామిడి అంట్లు తయారీ గురిం చి ఈ నెలలో రెండోతడవ చెప్పారు.

## చహరే- నందీ బహు

వృద్ధుడైన మామగారు పుత్ర వియోగం వలన ఏమవుతాడో అనే భయంతో కోడలు అతన్ని కొడుకు జీవించే ఉన్నాడని చెప్పి తను బొట్టూ గాజులూ ఉంచుకుంటుంది- ఆవిషయం అర్థంగాని పంచాయతీ దార్లు ఆమెని పంచాయితీకి పిలుస్తారు- అప్పటికి మామగారు చనిపోతారు. భర్త పోయినప్పుడు సుమంగళిగా ఉండి మామ పోయినప్పుడు విధవ వేషం వెయ్యటం మాకు అనుమానం కలిగిస్తున్నదని ఆరోపణ- కథ విన్న తరువాత అందరూ నిర్ఘాంత పోతారు. ఈ కథ ఏమిటో గా ఉంది. సోమవారం ఏది బాగుంటుంది?

## విశ్వనాథ నాయకుడు

రచన సి. హెచ్. వెంకటప్పయ్య - దర్శకత్వం గోవిందు చౌదరి ఈ వారంతో ఈ నాటకం అయిపోయింది. నాయక రాజుల రాజ్యం ఎలా ఏర్పడిందో చక్కగా చూపించారు గాని. అధికారం అంతా కేంద్రంకే ఉండరాదనీ మండలాధి పతుల అవసరం ఉందనీ సెలవిచ్చారు నాగమయ్య. అది తెలుగునాడు రాజకీయాలని సమర్థిస్తుంటే సహించలేరు. నాటి మండలాధిపతులు దాతలు నేటి మండలాధిపతులు?

## చునౌతి

డ్రగ్స్ ఎక్కువయి రాజా అనే స్టూడెంటు చనిపోతాడు. డ్రగ్స్ వలన ఎన్ని బాధలున్నాయో చెప్పించారు. దీనికి కారణం టోనీ అనే మరో స్టూడెంటు దుర్మార్గుడు. ప్రిన్సిపాల్ దీని బాధ్యత ఎవరిది? అని బాధపడతాడు. డ్రగ్స్ ఇంత ఘోరంగా వ్యాపిస్తుంటే విద్యాలయాధికారులే కాదు ప్రభుత్వం కూడా యుద్ధ ప్రాతిపదిక మీద చర్య తీసుకోవాలి.

"చునౌతి"లో ఒక దృశ్యం



## బంధు

సత్యజిత్‌రాయ్ రచన. అసాసర్‌లో వచ్చిన విచిత్రాకారం హిందీలో బుద్ధూతో మాట్లాడి, ప్రపంచంలో ప్రవరుడి పాద లేపం లాటి శ్వేత కాష్టం ఇచ్చి నీ పేరు బుద్ధినాథ్ శుక్లా - నీవు ఎవరికీ లొంగవద్దు. స్కూలు మాస్టరీ చేయద్దు అని చెప్పి సాసర్ జీవి వెళ్ళి పోతాడు. ఆపళంగా చౌదరీసాబ్ ఇంటి కెళ్ళి అది వరకు వెక్కిరించిన వాళ్ళకు గట్టిగా బుద్ధి చెప్పి ఈ ఊళ్ళో ఇది ఆఖరి సాయంత్రం అని చెప్పి వెళ్ళి పోతాడు. ఈ నాటిక ఏదో ఇంగ్లీషు సైన్స్ ఫిక్షన్ సినిమాలాగా - తప్పితే అల్లాఉద్దీన్ అద్భుత దీపంలా ఉంది. ఇంతవరకూ ఇందులో ఏమీ లేదు.

## వార్తలు

తెలుగుదేశం పార్టీ ప్రధాన కార్యదర్శికి నిధులు అందాయట - రెండు లక్షలు. ఒక సర్పంచికి ఒక ఎమ్.ఎల్.ఏ. వ్రాశారని చెప్పబడుతున్న ఉత్తరం బయట పడింది. కాని చంద్రబాబుగారు అంగీకరించలేదు. విచారణ జరిపించమన్నారుట. ఇది ఋజువయితే రాజకీయాల నుంచి తప్పుకుంటారట.... వీడియో కొనుగోళ్ళలో పాతిక లక్షలు దుర్వినియోగం అయినాయట. అంటే ఇది విద్యాశాఖకి వస్తుంది కాబోలు. నాలుగేళ్ళు వచ్చిన అన్నగారి పరిపాలనలో హోరున సంతోషిస్తున్నది తెలుగునాడు. జైతెలుగునాడు జై. జై. తెలుగునాడు.

## తప్పు - ఒప్పు

సీరియల్ నాటిక- రచయిత గోటూరి అనుకుంటాను- రచయిత ఎవరో తెలుగులో కూడా ఖంగారుగానే ఉన్నాయి- దంపతులు పెళ్ళి కెళదామనుకుంటారు. ఆమె సింగారాన్ని లాయరు, మొగుడు కోర్టు హాల్లోని చెత్త వస్తువులతో పోలుస్తాడు అది హాస్యం కాబోలు. ఎవరో ఒకాయన ఏడుగురు పిల్లలతో దిగుతారు- వాళ్ళని వెళ్ళగొట్టటానికి కోర్టు నోటీసు అద్దె ఇవ్వలేదని కాబోలు అమీనా పట్టుకొస్తాడు. వాళ్ళు భయంతో వెళ్ళిపోతారు. ఇది హాస్యం అనుకుంటే ఆనందించండి ఫ్రెండ్స్. నాకు నవ్వు రాలేదు.

* * * * *

నృత్యం బాబోయ్ నృత్యం. కూచిపూడి నృత్యంట- నేను నృత్యం నేర్చుకున్నాను. చిన్నప్పుడు పతాక, సర్పశీర్ష. లాటివి తెలుసు. విపరీతంగా చదివాను నాట్య శాస్త్రాన్ని- సంగీత నాటక ఎకాడమీ పత్రిక నాట్యకళకి కొన్నాళ్ళు సంపాదకురాలిగా ఉన్నాను. నా కుమారుడు నృత్యం నేర్చుకుంటున్నాడు. మ్యూజిక్ కాలేజీల్లో విపరీతమైన రాజకీయాలున్నై. వాటి నుంచి వచ్చే విద్యార్థులు నృత్యవేత్తలుకారు. వాళ్ళ మాస్టర్ల పాలిటిక్స్‌కి గురయిన అభాగ్యులు. అందుకే వాళ్ళలో మెచ్యూరిటీలేదు. అసలు కారణం అది. అందుకనే మనం ఈ నాట్య విద్యల్ని మెచ్చుకోలేకుండా ఉన్నాం. బహుశా సంగీత కళాశాలలకు సరి అయిన సిలబస్ లేదని అనుకుంటున్నాను. తప్పయితే క్షమించండి. □

# ఇమ్రాన్‌ఖాన్ వివిధ రూపాలు!



302 వికెట్లతో పాకిస్తాన్‌లో వ్యక్తిగత రికార్డు

ఆధునిక ప్రపంచములో సినీ తారలంటే ఉన్న మోజు, ఆకర్షణ ఏ యితర రంగములో వారికి లభించుట లేదు. కాని సినీ తారలు సహితము అభిమానించే, ఆడ తారలను తన చుట్టూ త్రిప్పుకోగలిగిన ఘనత ఒక్క ఇమ్రాన్‌ఖాన్‌కు యున్నది. పాఠశాల బాలికలకి కూడా యితనంటే పిచ్చి. వివాహిత స్త్రీలు యితని ఆకర్షణలో పడటం భర్తలకు ఎంతో యీర్ష్య కలిగించటం అతిశయోక్తి కాదు.

ప్రపంచ అగ్రగామి క్రికెట్ ఆటగాడు, పాకిస్తాన్ జట్టు సారథి ఇమ్రాన్‌కు 'సెక్స్ సింబల్'గా గుర్తింపు కలదు. అందుకు కారణము క్రికెట్ ఆటలో మేటి ఆటగాడు అవటమే కాక ఆకర్షణీయమైన రూపము కలిగి యుండుట. నేడు పాకిస్తాన్‌లో ప్రథమ వ్యక్తి మార్షల్ జియానా లేక ఇమ్రాన్‌ఖానా అని తేల్చుకో వలసిన పరిస్థితి ఏర్పడినది. ఇతను పోటీలలో ఆడుటకు వెళ్ళినప్పుడు ముఖ్యముగా యితర దేశముల పర్యటనలలో ఎంతో మంది మహిళలు ఇమ్రాన్ బస చేసిన హోటల్ వద్ద వేచి యుండుట కనిపిస్తుంది. వాళ్ళకు క్రికెట్ ఆటలో ఎంత ప్రవేశము ఉన్నదీ తెలుసుకొనేందుకు 'ఎల్. బి. డబ్ల్యూ' అంటే ఏమిటని అడిగితే తెలియదు అంటారు. వాళ్ళకు తెలిసినది 'ఎస్. బి. సి' వాళ్ళ భాషలో ఎస్. బి. సి. అంటే 'సెక్స్ బిఫోర్ క్రికెట్' దానికి కారణము ఇమ్రాన్ అంటే వారికి గల అభిమానము.

పూర్తి పేరు ఇమ్రాన్ అహమ్మద్ ఖాన్ నియాజీ. 1952 నవంబరు 25 న పాకిస్తాన్‌లోని లాహోర్‌లో పుట్టాడు. పాకిస్తాన్ క్రికెటర్లు మజీద్‌ఖాన్, జవేద్ బుర్కీ దగ్గర బంధువులు. బి. ఏ. ఆనర్సు (పాలిటిక్స్, ఎకనమిక్స్). అభిమానులు 'ఇమ్మీ' అంటారు. ఎత్తు ఆరు అడుగులు. లాహోర్ కళాశాలల్లోను, వోర్‌స్టర్ రాయల్ గ్రామర్ స్కూల్ కెబ్లి కాలేజి, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలలో విద్యాభ్యాసము. అవివాహితుడు. క్రికెట్ ఆటలో అగ్రగామి, అమ్మాయిలను ఆకర్షించే అందము ఉన్నది. ఉన్నత విద్యావంతుడు. అందుకే యితనంటే అంత మోజు.

కాని క్రికెట్‌తో బాటు అమ్మాయిల జీవితాలతో ఆడాడు. దీనికి కారణము అతనిలో గల 'సెక్స్' 'గ్లామర్' అంటారు. ఏ అమ్మాయిని పెండ్లాడతాను అని వాగ్దానము చేయలేదు. 'సెలిబ్రిటీ' పత్రిక మాజీ సంపాదకురాలు శోభాడే ఇమ్రాన్ 'పురుష మార్లిన్ మన్రో' అంటుంది. జేమ్స్ బాండ్‌గా సీన్ క్యానరీ, రోగర్ మూర్ కంటే 'ఇమ్మీ' బాగా ఉంటాడు అని ఆమె అభిప్రాయము. రేమాండ్స్ మాడల్ గర్ల్ ఉర్మిళా దేశపాండే ఇమ్రాన్ ఆడుతున్నప్పుడు ఆటను కాక అతని కదలికలు ఎక్కువ చూస్తాను అంటుంది. ఇమ్రాన్ తన గురించి "నేను పాగల్ పఠాన్‌ని కాదు, ప్లేబాయ్‌ని అంత కంటే కాదు. అమ్మాయిలు నా ఆకారము చూచి నా వెంట పడ్డారు అంటే నా తప్పు కాదు" అంటాడు. "నా గురించి చెడు అంతా పత్రికలో సృష్టించినదే' అంటాడు. ఇండియా లో సినిమా తార వెంట పడితే తన గురించి లండన్‌లో అందమైన అమ్మాయి వేచి ఉంటుంది అంటాడు. లండన్‌లో అమ్మాయి వెంట పడితే తాను ముస్లింగా పాకిస్తాన్ కన్యను వివాహమాడతాను అని తప్పించుకుంటాడు. పాకిస్తాన్‌లో ముస్లిం కన్య అడిగితే నా స్వభావమునకు సరియైన అమ్మాయి దొరికితే పెండ్లాడతాను అంటాడు. తప్పించుకొని తిరిగే స్వభావం.

68 టెస్టు పోటీలలో 6615 పరుగులు





అమ్మాయిల వలన చికాకు కలిగితే

ఈ ఏడు జరిగే రిలయన్స్ వరల్డ్ కప్ క్రికెట్ ఛాంపియన్ షిప్ తర్వాత 'రిటైర్' అవుతాను అని ఇమ్రాన్ ప్రకటించి సంచలనం సృష్టించాడు. గత 16 ఏళ్ళుగా ప్రథమ శ్రేణి పోటీలలో పాల్గొని ధృవతారగా వెలిగిన ఇమ్రాన్ ఖాన్ ఇంగ్లాండుతో నాలుగు సార్లు, న్యూజిలాండ్‌తో రెండు సార్లు, ఆస్ట్రేలియాతో ఆరు సార్లు, వెస్టిండీస్‌తో మూడు సార్లు, భారత్‌తో నాలుగు సార్లు, శ్రీలంకతో మూడు సార్లు టెస్టు పోటీలలో ఆడాడు. ఇప్పటికి 68 టెస్టులలో 98 యిన్నింగులలో 6615 పరుగులు చేసాడు. గత ఏడు మనదేశంతో ఆడినప్పుడు 135 పరుగుల రికార్డు ఉన్నది. ఇప్పటికి 302 వికెట్లు సాధించి పాకిస్తాన్‌లో వ్యక్తిగత రికార్డు నెలకొల్పాడు. 1982 ఇంగ్లాండు పర్యటనలో మూడు టెస్టు పోటీలలో 200 పరుగులు 20 వికెట్లు సాధించాడు. ఇంగ్లాండుతో 10, న్యూజిలాండుతో 5, ఆస్ట్రేలియాతో 15, వెస్టిండీస్‌తో 12, భారత్‌తో 19, శ్రీలంకతో 7 టెస్టు పోటీలలో ఆడాడు. 1982 నుండి పాకిస్తాన్ క్రికెట్ జట్టు సారధ్యము వహించి 28 టెస్టులలో పాల్గొన్నాడు. స్వదేశములో 28, విదేశాలలో 40 టెస్టు పోటీలలో ఆడాడు.

టెస్టు పోటీలలో వరుసగా మూడు టెస్టులలో 20 వికెట్లు, 200 పరుగులు సాధించిన అగ్రగామి 'ఇమ్మీ' 1982 లో ఇంగ్లాండుపై 212 పరుగులు, 21 వికెట్లు సాధించాడు. బోథమ్ తర్వాత ఒకే టెస్టు పోటీలో సెంచరీ, 10 కి పైగా వికెట్లు సాధించిన వ్యక్తి. 117 పరుగులు, 11 వికెట్లు ఫైసలాబాదులో ఇండియాపై 1982 – 83 పర్యటనలో చేసాడు. 1982 సంవత్సరములో తొమ్మిది టెస్టులలో 62 వికెట్లు కైవసం చేసుకున్నాడు. ఇమ్రాన్ బౌలింగునకు గురియైన అగ్రగాములలో వెంగ్ సర్కార్ (10 సార్లు), గవాస్కర్ (9) దిలీప్ దోషి (8) కపిల్‌దేవ్ (6), మొహిందర్ అమర్‌నాథ్ (6) కలరు.

ప్రపంచ క్రికెట్ రంగములో 300 కు పైగా టెస్టు వికెట్లు సాధించిన వారిలో ఎనిమిదవ వ్యక్తి ఇమ్రాన్. పాకిస్తాన్‌లో ప్రథముడు.

ఇమ్రాన్‌ఖాన్ 1971 లో బర్మింగ్‌హాంలో ఎడ్జ్‌బాస్టన్‌లో ఇంగ్లాండుపై మొదటిసారిగా టెస్టు 'క్యాప్' పొందాడు. ఇంతిఖాబ్ ఆలం జట్టు సారధి. ప్రథమ పోటీలో వికెట్లు ఏమి సాధించలేక పోయాడు. 1974 లో రెండవ టెస్టు అవకాశములో ఇంగ్లాండుపై హెడింగ్లీ టెస్టులో టానీ గ్రెగ్‌ను డిస్మిస్ చేయకలిగాడు (వాసీం బారీ క్యాచ్). 100 వ టెస్టు వికెట్, తన 26 వ టెస్టు పోటీలో 1979 – 80 లో మద్రాసు టెస్టులో సయ్యద్ కిర్మానీ (క్లీన్ బౌల్డ్) నుండి సాధించాడు. 200 వ టెస్టు వికెట్ కూడా మన దేశస్థుడి నుంచే పొందాడు. 1982 – 83 లో కరాచీ టెస్టులో జి. ఆర్. విశ్వనాథ్ నుండి తన 45 వ టెస్టు పోటీలో సాధించాడు. ఇమ్రాన్ వివిధ దేశములలో సాధించిన పరుగులు, వికెట్లు



పాకిస్తాన్ క్రికెట్ జట్టు సారధి 'ఇమ్మీ'

| పోటీ దేశం | టెస్టులు | బౌలింగు | మైడన్ | పరుగులు | వికెట్లు |
|---|---|---|---|---|---|
| శ్రీలంక | 7 | 1734 | 75 | 657 | |
| ఇండియా | 19 | 3965 | 170 | 1756 | |
| ఇంగ్లాండు | 10 | 2351 | 98 | 870 | |
| వెస్టిండీస్ | 12 | 2595 | 91 | 1225 | |
| ఆస్ట్రేలియా | 15 | 3574 | 124 | 1431 | |
| న్యూజిలాండ్ | 5 | 1571 | 32 | 676 | |
| మొత్తం | 68 | 15790 | 590 | 6615 | |

300 కు పైగా వికెట్లు సాధించిన అగ్రగాములు :– బోథమ్(ఇంగ్లాండు) 92 టెస్టులలో 367, డెన్నిస్ లిల్లీ (ఆస్ట్రే) 70 టెస్టులలో 355, రిచర్డ్ హెడ్లీ (న్యూ) 70 టెస్టులలో 355, బాబ్ విల్లీస్ (ఇం) 90 టెస్టులలో 325, కపిల్‌దేవ్ (ఇండియా) 88 టెస్టులలో 311, గిబ్స్ (వెస్టిండీస్) 79 టెస్టులలో 309, ట్రూమాన్ (ఇంగ్లాండు) 67 టెస్టులలో 307, ఇమ్రాన్ ఖాన్ (పా) 68 టెస్టులలో 302 వికెట్లు సాధించారు.

ఇమ్రాన్ సారధ్యములో పాకిస్తాన్‌పై లార్డ్స్ టెస్టులో ప్రప్రథమ విజయం పొందినది. సీరీస్ 1–2 తో ముగిసినది. పాకిస్తాన్ ఇంగ్లాండుతో గత 28 ఏళ్ళుగా ఆటలో సాధించిన మొదటి విజయం యిది.

కౌంటీ పోటీలలో 1971 ఒరష్టర్ షైర్, 1977 ససెక్స్‌లలో ఆడాడు. 1983 ఇంగ్లాండులో జరిగినప్పుడు నుండి ఆడుతున్నాడు. షార్జాలో ప్రవేశించ లేకపోయాడు. 'ఇమ్మీ'కి మద్యం, సిగరెట్ అలవాటులు లేవు. 1981 లో దక్షిణ ఆఫ్రికా పర్యటనకు ఆహ్వానము వస్తే నిరాకరించాడు.

– ముకరమ్

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667


మరులొలికే అందాలక
చెరిగిపోని
బంధాలు...

# మనలో మాట

**మా పాఠకులు, రచయిత (త్రు) లు, ఏజంట్లు, ప్రకటనకర్తలందరికీ వినాయకచవితి సందర్భంగా మా శుభాకాంక్షలు అందజేస్తున్నాము.**

ఈ వినాయకచవితికి ఆంధ్ర సచిత్ర వారపత్రిక 79 ఏళ్ళు పూర్తి చేసుకుని 80వ సంవత్సరంలో అడుగు పెడుతున్నది. ఈ సందర్భంగా ఈ ప్రత్యేక సంచికని ఎక్కువ పేజీలతో మరింత ఆకర్షణీయంగా వెలువరించటానికి మేము చేసిన ప్రయత్నం పాఠకుల ఆదరాభిమానాలు చూరగొంటుందని ఆశిస్తున్నాము.

ఈ ప్రత్యేక సంచికలో పాఠకులకి ప్రత్యేక ఆకర్షణగా ప్రముఖ రచయిత్రి శ్రీమతి కె. తాయారమ్మగారు రాసిన పూర్తి నవల "ప్రేమ సింధువు" ప్రచురించాము. మిగతా మామూలు శీర్షికలతో పాటు వినాయకచవితికి సంబంధించిన ప్రత్యేక శీర్షికలెన్నో ఈ సంచికలో చోటు చేసుకున్నాయి.


శ్రీ ఎం. ఎస్. కామేశ్వరరావు (అద్దంకి)


శ్రీమతి బి. జ్యోతి (నాగపూర్)


శ్రీమతి డి. వసంత (హైదరాబాద్)


శ్రీమతి ఆచంట విజయలక్ష్మి (విజయనగరం)


శ్రీ పి. లక్ష్మీ నరసింహమూర్తి (మదరాసు)

మహిళా పాఠకుల కోసం ప్రత్యేకంగా నిర్వహిస్తున్న 'ఈ కాలం పెళ్ళిళ్ళు' శీర్షికని ఈ సంచికలోనే ప్రారంభిస్తున్నాము.

గత ఏడాదిమేము నిర్వహించిన 'నాకు నచ్చిన వ్యక్తి" వ్యాస రచన పోటీ ఫలితాలని ప్రకటించటం అనివార్య కారణాల వల్ల ఆలస్యం అయింది ఈ పోటీలో వేలాది పాఠకులు ఎంతో ఉత్సాహంతో పాల్గొని, దానిని జయప్రదం చేసినందుకు వారందరికీ మా కృతజ్ఞతలని తెలుపుకుంటున్నాము.

పోటీలో మొదటి బహుమతి అందుకున్న వ్యాస రచయిత శ్రీ ఎం ఎస్ కామేశ్వరరావు గారు ప్రస్తుతం ప్రకాశం జిల్లాలోని అద్దంకిలో అసిస్టెంట్ సూపరింటిండెంట్ ఆఫ్ పోస్టాఫీసెస్‌గా ఉద్యోగం చేస్తున్నారు. నాలుగు పదుల వయసులో తొలిసారిగా రాసిన తమ వ్యాసానికి మొదటి బహుమతి రావటం ఎంతో ఆనందాన్ని కలిగించిందని, క్రమశిక్షణని గుర్తు చేయడానికి రాసిన వ్యాసానికి గుర్తింపు వచ్చినందుకు సంతోషంగా ఉన్నదని పేర్కొన్నారు. వీరి శ్రీమతి ఒంగోలు త్యాగరాజ సంగీత కళాశాలలో ప్రిన్సిపాల్‌గా ఉన్నారు.

వ్యాసరచన పోటీలో రెండవ బహుమతి పొందిన శ్రీమతి బి. జ్యోతిగారు ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకి పరిచితులే. 1985 దీపావళి కథల పోటీలో వీరి కథ ఆరు కథలలో ఒకటిగా బహుమతి నందుకుని పాఠకుల బాలట్‌లో మూడవ స్థానాన్ని పొందింది. మదర్ థెరెసా వంటి వారిని గురించి రాయటం అన్నది నిజానికి వారిని కించపరిచినట్లేనని, ఒకరు మెచ్చుకోడానికీ, నచ్చుకోడానికీ కాకుండా నిస్వార్థ సేవ చేస్తున్న వ్యక్తి ఆమె అనీ నేటి హింసాయుత వాతావరణంలో అటువంటి వ్యక్తి మన మధ్య జన్మించటం దైవ ప్రేరణో, దైవ సంభూతమో అనుకుంటే తప్ప నమ్మలేమని అన్నారు

మూడవ బహుమతి పొందిన శ్రీ పి. ఎ. శర్మగారి పూర్తి పేరు పిశిపాటి ఆంజనేయశర్మ. వీరు పుట్టినదీ, విద్యాభ్యాసం చేసిందీ గుంటూరు మండలంలో ప్రస్తుతం ఒరిస్సా రాష్ట్రంలోని రూర్కెలాలో ఉపాధ్యాయ వృత్తిలో చరమ అధ్యాయంలో ఉన్నామని రాసారు. ప్రతిరూపం అవసరమయ్యే రూపం లేనందు వల్ల తాము ఫొటోలు తీయించుకోలేదని, అందు వల్ల పంపలేకపోతున్నామని రాసారు. వ్యాస రచన పోటీలో పాల్గొన్నది కీర్తి కాంక్షతో కాదని, బాబా ఆమ్‌టే గురించి వినని వారు నలుగురూ ఆయన్ని గురించి తెలుసుకుని ఐచ్ఛికంగా ఆయనకుగానీ, ఆయనలాంటి అజ్ఞాత మహాత్ములకి కానీ ఏ రూపంగా అయినా యథాశక్తి సహాయం అందించగలరన్న ఆశతో తాము ఆ వ్యాసాన్ని రాసామని పేర్కొన్నారు.

ఇక ప్రత్యేక బహుమతులు అందుకున్న ముగ్గురిలో శ్రీమతి డి. వసంత ప్రస్తుతం హైదరాబాదులో జూనియర్ కాలేజి లెక్చరర్‌గా పని చేస్తున్నారు. భర్త శ్రీ దామోదర్‌రావ్ హైదరాబాద్ స్టేట్ బాంకులో ఆఫీసర్‌గా ఉన్నారు. తమకి చిన్నప్పటి నుంచీ వ్యాస రచన అంటే ఇష్టం అని రాసారు.

ప్రత్యేక బహుమతి నందుకున్న శ్రీమతి ఆచంట విజయలక్ష్మి గారు విజయనగరంలోని సెయింట్ జోసెఫ్స్ ఇంగ్లీష్ మీడియం స్కూలులో ఉపాధ్యాయినిగా పని చేస్తున్నారు. జన్మస్థలం కటక్. భర్త పేరు శ్రీ ఆచంట విజయకుమార్, ఒక కుమారుడు, కుమార్తె సంతానం, భర్త సాహచర్యంలో అన్యాయాలని ఎదుర్కోవాలన్న ఉబలాటం ఉన్నదని ఆమె తెలియచేసారు.

మరో ప్రత్యేక బహుమతిని అందుకున్న శ్రీ పిలకా లక్ష్మీనరసింహమూర్తి గారు ప్రముఖ చిత్రకారులు. 1940 నుంచీ మదరాసులోనే నివాసం. వీరికి అఖిలభారత చిత్రకళా ప్రదర్శనల్లో మూడు బంగారు పతకాలు లభించాయి. మ్యూరల్స్ చిత్రీకరణలో వారిది అందెవేసిన చెయ్యి. భార్య శ్రీమతి విజయలక్ష్మి గారి సహకారం కూడా వీరికి ఉన్నది. ఫ్రాన్స్‌లో జరిగిన అంతర్జాతీయ కళా ప్రదర్శనంలో వీరు రెండు చిత్రాలని ప్రదర్శించారు తమిళనాడు లలిత కళా అకాడెమీ వారు 'ఫెలో' బిరుదుతో సత్కరించారు. ఇటీవల తెలుగు అకాడెమీ వారు ప్రముఖ చిత్రకారునిగా ఆహ్వానించి గౌరవించారు. వీరి చిత్రాలనేకం భారతిలో ప్రచురింపబడ్డాయి లండన్‌లోని స్టుడియో, ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా, ఏషియాటిక్ రెవ్యూ, ధర్మయుగ్ పత్రికలలో వీరి త్రివర్ణ, నలుపు తెలుపు చిత్రాలు ప్రచురింపబడ్డాయి. చిత్రకళపై తెలుగులో అడపాదడపా వీరు రాసిన వ్యాసాలు ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ దినపత్రికలలో ప్రచురితమైనాయి.

బహుమతులు పొందిన ఈ ఆరుగురు రచయిత(త్రు)లకు మా ప్రత్యేక అభినందనలు. బహుమతులని త్వరలోనే వారికి అందజేసే ఏర్పాటు చేస్తున్నాము.

బహుమతి పొందిన 6 వ్యాసాలని ఈ సంచికలోనే ప్రచురించాము. □